# The Story

Of

# KING SANTANU.

BY

ANNAMRAJU RAMANAYYA

Reprinted from the Abhinavasaraswati

PRINTED AT THE CHANDRIKA PRESS.
GUNTUR

1916

 *Price As. 14*

అభినవసరస్వత్యనుబంధము,



# శంతనురాజచరిత్రము



ఇది

అన్నంరాజు రమణయ్యగారిచే

రచియింపఁబడినది.

అభినవసరస్వతినుండి పునర్ముద్రితము

మొదటికూర్పు

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

**1916.**



వెల- రు. 0-14-0

# పీఠిక

క॥ కప్పురము గుప్పుగుప్పున
గుప్పినక్రియ సంకుమదము కుంకుమ సోకచోఁ
గుప్పలువోసినక్రియ సభ
మెప్పుగ ఘుమ్మనుచుఁ గవిత మెఱయఁగవలదా॥

అను నీపద్యమును సార్థకపఱచుచు నీప్రబంధము శృంగారరస బంధురంబునునత్యంతహృదయంగమంబునునై యలరారుచున్నయది. శబ్దాలంకారములు నర్థవైచిత్ర్యములును నానావిధశయ్యలును గలిగి నారికేళనమును ద్రాక్షామృదులమును గాక గంభీరతావిశిష్టమగు నీ ప్రబంధము పండితపామరుల కెదఱికిని బరమాహ్లాదజనకమనుటకెంచు కంతయు సంశయములేదు- గ్రంథకర్త యనన్యసామాన్యమగు సంస్కృతాంధ్రసాహిత్యమును సాలంకారపాండిత్యమ్మును గలిగి పద్యములలోఁ బలుపోకడలు కనఁబఱచుటయే కాక వచనములఁ గూడశబ్దాలంకారములతోను నర్థవైచిత్ర్యములతోను నతిగంభీరముగ నడిపించియున్నవాఁడు విజయవిలాసము ముక్తమాల్యదా వసుచరిత్రాదులలోవలెఁ గావ్యచిత్రముగఁ ద్వ్యర్థకసంధులు ద్రుతాంతక్రియాసంధులు మున్నగునవి వాడఁబడినను మొత్తముమీఁద నీగ్రంథ మతిప్రౌఢమై ప్రాక్తనప్రబంధములతోఁదులదూఁగయుండెననుటకు సందియము లేదు-కవినివాసగ్రామము కర్నూలుమండలమండలి మార్కాపురము తాలూకాలోఁ జేరిననరసాయపాలెము-అది శ్రీశైలమార్గమగు దిగువ (చింతగుండ) పాలెమునకు సామీప్యముగ నున్నయది- ఈతనికిఁ బురుషసంతతి లేనందునఁ దత్పరంపరవతికానామముఁ గన్పట్టదు- స్త్రీసంతానము గల్గి తద్వంశక్రమము ప్రకృతము మార్కాపురము తాలూకాలోనిదేయగు నారెవిడుగ్రామమందుండినట్లు తెలియనయ్యెడిని, ఈకవి జ్యేష్ఠభ్రాతయచ్చన్న- ఆయనకు శేషాచలము గరుడయ్య యని యిరువురు కొమరులు శేషాచలమునకుఁ బెదపిచ్చయ్య చినపిచ్చయ్యయను కుమారులును వెంకట

రామమ్మయనుకొమార్తెయును గలిగిరి. ఆ పెదపిచ్చయ్యకొడుకు కచ్చన్నయును జినపిచ్చయ్యకొడుకులు శేషాచలము వెంకటసుబ్బయ్యలును ప్రస్తుతమునరసాయపాలెమున వసించుచున్నవారు. శేషాచలము కొమరితయగు. వెంకటరామమ్మను బల్లానుతాలూకాలోని పెదకొదమగుండ్లయందుండెడి చింతపల్లి సాంబయ్యగారి కొసంగిరి. వారి యౌరసుఁడగు పర్వతాలుగారు నరసాయపాలెమందుండిన తనమేనమామల యొద్ద నీగ్రంథము వ్రాసికొనివచ్చి స్వయముగనే ప్రకటించుతలంపుతో జాలఁ బ్రయత్నించియు దైవసాహాయ్యములేమిని గృతార్థులుకాక తుదకు మాపత్రిక కొసంగుటయు నేఁటి కీగ్రంథము ప్రకటించి గ్రంథకర్త యసామాన్యపాండిత్యమును లోకమున వెల్లడింపఁగలిగితిమి. గ్రంథకర్త యన్నమనుమరాలి కుమారుఁడైన యీచింతపల్లి పర్వతాలుగారి ప్రాయ మిప్పు డేఁబదివత్సరములకు మించియున్నందునఁ దరమున కేఁబదివత్సరములవంతున లెక్కించుకొన్నను నీకవి యిప్పటికి 150సంవత్సరముల మీఁదటివాఁడుగాఁ గాన్పించుచున్నవాఁడు. అప్పటి గ్రంథమై తాళపత్రములపైని బూర్ణసంస్కారులుగాని యొకరియొద్ద నుండి యొకరిచేఁ గ్రమముగా వ్రాసికొనఁబడుచు వచ్చునదగుటచే వ్రాఁతతప్పులు వేనవేలుండి సంస్కరణమునకుఁ జాల శ్రమపడవలసి వచ్చినది. పంక్తులకుఁబంక్తులే వదలిపెట్టఁబడిన స్థలములుకూడఁ గొన్ని యుండ నాయాభాగముల నాకుఁదోఁచినరీతిఁ బూరించితి. అట్టిపట్టులఁ జదువరుల కాభేదము దెలుపునిమిత్తము బ్రాకెట్లు పెట్టఁబడియున్నయవి. ఇందలి ముద్రాపకప్రమాదములు శుద్ధాశుద్ధపట్టికలోఁ జాలవఱకు చేర్పఁబడియున్నను మఱికొన్ని యుండకపోలేదు. అట్టి యత్క్రించి మ్ముద్రణదోషంబు లెవ్వరివో తెలియకున్నను నిరాఘాటమైన యక్షరజ్ఞానముకలవారి కెంతమాత్రము నవేద్యములుకావు కావున రసికజను లెల్లరు నీతద్గ్రంథపఠనమున నానందసంభరితులగుదురుగాక.

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
ఎడిటరు, అభినవసరస్వతి.



# శంతనరాజచరిత్ర

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీరామామణి క్రొమ్మెఱుంగు విజయశ్రీమించు శార్ఙ్గాయుధం
బారూఢేంద్రశరాసనంబై యలర శేషాద్రీంద్రకూటస్థలిన్
రారాజద్గతి నిష్ప్రభద్విజనసారంగాళిఁ గారుణ్యవా
ర్ధారం బ్రోచెడి కృష్ణమేఘము మదాత్మం గొల్చు నిష్టాప్తికిన్॥ 1

శా॥ శ్రీమత్కౌస్తుభరత్నదీప మమలశ్రీవత్సతల్పంబు
ద్దామోదారభుజాచతుష్టయఘనస్తంభంబు నాభీసరో
జామోదస్థితిఁ గాంచినట్టి హరిలీలావాసమై యొప్ప హే
లావాప్తిం బ్రచిరాంతరంగ నలమేల్మంగం బ్రకాశించెడిన్ ॥ 2

చ॥ ధరణిధరంబునం బోఁడిమి తత్కనత్పెలసత్పయో
ధరములఁ బూసి పుట్టిలుదనంబు తెల్పక తెల్పుగా బ
గిరివరకన్యరో! యనుచుఁ గేరుచు వాగ్రచనాచమత్కృతిన్
సరసములాడు శంకరుఁడు శబ్దవిశేషము లిచ్చుఁ గావుతన్॥ 3

సీ॥ ఏతల్లికి సుధాబ్ధిజాత తామరసజాత
సీతాంశువదనలు చెలిమికత్తె
లేరామకుఁ గదంబచారుకాంతారముల్
రమ్యతరప్రియారామపంక్తు

లలితాతన్వికి బాలేందుబింబంబు
పోలుపొందు సీమంతభూషణంబు
లలితాంగికిఁ గైలాసపర్వత
కందరంబులు కేళిమందిరంబు

గీ॥ లలితలోదరి భూరిదాతృత్వమహిమ
యతులితాఖండభోగవైభవాప్తిహేతు
వమ్మహాదేవి నిత్యకల్యాణి గౌరి
మమ్ము నిరతంబు శుభశీల మనుచుఁగాత॥ 4

ఉ॥ "శారద! నెత్తమాడుదమె? చక్కెరమోవులుపందె" మంచు హే
లారసరూఢినాడి మిగులం బ్రియ గెల్చిన యాగపద్మిని
లారచితోరుచుంబనకళాద్భుతచాతురి పూనినట్టి యా
వారిజగర్భుఁడిచ్చు ననివారణ మాకుఁ జిరాయురున్నతుల్॥ 5

శా॥ కారుణ్యాంచదపాంగ నబ్జశరరాకాచంద్రకాసత్సుధా
పారావారశుభాంగ నబ్జజముఖప్రాసాదకేళీనట
త్సారస్యోదయ దివ్యమోహన మహాసాహిత్యసంగీతవి
ద్యారాజత్కుచకుంభ నెంతు వినతాంతర్వాసి శ్రీవాణినిన్ 6

క॥ పాయక భక్తియుక్తి వినాయకు విఘ్నాహిరాడ్వినాయకు ఫలసం
ధాయకుఁ దలఁతుఁ గవిత్వామేయకళానిర్నిరోధమేధాశక్తిన్ 7

సీ॥ భూరివిశ్వంభరాభారధూర్వహణ దీ
క్షావాప్తి నెవ్వఁడు హర్షమొందె
చతుశ్శ్రీవఃప్రాజ్యసామ్రాజ్యవైభవ
స్ఫూర్తిచే నెవ్వఁడు పొలుపుమీఱె

కలశాబ్ధికన్యకాభోగములాత్ముఁ డెవ్వని
భోగతల్పంబున, భోగ మొందె
చిత్రభాసిభావి శేషు భాషాద్యు
ప్రౌఢిమ నెవ్వఁడు రహివహించె॥

నెవ్వఁడలరారెదర హారహీరకాంతి। సమ్మహాదాంతు సకలవిద్యానిశాంతు
మహితసుస్వాంతు శ్రీమంతు బహుళశాంతు। సంతతజ్ఞానవంతు ననంతు నెంతు

ఉ॥ శ్రీయువతీమనోధవు నశేషవిశేషగుణాభిరాము సు
శ్రీయుతసత్త్వముల చెలఁగ సేవక కీర్తన పత్రలీలలన్
బాయనిభక్తిఁ గొల్చు నగపాయుని భక్షితకాద్రవేయునిన్
గేయ మొనర్తు ధర్మధరనిర్మలకాయుని వైనతేయునిన్॥ 9

సీ॥ హిమధామ మల్లికాసుమ శీతమహీరాహి
తారావదాత సుందరము దరము
కోటిచండమయూఖగుప్తమయూఖాగ్ర సు
దర్శనంబైన సుదర్శనంబు
నిజభజనాజస్రనిర్మలసజ్జనా
నూనఫలప్రదమైన గదయు
విక్రమక్రమకళావక్రశక్రాది శ
రాసనంబైన శరాసనంబు

దివ్యశతకోటిశతకోటితీవ్రశాత। విమతజనకంఠలుంఠనవిష్ణుదేవు
నవమనోనందకంబగునందకంబు। మత్కవిత్వాంతరాయముల్ మాన్పఁగాత॥

క॥ నరవిహారాక్రూరపరా। శరరుక్మాంగదవసిష్ఠశౌనకశుకని
ర్జరరణీభవకపిలమరుద్వరసుతులాదియగు భాగవతులఁదలంతున్

మ॥ వినుతుల్ చేసెద సంస్కృతాంధ్రకవులన్ విఖ్యాతవాల్మీకి వ్యా
సుని బాణున్ భవభూతి మాఘుని భోజుం గాళిదాసున్ మయూ
రుని దండిన్ శివభద్రు రంతిని చోరున్ నన్నయం దిక్కనా
ఖ్యుని శ్రీనాథుని సోము భీము నమరార్యుం బెద్దనం బోతనన్॥ 12

క॥ పంకజలోచనలలామ కలితరసత్ప్రబంధసంధానని రా
తంకుమదగ్రపిశాచముహున్నె కటకవిచంద్రుమహృదయవీధిఁ దలంతున్

క॥ కప్పురముగుప్పగుప్పున గుప్పించ్రియ సంకుమదముకుంకుమనొకచోఁ
గుప్పలుపోసినక్రియసభ మెప్పుగ ఘనుమ్మనుముగఁ గవిత మెఱయఁగవలదా॥

వలపించుచుశృంగారవ ఛిలుకుచుమహృదయమును గఱఁగ జేయుచునోహో
వెలవెలఁదిలీలఁ గావ్యమువిలసిల్లఁగవలదె సుకవివరులుమెచ్చన్॥ 15

క॥ సరసులమంచని విద్వత్సరసోక్తుల నెరసులేక సారెకుఁ గుకవుల్
మెఱయుదురీఁగలుగంధపుఁ బరిమళముల్విడిచివ్రణముపరికించుక్రియన్॥

ఉ॥ పెట్టెదమీఁకుదండములు ప్రేలకయుండిన, బ్రేలినంతనే
మొట్టెదకీపర్భాగమునఁ. మూఢకవీశ్వరులార! గట్టిగాఁ
దిట్టుదుఁ గాం కరాంటవిపతీవ్రపటిష్ఠవిశిష్ఠరోక్తులన్
గిట్టుమగొమ్మ మద్రచితకావ్యములో నెరసుల్ గణించినన్॥ 17

వ॥ అని యిష్టదేవతాప్రార్థనాచరణంబును గురుచరణస్మరణంబును బురాతనసుకవీంద్రసముచ్చరణంబును దుష్టకవిజనతృణీకరణంబును గావించి సార్వకాలభవ్యంబును విద్వద్వతంససంభావ్యంబును సుకవిసార్వభౌమశ్లాఘ్యంబును నత్యంతదివ్యంబు నైన నొక్కకావ్యం బనవద్యగద్యపద్యహృద్యంబై వెలయఁ గంజాతసంజాతకంజాతలోచ

నా చరణకంజగుంజన్మంజుమంజీరపుంజ సింజాని నాదమే మురార్భటి ఘటించియుంపంబూనియున్నయెడ, 18

సీ॥ కందర్పశతకోటిసౌందర్యరేఖా వి
రాజితంబు సురేంద్రపూజితంబు
ధళధళోద్యత్ప్రభాకలితకౌస్తుభకంర
భూషణంబు గభీరభాషణంబు
పద్మాంకుశాండజపాశాదిచరణాబ్జ
లక్షణం బురుకృపావీక్షణంబు
దరచక్రశార్ఙ్గనందకగదాయుధబాహు
ధారణంబు సమస్తకారణంబు

గరుడపత్త్రంబు కమనీయకనకచేలమాత్రి తోద్యానవనచ్చైత్యమైనయట్టి
వెంకటాచలనాయకవిగ్రహంబు దర్శనంబయ్యె నెదుటమత్స్వప్నమునను॥

వ॥ ఇత్తెఱంగున మదీయసహస్రకోటిజన్మజన్మాంతరార్జితాగణ్యపుణ్య పరిపాకంబునం బ్రత్యక్షంబైన యద్దేవతాసార్వభౌముశ్రీపాదపద్మంబులకనేకసాష్టాంగదండప్రణామంబులత్యంత వినయతాత్పర్యంబుల నాచరించియానందబాష్పజలబిందుసందోహనయనారవిందుండనై లేచి నిటలతటఘటితకరపుటుండనగునన్ను నశీతలసకృపాకటాక్షవీక్షణంబు లనిరీక్షించి లక్ష్మీవల్లభుండు మృదుమధురసరసవచనరచనల నిట్లని యానతిచ్చె, 20

క॥ "మీవారలెల్లనుత్సవ సేవ నతంత్రపు యతితలురు గానక
నీవుమదీయాంకితముగ ని పుము తెనుగున కావ్యమునతా॥ 21

వ॥ అదిమొట్టిసంకేసని, 22

మ॥ విపులస్వాంతుఁడు శాంతనక్షితిపుఁ డుర్వీమండలం బేలుచున్
మమతన్ స్వర్నది యొక్కకారణమునన్ మత్స్యాంబుజాతాక్షియై
రమణుంగోరినఁ బెండ్లియాడె వెస నారాజన్యగాథాళి పం
చమవేదోక్తముఁ బోలినట్లగుటఁ దత్సందర్భభావార్థముల్
క్రమమొప్పార నెఱింగి సుప్రియముగాఁ గావ్యంబుగావింపుమా॥ 23

మ॥ లలితాంచత్పదసంగతిం దగి రసాలంకారభావోన్నతుల్
వెలయన్ శయ్యలఁ జారురీతులను ఠీవిం జెంది సద్వర్ణసం
కలనం జెందిన యీ మనోజ్ఞకవితాకన్యన్ శుభశ్రీకళా
కలితన్ వేడ్కవరింతు శాశ్వతమహాకల్యాణసంధాయినై" 24

వ॥ అని తెల్పి యంతర్ధానంబునొందె, నేను మేల్కాంచి చం
చత్కౌతూహలాద్భుతాక్రాంతస్వాంతాంబుజాంతరాళుండనై యప్పు
రుషోత్తముదివ్యమంగళవిగ్రహంబు పలుమాఱుఁ దలంచి నమస్కరింపు
చుఁ జిత్తంబున నిట్లని వితర్కించితి, 25

శా॥ "శ్రీలక్ష్మీసరసోక్తులన్ దెలుఁగు రాజీవాక్షు నస్మద్వచో
లాలిత్యం బలరించునే యనుచు నేలా నే విచారింపఁగాఁ
గేహప్రౌఢశుకీవిలాసరసనాక్రీడాత్తమున్నాఁ దా నేర్చికన్
బాలత్వంబున నొప్పుచిల్కపలు కానందంబుఁ జెందింపదే॥ 26

ఉ॥ శంతనచక్రవర్తి విలసచ్చరితంబున కంబుజాలయా
కాంతుఁడు నాథుఁడౌట జగి గల్గిన పైఁడికిఁ బారిజాతపు
ష్పాంతరసారసౌరభమహావిభవంబు భవంబుఁ జెందిన
ట్లింతియెకాక వేఱెకలదా తలపోయఁగ నెన్నిభంగులన్" 27

వ॥ అనితలంచి మదీయాన్వయక్రమం బభివర్ణించెద, 28

—కవివంశానుక్రమణిక.—

సీ॥ సంతతనిజమిత్రశతపత్రశతపత్ర
మిత్రు లాపస్తంబసూత్రు లెన్న
బహుళసజ్జనబృందసహకారవనషండ
చైత్రు లాపస్తంబసూత్రు లెన్న
హృద్యానవద్యసద్విద్యావిలాసవై
చిత్రు లాపస్తంబసూత్రు లెన్న
ఘనయశోనిర్జితాకాశసరిత్స్వోత
గోత్రులాపస్తంబసూత్రు లెన్న

గీ॥ వారిలోనమహోజ్వలావార్యశౌర్య
ధైర్యగాంభీర్యవీర్యచాతుర్యములను
వెలయు నార్వేలవంశాబ్ధిజలజవైరి
మహితగుణశాలికృష్ణయామాత్యమౌళి। 29

సీ॥ "అఘవిదూరప్రభావాభిరామతగాంచి
సత్యానుకూల్యప్రశస్తి నొంది
విబుధాభిగణ్యసాత్వికవృత్తిచెన్నొంది
గోత్రావనస్ఫూర్తిఁ గొమరుమిగిలి
కమనీ హాలక్షణాలితలీల [illegible]గి
గురునందకోదండగరిమగాంచి

భద్రాశ్వత్రోరువైభవమునఁ గన్పట్టి
యతులి తానంతవిఖ్యాతిమించి॥

గీ॥ యంచితాకృతిసాక్షాత్కరించినట్టి। కృష్ణదేవుండుగాక తాఁ గేవలుండె”
యనుచు సర్వజనంబులు వినుతిసేయ ధర శెఁగ నయ్యెఁ గృష్ణప్రధానవరుఁడు

క॥ అన్నమరాట్కృష్ణయబుధ।సన్నుతమతిమూసలమాంబ సరవి వరించెన్
వెన్నుఁడు మును కలశాంబుధికన్నియ వరియించులీల గనుపట్టంగన్ ॥31

సీ॥ పరఁగంగ విషరాశిభవముగాంచని లక్ష్మి
చండికాఖ్యఁ దాలుగు శంభురాణి
శక్తి గర్భమునఁ గాంచని యరుంధతి పుణ్య
జనవైరులను వేడ్కఁ గనని యదితి
శివధర్మభంగహేతువుఁ జెందని మహీజ
పాకారి భర్తఁగాఁ బడయని శచి
దోషాకరప్రాప్తిఁ దొలఁగిన రోహిణి
విషమగోత్రస్థితి వెలయని ధర 31

కాక సామాన్యసాధ్వియే గణుతిసేయ। కృష్ణయామాత్యరామసత్కీర్తిధామ
భూరిముఖకాంతివిజితసంపూర్ణసోమ। రసికనుతసద్గుణకదంబ ముసలమాంబ॥

క॥ వారల కుదయించె మహో।దారగుణాధారుఁ డతులధర్మవిచారుం
డారూఢిఁ జెన్నయాఖ్యుఁడు। శౌరికి రుక్మిణికిఁ బంచశరుని విభాతిన్॥ 33

ఉ॥ శ్రీనిధియై ప్రకాశమునఁ జెల్వగు చెన్నయమంత్రి సత్కృపా
మానితశౌర్యసత్యసుకుమారయశఃక్షమ లార మాధవున్
వానిమఱంది వానిగురు వానికుమారుని వానియగ్రజున్
వానియనుంగు బావ ననివారణలీల హసించెఁ జిత్రతన్॥ 34

సీ॥ ఎవ్వాఁడు శ్రీవెంకటేశ్వరప్రీతిగా
నన్నసత్రములు విఖ్యాతిఁ బెట్టె
ఎవ్వాఁడు శ్రీవైష్ణవేంద్రుల కతులితా
నేకాగ్రహారముల్ పీఁక నొసఁగె
ఎవ్వాఁడు సామంతహీనమంత్రీశుల
గండణంచెను గోలకొండలోన
ఎవ్వాఁడు గజవాజిబృందపర్యంకిక
చ్ఛత్రముల్ కొనెఁ బాదుషాహచేత
తే॥ స్థిరత నెవ్వాఁడు దూపాటిసీమకెల్ల
మేటిగణికాగ్రణి యనంగ మెచ్చువడసె
అతఁడు సామాన్యుఁడే మహోన్నతివిభూతిఁ
జత్రచతురవచస్సంత్రి చెన్నమంత్రి॥ 35

ఉ॥ అన్నమరాట్కులాంబుధిసుధాంశుఁ డుదంచితకీర్తిశాలి యీ
చెన్నయమంత్రిశేఖరుఁ డశేషజనస్తవనీయవైభవుం
డున్నతచెన్నమాంబ సుగుణోజ్జ్వలఁ బ్రీతి వివాహమై కనెన్
గ్రొన్ననవింటివానినగుకోమలునిన్ నరసాభిధానునిన్॥ 36

క॥ నరసప్రధానశేఖరుఁ గురుకీర్తి చెలంగె సారకుంజర తారా
వర నారద హార పారద శర హీరధరాహిరాజసన్నిభముగుచున్॥ 37

సీ॥ గంభీరగుణమునఁ గలశపాథోరాశి
సత్యలీలల హరిశ్చంద్రవిభుఁడు
ధర్మమార్గస్థితి ధర్మతనూజుండు
సురుచిరశేముషి సురగురుండు
స్థిరదయాసంపత్తి శ్రీరామచంద్రుండు
భాసురసందీప్తి భాస్కరుండు

భూరివైభవమందు క్షీరభృద్వాహుండు
దానవిస్ఫూర్తి సంతానతరువు
తే॥ కోమలాకారమున నలకూబరుండు
సుందరకళాలిశయమునఁ జందురుండు
బాపురేయని తను జనుల్ ప్రస్తుతింప
మహిమఁబెంపొందె నరసయామాత్యమౌళి॥ 38

క॥ ఆమంత్రిమణి ప్రకాశనభోమణి కల్యాణమయ్యె భువి నెల్లను శ్రీ
రాముఁడు సీతాదేవిన్ బ్రేమంబున బెండ్లియాడు పెంపుచెలంగన్ ॥ 39

సీ॥ మగనిశరీరంబు సగము సేయకయున్న
నార్యనించుక సాటియనఁగవచ్చు
జాతిహీనులయందు జాత మొందకయున్న
నల యరుంధతి సాటియనఁగవచ్చు
కోరిసుధాశను గురులీలఁగనకున్న
నదితి నించుక సాటియనఁగవచ్చు
చాంచల్యచిత్తయై సంచరింపకయున్న
నబ్జగేహిని సాటియనఁగవచ్చు
తే॥ ప్రాణనాథున కతులసౌభాగ్యమొసఁగి
సత్కులంబునజన్మించి చారుశీలు
లైనపుత్రులఁబడసి విఖ్యాతి సుస్థి
రాత్మయై చెల్వుమీఱెల్లమాంబికకను॥ 40

క॥ ఆదంపతులకు నందను లైదుగురుదయించివెలసి రవనీస్థలిపై
శ్రీదైతాయుధ హారశ్రీదాదిత్యమహీజపంచకాంచితలీలన్ 41

వ॥ అం దగ్రనందనుండు॥ 42

సీ॥ వెలసి మిల్లెముపల్లి వేణుగోపాలాంకి
తంబుగ శతకద్వయంబుఁ జేసె
తియ్యనిమాటలఁ దెనిఁగించె ద్విపదగాఁ
గర్ణామృతశ్లోకగణములీల
జ్యోతిషమున సూర్యచంద్రసిద్ధాంతసం
విత్ప్రకాశతఁ జెంది వినుతిగాంచె
బంధాశుమధురగర్భకవిత్వవిరచనా
ప్రచురకౌశలమునఁ బ్రాభవించె
తే॥ ఇంగిరానాథచరణారవిందయుగళ
భక్తిసంయుక్తిఁ బ్రహ్లాదబలివిభీష
ణాంబరీషుల నాటియంచనఁగ మెఱసె
రుచిరగుణపాళి వెంకటసచివమౌళి 43

వ॥ రెండవనందనుండు॥ 44

తే॥ రాజితౌదార్యమున సురభూజరాజు
భూరివిద్యామహోన్నతి భోజరాజు
రమ్యమానధనంబున రాజరాజు
చెన్నకృష్ణుండు సజ్జనసన్నుతుండు॥ 45

వ॥ తృతీయనందనుండు॥ 46

తే॥ ధర్మములకెల్ల నెలవు సత్యములతావు
భూరివిద్యలకెల్లను బుట్టినిల్లు
ఘనదయాగుణగణముల యునికిపట్టు
చండధామప్రభాస్ఫూర్తి కొండమంత్రి॥ 47

వ॥ నాలవనందనుండు॥ 48

తే॥ మహితనయశాలి దుర్మదమండలేంద్ర
మంత్రిదుర్గర్వభారనిర్మథనకేళి
భాసురసుశీలి సజ్జనపద్మహేళి
ధర్మగుణపాళి లక్ష్మప్రధానమౌళి॥ 49

వ॥ అయిదవపుత్రుండు॥ 50

తే॥ కేశవపదాబ్జచింతనావేశనిశ్చ
లాంతరంగుండు శరహీరహారతార
కాచలాంబరతటినీసుధాంశుకిరణ
కీర్తికలితాఖిలాశుండు కేశవుండు॥ 51

వ॥ వారిలోన॥ 52

క॥ గురుగతి లక్ష్మణమంత్రికి నిరుపురునందనులుపుట్టి యొసఁగిరి విశ్వం
భరయందు వోబమాంబా సురుచిరసద్గర్భశుక్తిశుక్తిజగతులన్ ॥53

తే॥ అగ్రతనయుండు మద్గురుం డనఘమూర్తి
చాగుతరకీర్తి సజ్జనచక్రవర్తి
సురుచిరస్ఫూర్తి వెంకటనరసమంత్రి
నయతఁ బేరయయంద్రుఁడు రెండవతనూజు॥ 54

క॥ హారితసగోత్రుఁడు వెంకటనరసయయుద్వాహమయ్యెనానాసుగుణో
త్కరఁగొండమాంబికనుఘనపురుషోత్తముఁడబ్ధిరాజుపుత్రికఁబోలెన్

ఉ॥ రాములుపెక్కు లెన్నఁగ ధరాస్థలి, వారలుసాటివత్తురే
శ్రీమహితోరుసద్గుణవిశేషములం దగుకొండమాంబకున్
రాముని తల్లిగాక రఘురాముని తల్లియుఁ గాక నందనా
రాముని తల్లిగాక బలరాముని తల్లియుఁగాక చిత్రతన్ ॥ 56

తే॥ వారలకుమేము ముగుర మవార్యలీలఁ
బుట్టితిమి మూడుమూర్తులపోల్కిఁదోఁప

అగ్రజుఁడు వెంకటాచలం బమర రమణ
యాఖ్యగలవాఁడనే, నచ్చనాహ్వయుండు॥ 57

క॥ శ్రీ వెంకటగిరివల్లభ సేవాపరతంత్రహృదయశీలుఁడఁగాన౯
భావింపఁగ విద్వత్సంభావనకర్హుఁడను మిగులఁ బ్రజ్ఞాన్వితుఁడ౯ ॥58

వ॥ ఈదృశుండనగు నాచేతఁగల్పితంబగు నేతత్ప్రబంధంబున
కథనాయకుండగు శ్రీవెంకటాచలనాయకునకు షష్ఠ్యంతంబులు॥ 59

## షష్ఠ్యంతములు

క॥ శ్రీమద్వైకుంఠపట్టణధామున కఘతిమిరచండధామునకు సుధా
ధామకులవార్ధిపార్వణ సోమున కశ్రాంతభూరిశుభనామునకు౯ ॥ 60

క॥ కాళిందీతీర నికుంజాళిందభ్రమిత గోపయూథాంతధృతికి౯
నీళాబాలాహేలాఖేలాలోలాతిలస దకిల్బిష మతికి౯ ॥ 61

క॥ తారాబలతారాచలహీరాచలభిత్కృపాణ హిమధామశర
స్ఫారదదరనారదశర పారదహారగౌరకీర్తిపద్మాపతికి౯ ॥ 62

క॥ ద్విజరాజపుత్రినకు సద్ద్విజరాజమనోజ్ఞకులపవిత్రునకు రవి
ద్విజరాజనేత్రునకురుద్విజరాజద్భోగిశయనవిచిత్రునకు౯ ॥ 63

క॥ హలకులిశశంఖచక్రోజ్జ్వలరేఖాకలితలలితచరణారుణతా
మలఘుఘృణిమశిసూపరితాఖిలకృతకేతరవచస్సుకీర్తియుతునకు౯ ॥64

వ॥ అద్వయతాద్వయజపకృద్ద్విద్వద్వరసాద్వసాద్వవినిరోధునకు౯॥
విద్విడ్ధ్వజినీశద్విరదద్విపవిద్వేషిరోషదరఘోషునకు౯ ॥ 65

క॥ బలహరిగురుధృతికివిహారిబలగురుధృతికి నబాధబాహాహార్యాన్నతికి౯
జలరుహసంభవసంభవజలరుహశరహరణశరణచరణస్తుతికి౯ ॥ 66

క॥ అలమేల్మంగామానసజలరుహదినపతికి నీలజలదద్యుతికి౯
గులధరధృతికి గభీరాత్యలఘుగుణోన్నతికి వెంకటాచలపతికి౯॥ 67

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శంతనురాజచరిత్రం
బునకుఁ గథాసూత్రం బెట్టిదనిన॥ 68

## కథాప్రారంభము

క॥ జనమేజయభూపాలుఁడు మనమున సంతోషవార్ధిమగ్నుండగుచున్
దనునడిగిన వైశంపాయనుఁ డిట్లని చెప్పఁదొడఁగె నతిచతురతన్॥

## పురవర్ణన.

సీ॥ కృతకాచలనితంబ కేళీసరఃపద్మ
వనగంధి గంధిలఘనపదంబు
సద్మోపవనకీరశారికాపఠిత స
త్కరినశృంగారార్థకావ్యసమితి
కనకగోపుర శృంగఘటితకంఠీరవ
దర్శనక్షుభిత త్రిదశగజంబు
కేతనపటజాతవాతధూతామరీ
జాతకర్కశకుశచ్ఛన్న శాటి
తే॥ జగతినొప్పారు సువిశాలసాలజాల
నీలనీలచ్ఛవిచ్ఛటోత్తాలకాళి
కాభ్రమాదభ్రతాండవాఖండకృచ్ఛి
ఖండిమండలరుచిరంబు కరిపురంబు 70

సీ॥ వర్ణనీయానంత వాహినీయుక్తంబు
రమణీయ బహువనరాజితంబు
బంధురప్రస్ఫురద్బాడబస్థానంబు
మానితపురుషోత్తమ లసితంబు
తతరాజమండలోదయ జృంభమాణంబు
సంతత శ్రీకళాసంగతంబు
చారుతరానేక సద్గోత్రకలితంబు
సుందరహరివర మందిరంబు

తే॥ అవని రత్నాకరంబిదియనఁగ వలయుఁ
త్రిదశజననేత్ర చిత్రచిత్రితసుచిత్ర
పుత్రికాగణ్యలావణ్య భూషితంబు
పుణ్యనిలయంబు వేదండపురవరంబు 71

క॥ స్వాంతోరుగభీరతలన
సంతమణిప్రాప్తులుగనినవి సర్వజన
స్వాంతమున కెంతయునుగడు
వింతగుకోటయునగడ్తవీటఁజెలంగున్ 72

తే॥ భూరిరుచిరాబ్జల సదలంకారియగుచు
శౌరిడాకన్ను చెన్ను నామీఱెఁ బరిఘ
దివ్యఘనసీల శోభాప్రదీప్తమగుచుఁ
గాలగళకంఠలీలను సాలమొప్పె 73

తే॥ వింధ్యనగసింధుపుల్ నిజద్వేషియైన
కుంభసంభవు శుంభద్విజృంభణంబు
బలిమిమైమాన్పనొక్కచో నిలిచినట్లు
భూరితరసాలఖేయముల్ పురిని వెలసె 74

తే॥ సౌధయూధ విహారరాజన్యకన్య
కాస్యనిజరుచి తారతమ్యములు తెలియ
మహిమఁజంద్రుఁడురా శిరోగృహము లెల్లఁ
జంద్రశాల లనంగ నచ్చటఁజెలంగె 75

ఉ॥ నీరజవీక్షణావితతి నిద్దపుమేడలఁ గ్రీడలాడుచున్
దోరపుఁగ్రొత్తముత్తెములు దోయిఁటితోనిడి యన్నికప్రిమ్ములన్
సౌరవిలాసినీచయ మెసంగఁ బొసంగ నొసంగఁ గైకొనున్
సౌరభసారపూర హరిచందనసూనము లప్పురంబునన్ 76

మ॥ పురిచంద్రోపలసౌధవేదికలు సంపూర్ణక్షపాపత్యుద
త్కరయుక్తిన్ సెలయేఱులై డిగి యగడ్తం జెంద్ధ నుత్స్యాంద్రమ
త్యుగువేగాచ్ఛరసాభిముఖ్యమహీశోద్యోగంబునం జాలకాం
తరనర్తిష్ణునవగ్రహాప్తిఁదగు, లేదా? మింట మీనుండునే 77

సీ॥ పారిజాతలతాంత సారసౌరభములు
ఘ్రాణరంధ్రంబుల గారవింప
గగనగంగాతరంగములఁదోఁగిన శీత
గంధవాహము ఘర్మకణములణఁప
కిన్నర మధురసంగీతారవంబులు
శ్రవణరంధ్రములకు సౌఖ్యమొసఁగ
సాంద్రంబుగాఁగాయు చంద్రాతపంబులు
పొలుపొందబడలికల్ తొలఁగఁజేయ

తే॥ సొలసి యదిరుంతురతి చండసూనకాండ
భండనాసల్పకల్పిత బహుళబాధ
నాంచదాలింగకృన్మనోహరపరిస్ఫు
రాంగులై దంపతుల్ పురిహర్మ్యములను 78

తే॥ ఆవగరి నర్మభర్మ్యహర్మ్యాగ్రసుస్థి
తాబ్జదృగ్గానరావ మభ్రాపగార
విందమకరంద తుందిలేందిందిరప్ర
కాండఝుంకారఘోషంబు గలసిమొలఁగు 79

క॥ పురరత్నగోపురంబుల
సరి మధ్యాహ్నార్ధరాత్రసమయంబుల భా
స్కరశశిబింబములలరును
గరమురుమగఁగనఁ గరజతకలశములక్రియన్ 80

చ॥ ఘనతరచిత్రతల్ గలిగికన్నులపండువుగాఁ దనర్చుప
ట్టణవర మెల్లబోటులు దృఢంబెసఁగం గలయంగఁజూడఁగా

మనములనిశ్చయించి సురమార్గమునం దగ దక్షిణోత్తరా
యణవిలసచ్చలంబుల విహారము సేతురు భానుచంద్రముల్ 81

క॥ నూతనకేతువ్రాతా।న్వీతాంశుకజాతవాతపీతశ్రమ సౌ
ఖ్యాతత వైమానికసం।ఘాతము తత్పురము తరమె గణుతింపంగన్ 82

సీ॥ కర్పూరకాశ్మీరగంధచర్చితవృత్తి
గురుపయోధరములఁ గుప్పళించి
కజ్జలపంకరేఖామిళద్భృంగా?
నేత్రసారసముల నృత్యమాడి
కస్తూరికాతిలకప్రశస్తమనోజ్ఞ
ఫాలస్థలంబులఁ బరఁగువాణి
బంధురసౌరభప్రసవమాలావృత్తి
కబరీభరంబుల గంతునైచి
తే॥ గంధవహసంజ్ఞసార్థకగతిని జెలఁగఁ
జండతరపుండ్రకోదండఖండనోగ్ర
జాతసంశ్రమమణఁగించి సౌఖ్యమొసఁగు
వాతపోతంబు తత్పురివనితలకును 83

తే॥ రమ్యబహుళార్తిఁ జేఁగుంను రాజుపొందు
చాలుమాకని తారకాజాలమెల్ల
నచటికేతెంచియుంబోయనఁగనూత్న
రత్నముల చేతవిపణిమార్గంబులొప్పు 84

క॥ రంగద్భటసారంగతు।రంగోద్భటపటుశతాంగరాజిచెలంగన్
శృంగాటకస్థలంబులు।శృంగారముగాఁగ నగరసీమపొసంగున్ 85

సీ॥ విప్రవర్ణోన్నతి వెలసియుందురుగాని
తతపక్షపాతసంయుతులుగారు
ద్విజరాజకీర్తిస్ఫూర్తిఁ దేజరిల్లిరిగాని
ఘనగురుప్రమదానగతులుగారు

బాడబవిఖ్యాతిభాసిల్లుదురుగాని
బహుజడోద్వృత్తివైభవులుగారు
బ్రహ్మసంతతియనఁబ్రబలియుందురుకాని
చిరపంకజాతసంస్థితులుగారు
తే॥ వీరలంచు నుతింతురువిబుధవరులు
జ్యోతిషవ్యాకరణనిరుక్తేతిహాస
వేదవేదాంతసిద్ధాంతవిశ్రుతార్థ
వాసనాభాసురులు పుణ్యభూసురులును 86

సీ॥ మహనీయవిపులధర్మగుణప్రకాశులు
రణములందును వితరణములందు
రమణీయతరరాజరాజసమానులు
ధనములందును మానధనములందు
కమనీయకల్యాణ దమనోరుచిరవృత్తు
లర్థులయందుఁ బ్రత్యర్థులందు
వర్ణనీయఖగానివార్యవిస్ఫూర్తులు
కరములందును రుక్మకరములందు
తే॥ కలితతుంగతురంగరంగచ్ఛతాంగ
మంగళాభంగ మాతంగసంగరాంగ
ణాంగపాటన భటచతురంగ బలవి
రాజులై యొప్పు నప్పురిరాజులెల్ల 87

క॥ రత్నాకరరోహణగిరి। రత్నములకనంతరత్నరాజత్సుమహా
యత్నతసమతఘటించి ఖ।రత్ననిధులుపోల్తు రప్పురంబునవైశ్యుల్

చ॥ హరిపదభక్తిసంభరణతాహతనిస్తులదుస్తరాఘులై
హరిపదభాగ్యభోగ్యశుభదాతృయవిశ్రుతభోగభాగులై
హరిపదవీథిరోధక మహాప్రతతాద్భుతధాన్యవంతులై
హరిపదపంకజాతభవు లప్పురిఁబొల్తు రనంతసౌఖ్యులై 88

సీ॥ వేదండములనెంచుఁ గోదండములనొంచుఁ
బాలుపైనయానముల్ భ్రూయుగములు
కులధరంబులమీఱు జలధరంబులఁగేరుఁ
గుచకుంభయుగళముల్ కచభరములు
ఫణిరాజములదూఱు మణిరాజములమాఱు
వింతనూగారులు దంతములును
మధుకరంబులఁదోలు విధుకరంబులఁబోలు
నందమౌచూపులు హాసములును
తే॥ బాగుగాఁగలిగియుండు రప్పట్టణమున
శంబరాంతకశాంబరీడంబరావ
లంబమోహానరుచిరకలాకదంబ
కలితయువలోకవతులైన కన్నెసతులు 90

సీ॥ "నాతిరో! చూపవే నల్లకల్వలదండ
పగలుచూపఁగరాదు సొగసుకాఁడ!
పణఁతి! గోరంటపూబంతులిచ్చెదవఁటే?
రహి వాడిచెడిపోవు రవ్వకాఁడ!
ఇంతి! యీలతకూన కేలపువ్వము లేదె?
వర్షముల్ చాలవు చన్నెకాఁడ!
తరుణి! గెంటెనవిరి దాఁచనేటికి? వేళ
రా మాటుసేతునా కోమలాంగి!"
తే॥ అనుచుఁ బువ్వులమ్ముదు రప్పురమున
విమల మందారకుందారవిందకంద
రాళహల్లకమల్లికారమ్యబంధు
జీవికలు పుష్పలావికల్ చెలువుమీఱి 91

సీ॥ హరినీలచకచకల్ నెఱయుకీల్జడల చేఘనులవిస్ఫూర్తి చీకాకుచేసి
నిద్దంపుటద్దంబు నిగ్గొను మోములరాజమండలలీల రహినణంచి

తీరైనచీమలబారుగేరారులభోగులనిలుకడల్ పోవఁజేసి
సురపొన్నపువ్వుల సౌరలించునాభుల సరసులగంభీరగరిమమాన్పి

తే॥ వన్నెకెక్కిరి యప్పురవరమునందు
సతులవై సారిణాంకశాస్త్రార్థకలిత
మృదులసంగీతమంగళమిశ్రనృత్య
సారచాతుర్యవతులైన వారసతులు 92

సీ॥ ఊరూరుసంయుక్తి నొదవినయప్పుడు
సలలితరంభాప్తిఁగలిగినటులఁ
బాలుపొంద మధ్యముల్ పొదవినప్పుడు మాని
తానందలీల మిన్నందినటులఁ
గులుకుకుచంబుల గోరంటినప్పుడు
ప్రాచుర్యగతిఁ గొండఁ బ్రాకినటులఁ
గిజ్జెడల్ సందిటఁ గీలించునప్పుడు
చిరఘనైశ్వర్యముల్ చెందినటుల

సంతసింతురుతములోన సాంద్రచంద్ర
చంద్రికాభాసమానచంచత్ప్రదేశ
వారనారీమణీరతి వైభవములఁ
బట్టణమునందు మన్మథభటులు విటులు 93

సీ॥ "ద్విపిశాహీనభూతివిరాజితంబులై
కలితనాగేంద్రలీలలఁ జెలంగ
ఘనదానవిధవప్రకాశమానంబులై
కర్ణాధికశ్రీలగణనకెక్క
వితతనీలాంబరప్రతిభలనొప్పారి
బలభద్రగతులచేఁ బరిఢవిల్ల

అతులితపురుషోత్తమాభిరామంబులై
కమలాహితోన్నతుల్ గలిగి యెసఁగ"

వ. నుచు సర్వజనంబులు వినుతిసేయ
వెలయు సురకుంజరవిశేషకలితరదన
శతభిదురప్రహారమూర్ఛీకృతాంగ
శిఖరములు పట్టణముగంధసింధురములు 94

సీ॥ "విజయప్రభావత విలసిల్లియుండియు
సైంధవస్ఫూర్తిఁ బ్రశస్తమయ్యు
రహిని శ్రీకంఠాభరణసమున్నతిఁ గాంచి
బహుళసదాగతిప్రాప్తి నెసఁగి
కమనీయతరహరిఖ్యాతిఁ బెంపొందియుఁ
బున్నాగసంగతి వన్నె కెక్కి
నిరుపమదేవమణిప్రకాశతమించి
పరిబభీకరస్ఫురణ నెసఁగ"

ననుచుఁ బురిఁ జిత్రముగ జను లభినుతింపఁ
బరఁగఁ గల్యాణపల్యాణబద్ధయుద్ధ
కాలరింఖావిశృంఖలాఘాతజాత
ధరణితలధూళిపటలంబు తురగకులము 95

సీ॥ శతపత్రనేత్రాప్రసవ్యబాహుప్రభంగి రంజితచక్రనిర్వక్రమగుచు
రమణీయధారాధరద్వారమును బోలి చిరతరకేతుసంశ్రితమగుచు
కలధౌతభూమిభృత్తిలకంబుగ మరికరాజావతంసాభిరామమగుచు
జంభాసురారాతికుంభిరాజము భంగిఁ గల్యాణకుంభవిఖ్యాతమగుచుఁ
బరఁగెనచ్ఛోటరోహణభర్మశైల। రంగదుత్తుంగశృంగారశృంగదివ్య
మంగళవిలాసభూసురభంగనూత్నరత్నహేమమయంబు సద్రథవయంబు

క॥ హరిఁగఱకఱినుఱుమాడుదు। రరిమురిగిరులెగురనై తురతిసత్వములన్
బొరిపొరి బిరుదులుగలిగిన। కరిపురవరవీరభటులు కలహారభటులై

ఉ॥ చాలుగనొప్పుచుండు నవచందనకుందతమాలతాలహిం
తాలగసాలసాలవటదంతశరామ్లలవంగలుంగత
క్కోలకదంబముఖ్యతరుకుంజగముజ్జ్వలపుష్పమంజరీ
జాలసుగంధబంధురవిశాలమహావనపంక్తు లప్పురిన్ 98

సీ॥ వంకెలు జవ్వాజివంకెలు పొన్న శ్రీ
రాజనా ల్విప్పపూరాజనాలు
మల్లెశ్రీగంధులు మదనగంధులు రామ
బాణముల్ మన్మథబాణములును
గర్పూరములు పచ్చకర్పూరములు జుచ్చుఁ
బాలవల్లులు ముద్దుఁబాలవల్లు
గుత్తులు మామిడిగుత్తులు బంగారు
తీఁగియల్ పగడంపుదీఁగియలును

మోహనసతులు లక్ష్మీమనోహరాలు
భారతీభూషలును గొంగుఁబాలు గౌరి
కుంకుమలు నను పేళ్ళకుఁగూడి వన్న
తలచుగాఁబండు నచటి కేదారములను॥ 99

వ॥ వెండియుఁ దత్పురభేదనప్రకాండాంబఖండోద్దండవేదండగండస్థలపరి
చ్యుతానూనదానధారాసమాకలితభూమండలాఖండలకోటీరకోటికుటి
ఘటితశతకోటిభృచ్ఛిలాద్యఖిలమాత్నరత్నసందోహాన్యోన్యసంఘృష్ట
ణవిగళద్రజఃపుంజగరింఖత్కంఖాణరింఖాణసంఘాతసంఘట్టనాత్యంత
పంకిలంబులగు రాజమార్గంబులవలననురోహిణీకాంతాకాంతకాం
తోపలసౌధయూథవిహారమాణభూకాంతశుద్ధాంతకాంతాక్రాంత

సమర్పితాసితాగరుధూపధూమస్తోమసంజనితాదభ్ర శుభ్రేతరచ్ఛాయాభరితాభ్రవిభ్రమాంగీకృతరంగత్తాండవాఖండకేశప్రఫుల్లకలాపకలాపికలాపసముల్లసితశోషకంఠకలకంఠకంఠపంచమకుహూకారకోలాహలనినదోద్య దుద్యానాభ్రంకషవిశ్వంభరాజాతసంజాత శాఖోపశాఖాశిఖాంతర కులాయప్రవర్ధమానశుంభత్కారడింభసంగ్రస్తప్రశస్త సవ్యదివ్యవిమానయాతాయాతసుధాంధస్సౌగంధిక గంధిజనమధురమధురసాసారచమత్కారగంభీరవిలాసవాగ్విశేషంబులవలనను, సంగీతభరతకళాశాస్త్రప్రవీణవారశోణాధరితాండజ్జృంభణవాచాలరత్నతులాకోటికంకణకింకిణీక్రేంకారచరద్గంధబంధుర సింధురకంధరాబద్ధరణద్బృంహితకాఘణ ఘణాత్కార భూరిభేరీధణంధణాత్కారకోలాహలపిచండిలపుండరీకభవాండభాండంబులవలనను, నితాంతదిక్సీమంతినీసీమ తసిందూరతిలకాయమానబహుళప్రభాభాసమానారవిందరాగశిలాసందోహసంఘటితప్రశస్తహస్తాంచలాంచితకాంచనపాంచాలికాసంచయంబులవలనను, సల్లలితమల్లికావల్లికామతల్లికావేల్లితసాంద్రచంద్రకాంతాలవాలవిశాలబాలరసాలసాలతాలహింతాలతక్కోలతమాలప్రియాళు నారికేళసరళవకుళముఖనిఖిలతరు వరనికరనివసితనీలకంఠకలకంఠిక పోతశారికాకీరికా బహుళబకాది నానావిధపత్త్రరథయూథనిర్భరోద్ధకలకలారావాభంగశృంగారవనంబులవలనను, అంబరచుంబి మహోన్నతసేతుసమాయతతటాకప్రసృతనీరధారానిరంతరఫలితశాలిసస్యమంజరీపుంజపింజరీభూతకేదారంబులవలనను, సారస కారండవ రథాంగ చక్రాంగ ముఖపయోవిహంగమిథునసంధువనకేళీసమాకలితవిమలకమలకుముదసముదయమకరందబిందుతుందిలేందిందిరసుందరీఝుంకారవిస్తారసారసాకరంబులవలనను, సంతతోత్సవంబై వైకుంఠనగరంబురీతి నమరావతీపురంబుభాతి భోగవతీపట్టణంబుగతిహరిప్రకాశమానంబై వర్షాకాలంబుపోలికఁ జంద్రమండలంబులీలం బుష్పవాటివి

ధంబున సారంగాభిరామంబై కమలాకరంబుభంగి నిశాహంబులచా డ్పున రాజహంసవిరాజమానంబై యలకాపురంబుబాగున లంకాపురం బులాగునఁ బుణ్యజనేశ్వరాధారంబై యయోధ్యాపట్టణంబుచొప్పున ద్వారావతీనగరంబుడంబున రామాభిరామంబై వారుణదానధారాప్ర వాహబహుళంబయ్యును వారణదానధారాప్రవాహబహుళంబై వనీప కామితార్థసంధాయకంబై కమలప్రపూర్ణకమలాకరంబయ్యును విమల ప్రపూర్ణకమలాకరంబై భువనవర్ణనీయంబయ్యును భువనవర్ణనీయంబై సంపదలకుఁబుట్టినిల్లును సౌభాగ్యంబునకుస్థానంబును నగుచు వసుంధ రాపురంధ్రీరత్నకటకంబై యొప్పు నక్కటకంబున 100

మ॥ కలఁ డాఖండలతుండితుండసదృశాఖండోరుదోర్మండనో
జ్జ్వలకాండాసనకాండభృద్భవదృఘాంచచ్చండకాండచ్ఛటా
జలధారాళమిత్రోగ్రవిగ్రహమహాయాత్రాసహోహితోద్దండభూ
పలసచ్ఛౌర్యధనంజయుం డల ప్రదీపక్ష్మామహేంద్రుండిలన్॥ 101

సీ॥ ప్రాభవానంద మహాభోగజిష్ణుండు
రంజితతేజో ధనంజయుండు
సౌభాగ్యనిరుపమోజ్జ్వలసత్యధర్ముండు
ద్యుచ్ఛాయపుణ్యజనోత్తముండు
వరశౌర్యగాంభీర్యవాహినీస్వాంభర్త
భాస్వత్ప్రబలప్రభంజనుండు
భూరితరాంచిత్రోద్ధారధనేశుండు
శాశ్వతైశ్వర్యమహేశ్వరుండు

గీ॥ బళిర! యీతండనంగనొప్పారుఁ గుధర
వలయితనతద్వయాద్వీపకలితలలిత
సర్వసర్వంసహాభరాశ్రయనిధాన
జన్యకేళి ప్రదీపరాజన్యమౌళి॥ 102

సీ॥ పద్మినీపద్మినీ పద్మినీరమణుండు
శతకోటిశతకోటి సితశరుండు
కువలయకువలయ కువలయమిత్రుండు
హరిపుత్రహరిపుత్ర హరిమూర్తి
వాహినీవాహినీ వాహినీనాథుండు
బలహారబలహార ప్రాభవుండు
మణిరాజమణిరాజ మణిరాజహాసరుండు
కలధౌతకలధౌత కుంధరధృతి
యనఁగనుతికెక్కె డిండీరహారతార
తారవిందారిమౌళిమందారసార
కాండపారదశారదకందకుంద
చారుకీర్తి ప్రదీపరాట్చక్రవర్తి 103
తే॥ అతనిభార్య సునంద నేత్రారవింద
చారుసమ్మోహనాక్ష్య ద్విలాసరసకుంత
మధురవాగ్జితమకరంద మహితరూప
సురుచిరానందసంభృత సుగుణబృంద 104
క॥ కుందమ్ముల బృందమ్ముల।
యందమ్ముం గెలుచు విద్రుమవరాధరి రదముల్
కెందమ్ముల చందమ్ముల
మందమ్ములుగా గణించు మానిని పదముల్ 105
తే॥ చంద్రబింబాస్య ముఖవిలాసంబునకును
సరసపుష్కరవిభవంబు జలదరించు
సారసానన రమ్యతరోరువులకు
సరసపుష్కరవిభవంబు జలదరించు 106
ఆ॥ పాముగోముగాఁగ బంధువైనచీమ
బారుతీరు గేరు నారుసారు
మేటితేటికోటి పాటింప దలపుష్ప

చాపుతూపు రూపుమాపు చూపు 107

సీ॥ విరిరీతినిరహించి కరిజాతిని హసించి
యొడలును నడలును బెడగుచూప
పగడాలజిగిఁ దేలి మగరాలవగఁ బోలి
పదములు రదములు బాగుమీఱ
వలయమ్ములను గేరి జలజమ్ములను మీఱి
శ్రోత్రముల్ నేత్రముల్ సొంపెసంగ
వరభృంగతతి నొంచి సురధాంగగతిమించి
వేణియు శ్రోణియు వింతదనర
రమణఁగన్నట్టిసుందరీరత్నమునకు
సాటియే యెన్న వరనరసాధ్యనాగ
గరుడగంధర్వసిద్ధకింపురుషయక్ష
కాంతలైనను గీర్వాణకాంతలైన 108

సీ॥ నెలతాల హరినీలములఁ జాలఁ గన్పట్టు
కమనీయకృతకాద్రికందరముల
నిగరాల మగరాల జిగిగ్రాల నభ్రంక
షములైన వరచంద్రశాలలందు
హేరాళమారాళధారాళగతిరూఢిఁ
దిలకించు కాసారతీరములను
జందనస్యందనకుందనవరసాల
నరసాలశృంగారవనులయందు
మహితలీల సునందతో మదనకదన
గతులఁ దేలుచుఁ బరిరంభచతురవచన
రచన లలవడ భోగాప్తి రహివహించెఁ
జానుమూర్తి ప్రదీపరాట్చక్రవర్తి 109

క॥ ఈరీతిఁ గొన్ని దినములు
నారాజన్యుండు సంతతానందముల౯

నారీమణినేలుచు సుకు
మారుఁడు లేకునికి తలఁచి మది నిట్లనియెన్ 110

తే॥ "నందనుఁడు పితృజనుల కానందనుండు
పుత్రుఁడు గురుప్రమోదైకపాత్రుఁ డరయ
సూనుఁ డనిశంబు కులవర్ధమానుఁ డుర్వి
సుతుఁడుగలతండ్రి విబుధసన్నుతుఁడు కాఁడె 111

చ॥ జిలిబిలిముద్దుమాటలును జెక్కుఁటద్దొట్రిలు లేఁతనవ్వుసం
కులు పులిగోరు నేవళము గొప్పగుగజ్జెలు చిన్ని మద్దికా
యలు జిగిమించు టుంగరము లందెలు గల్గి చెలంగి యాడుచున్
వెలసెడిసూనుఁ జూడ సరవిన్ మదిఁ దండ్రికి నెంత వేడుకో 112

సీ॥ జిగిగబ్బిగుబ్బలబిగువు కొఱంతయ్యుఁ
బొంకమ్మొగాఁ గనుబింక మొప్ప
మంజులసత్కళామగ్నతగలిగియు।
బహుళలీలావాప్తి ప్రబలియుండు
అతులితనవయౌవనారూఢిఁ బాసియు
మహితమోహన మహామహిమ వెలయు
పొగడొందు మేనిసోయగము తక్కువయయ్యు
శృంగారవిస్ఫూర్తి చెందియుండుఁ
దల్లి కుల్లాసముగనుండఁ దత్సతీమ
తల్లిమానసమను పాలవెల్లి కెంచి
చూడ జాబిల్లిగా చిన్నిసుతుఁడు ధరను
వరుసఁగోఁ బుత్రలాభంబె పరమహితము 113

తే॥ సకలసామ్రాజ్యవిభవంబు చాలఁగలిగి
నందనశ్రీవహింపని నరుని బ్రదుకు
దళలతాంతగుళుచ్ఛసంతానమగుచుఁ
గాపుఁబట్టనివృక్షంబు కరణిగాదె॥ 114

క॥ తగ మది నశ్రాంతంబును। జగతీస్థలి నెంచిచూడ సరవి" సపుత్ర

స్వగతిర్నాస్తి "యటంచసి!నిగమంబులువల్కు వేవినిర్మలమహిమన్ ॥

ప్రతీపుండు తీర్థయాత్రకుఁబోవుట.

వ॥ అనితలపోయుచు మంత్రులపై రాజ్యభారంబునిచి బంధుమిత్రగురుబుధానుమతంబున సుముహూర్తంబునఁ బురోహితుండును గొందఱుత్తైర్థికులును సునందాసుందరీరత్నంబుఁ దాను నమందానందకందళితహృదయారవిందుండై ప్రదీపవసుంధరారమణుండు తీర్థావగాహనోత్సాహంబునఁ జనిచని యచ్చటచ్చట నెదుర్కొని విశ్వంభరాభర్తలొసంగు కానుకలుగైకొనుచుఁ బుణ్యతరంగిణీనివహంబుల సుస్నాతుండగుచు యజనయాజనాధ్యయనాధ్యాపనదానదానప్రతిగ్రహషట్కర్మనిరతులగు భూసురోత్తములకు గోభూహిరణ్యసాలగ్రామాదిదానంబు లనేకంబులిచ్చుచు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధ్యష్టాంగయోగవిశారదులగు యోగీశ్వరుల సందర్శించి సాష్టాంగదండప్రమాణంబులాచరించి వారలొసంగు బహువిధాశీర్వాదంబులుగైకొనుచు నార్యజనంబులచేత సావధానంబుగాఁ బురాతనపుణ్యకథావిధానంబులు దెలియుచు రోహిణీకాంతకాంతాలవాలసంస్తూయమానగోస్తనీకాయమానవిభ్రాజమానంబులగు వనంబుల స్వచ్ఛతరచ్ఛత్రోపమానశీతలతరుచ్ఛాయలఁ బరిశ్రమంబుపాయ విశ్రమింపుచు నగణ్యభయదమృగశరణ్యంబులగు గిరివరేణ్యంబుల గడచుచు దుర్గమస్థలంబుల నిర్గమింపుచుఁ జనిచని సంతతామోదమేదురవిమలకోమలకుముదకువలయబృందమకరందతుందిలభృంగీసంగీతస్వనానుషంగయు నుభయకూలస్థితదేవర్షిబ్రహ్మర్షిరాజర్షికృతప్రసంగయు రంగదంభస్తుంగితరంగయు నగు గంగంగనుంగొని యారాజపుంగవుండు నిజకులాంగనకిట్లనియె॥ 116

గంగానదివర్ణన

లయగ్రాహి॥ అంగన! ముదంబునఁ గనుంగొనుము శాంబకకు
రంగహాయధూతవరభంగచయసంగ
రంగ దరవిందగతభృంగరవపల్లవిత

తుంగతటభూరిహృదయంగమకుడుంగక
జంగమకులాచలనిభాంగఘనజీవనమ
తంగజభయానహరధాంగకవిహంగక
మంగళపవిత్రజలసంగతసరస్వతిప
తంగతనయామిళదభంగగుణ గంగక 117

సీ॥ ఈసరస్వతికి మత్తేభేంద్రగామిని!
పురుషోత్తమునియంఘ్రి పుట్టినిల్లు
ఈమహాహ్రదిని కెలనాగ! మదనసం
హరుజటాజూటంబు మందిరంబు
ఈతరంగిణికిఁ బూర్ణేందుబింబానన!
యమునాసరస్వతు లనుఁగుఁజెలులు
ఈనిమ్నగామిని కీరాక్షి! జనపాత
కోత్కరహరము ప్రయోజనంబు
ఈస్రవంతికి నెన్న మృగేంద్రమధ్య!
భాస్వరాఖర్వసర్వసుపర్వసిద్ధ
సాధ్యభుజగాళి సేవకిసమదయంబు
దీనిమహిమంబు బ్రహ్మకుఁ దెలియఁదరమె" 118

వ॥ అనిపలికి తత్తీరంబున 119

క॥ నిలిచి నమస్కారంబులు। సలలితముగనాచరించి సంభ్రమమొప్పన్
లలిఁ బులకాంకురపాళీవిలసితతనుఁడగుచు మఱియువిభుఁడిట్లనియెన్

సీ॥ "ఈరాజహంసంబు లిభకుంభకుచకుంభ!
నీగమనంబుతో నేస్తమాడు
ఈచక్రవాకంబు లిందిందిరాలక!
నీదుపాలిండ్లతో వాదులాడు
ఈజలజాతంబు లేణాక్షి! నీముఖ
చంద్రబింబంబుతో సరసమాడు

ఈయుత్పలంబులు హేమాంగి!నీదీర్ఘ
లోలనేత్రములతో మేలమాడు
ఈమృణాళంబు లెన్నఁగా నింతి!నీదు
బాహువులతోడఁ జెలరేగి పంతమాడు
నిని నెల్లను వేర్వేఱ విశదముగను
వేడ్కఁగనుగొంటె గంభీరవేదిగమన!" 121

మ॥ అని భూకాంతుఁడు పల్కుచుండఁగను గంగాభంగరంగత్తరం
గనికాయప్రచలత్ప్రఫుల్లకమలౌఘస్వచ్ఛగంధానుఖే
లనరాజన్మధులిట్సనంధయకులశ్లాఘ్యోల్లసద్గానని
స్వనముల్ గ్రమ్మఁగ నేగుదెంచె వరచంచత్సైతవాకూలముల్ 122

క॥ ఈగతిఁ జనుదెంచిన బహు
భాగతసంమోదుఁడగుచు నతివయుఁ దానున్
వేగమె కైదండగొనుచు
భాగీరథితరఁగలందుఁ బరమప్రీతిన్ 123

క॥ స్నానములుచేసి యంతట।దానంబులుచేసి హరికథాశ్రవణమునన్
మానసముప్పొంగఁగ న।మ్మానవపతియుండెఁగొన్నిమాసములచటన్

వ॥ అటఁ గదలి నీలాచల భద్రాచల మంగళాచల సింహాచల గరుడాచల శేషాచలద్వారకాపురి మధురాపురి ధర్మపురి కాంచీపుర మారకాపుర శ్రీరంగ శ్రీకూర్మ హరిక్షేత్రాదివైష్ణవక్షేత్రంబులును కేదార త్రిపురాంతక శ్రీశైల చిద్గగన గోకర్ణ జంబుకేశ్వర రామేశ్వర కాశీ కాళహస్త్యాదిశైవక్షేత్రంబులును గనుంగొని యమునా సరస్వతీ గోదావరీ చంద్రభాగా గండకీ కృష్ణవేణీ కుముద్వతీ వేగవతీ వేత్రవతీ వేదవతీ శుక్తిమతీ తుంగభద్రా సౌభద్రా శతభద్రా భవనాశిని నర్మదా తామ్రపర్ణీ కావేరీ ప్రముఖ పుణ్యతరంగిణీనివహంబులఁ గృతస్నానుండై పద్మసరసి యింద్రసరసి బ్రహ్మసరసి మానససరసి మొదలగు సరసుల నవగాహనంబు సేసి శార్ఙ్గకోటియుఁ జక్రకోటియు శంఖకోటి

యుఁ జంద్రకోటియు ధనుష్కోటియుఁ గనుంగొని మజ్జనంబాడి దండ
కారణ్య నైమిశారణ్య బదరికారణ్య చంపకారణ్యంబులు వీక్షించి
కృతకృత్యుండై క్రమ్మరి నిజపురంబగు గజపురంబునకేతెంచి ధరణీ
పాలనంబొనర్చుచుఁ గాంతయుం దాను నిష్టోపభోగంబు లనుభవింపుచు
సుఖంబుండె, 125

క॥ రతిబంధప్రతిబంధము। రతికూజితవైభవాంతరాయము విలస
ద్రతిపతియుద్ధవిరుద్ధం। బతులితగతి సతికి గర్భమంతటనిలిచెన్ 126

.సునందగర్భోత్పత్తి.

సీ॥ బంగారమునకు మెఱుంగు వెట్టినరీతిఁ
గాంచనాంగి శరీరకాంతి మెఱసె
తెలికల్వరేకులఁబోలుచు వెన్నెలఁబోలి
చానకన్నులఁదెల్పు చాలఁదనరె
కులధరంబులమీఁది జలధరంబులమాడ్కి
నాతిచన్మొనలంచు నలుపుగలిగె
పుట్టపైఁ జరించు భుజగంబుచాడ్పున
సతినాభిపై నారు సాంద్రమయ్యె
గంధగజయాన లేగౌను గాననయ్యె
భాసురాంగికి వేవిళ్ళు బహుళమయ్యె
మానినీమణినడ యతిమందమయ్యె
చంద్రబింబాస్య వళు లదృశ్యంబులయ్యె 127

తే॥ అబ్బురపు గుబ్బమొనలు కృష్ణాప్తినొందఁ
గలికినెమ్మొగ మర్జునఖ్యాతిగాంచె
సహజసన్మిత్రవిభవంబు సంఘటిల్ల
దౌహృదము కామినీమణి దాల్చినపుడు 128

ఉ॥ “సొమ్ములుదాల్పవేటికిఁ గృశోదరి! సారెను వాపు లేర్పడన్
మమ్ములఁజీరవేటి కణుమధ్య!”యటంచుఁ బ్రియాళు లెక్కస

క్కొమ్ముగనాడ సొగకను క్రేవల లేనగవంకురింపఁగాఁ
గొమ్మ మొగంబు వ్రీడమెయిఁ గొంతటు వాల్చుఁ బ్రపూర్ణగర్భయై
వ॥ అంత, 130

చ॥ కలశపయోధివీచి యలకల్పకముంగనినట్లు వేడ్క మైఁ
గలశపయోధకూర్మిసుత కంతునిగన్నటు లిం దపంచము
త్కలశపయోధిపొంగఁగఁ దగన్ శుభలగ్నమునందుఁ గాంచె న
క్కలశపయోధరీమణి సుఖస్థితిమీఱఁ గుమారచంద్రునిన్ 131

క॥ జగతీశ్వరుకళనుద్భవుఁ
డగుచిన్నికుమారుకాంతి యంతఃపురము
ప్పుగ వెలిఁగెన్ విధుఁడుదయిం
పఁగఁ దగ వెలుగొందుపూర్వభాగమువోలెన్ 132

క॥ మధురాపురివర్ణితమగు।బుధుబాలునిగనెడివేళ భువి వనరాసుల్
మధులోపాముద్రావర।విధూదయశ్రీల సంహ విభవముతగ్గెన్ 133

క॥ దిక్కులు తెలివి రహించెను
ప్రక్కలవానలురహించె శ్రావ్యముగఁ బయో
ముక్కులు ఘోషించెను దివి
నక్కులదీపకుని మంగళాభ్యుదయమునన్ 134

ఆ॥ మనసిజాతు మారమణిగన్నయట్లు వా
మను సుఖాప్తనదితిగనినయట్లు
మన సునంద చిత్రముగ సునందనుగనె
మనసు నందుయ్యె మనకునెల్ల 135

వ॥ అని జనంబెంచుచుండ నప్పుడు, 136

శా॥ "సూనుం డుద్భవమయ్యె"నన్న విని విస్ఫూర్తిం బ్రదీపప్రభుం
డానందంబున సూతికానిలయమున్ధ్యక్షోణికింబోయి వే
తా నానందను నావనంబు పొలుపొందంజూచి మిన్నందుచున్
స్నానంబాడి సుతోద్భవోత్సవము హెచ్చించె జేసెనుత్సాహియై 137

సీ॥ ఘనమాణిక్యరత్నప్రకరములిచ్చెను జన
స్తోత్రులైనట్టి సన్మిత్రులకును
వరకిరీటములిచ్చె గురుతరోద్భటబల
వంతులైనట్టి సామంతులకును
ధవళాతపత్రముల్ తగనిచ్చె సత్కృపా
సింధువులైనట్టి బాంధవులకు
పట్టాంశుకములిచ్చెఁ బతిభక్తిసంతతా
త్స్వాంతలైనటువంటి కాంతలకును
స్వర్ణశైలతులాపురుషస్థిరాశ్వ
శిలమహీధరధవళాశ్వధేనుహస్తి
రజతలింగాదిదానముల్ రమ్యలీల
నిచ్చె భాసురులైన మహీసురులకు 138

క॥ నరపతి పాండవవా
నరముఖఁ బుణ్యాహమొసఁగ సలిపె సుతునకున్
వరజన్మవేళజనులకు
సరవిన్ సుఖమిచ్చుకతన శంతనుఁడనియెన్ 139

వ॥ ఇత్తెఱంగున నాభూమండలాఖండలుండు నిజకుమారరత్నం
బునకు జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనాదులు క్రమ
క్రమంబునఁ గావించి యనంతరం బక్షరాభ్యాసంబు మొదలుగ ఛందో
గణితకావ్యనాటకాలంకార వేదశాస్త్రపురాణేతిహాసప్రకారంబు లెఱిం
గించి మాతంగతురంగశతాంగారోహణ ప్రవీణత్వంబును బ్రాసకుంత
తోమర పరశుపట్టిసభిండివాలశూలగదాంకుశప్రముఖ వివిధాయు
ధాభ్యాసంబు గావించునంత శైశవం బతిక్రమించి,

తే॥ సకలబాంధవలోచనోత్సవకరంబు
కామినీజనసంమోహకారణంబు
వైరిజనచక్రచక్రాంగవర్షసమయ
మలరె నృపతికి నవయౌవనాగమంబు 140

సీ॥ అకలంకనవయౌవనాద్భ్రుతసుకుమార
సుందరాంగస్ఫూర్తిఁ జెందుటకును
సకలకాలములందఁ బ్రకటితాఖండ దృ
ష్టాంతవైభవలీల నలరుటకును
వృద్ధిక్షయవికార విరహితసంపూర్ణ
లలితవిలాసంబు గలుగుటకును
మహితవిశ్వంభరా మండలీనృపపాద
కమలవిన్యాసంబు గాంచుటకును
మరుఁడు కుసుమాకరుఁడు సుధాకరుఁడు వేల్పు
రాకొమరుఁ డేకమూర్త్యభిరాముఁ గాఁచుఁ
గలగుణవిశేషములు గన్నగతిని నృపకు
మారుఁ డొప్పారె మోహనాకారుఁడగుచు 141

చ॥ సగసకలాఢ్యుఁడౌ నృపతి చంద్రుని నిద్దపుఁజెక్కులందు సుం
దరముగ నంకురించు చిఱునవ్వు తనర్చుఁ దదీయసన్మనో
హర రసనాంచలస్థలవిహార నిరర్గళ దివ్యభారతీ
సరసిజనేత్రి ముగ్ధ తెలిచాయలు కోపుల గ్రమ్మినట్లనై 142

తే॥ తరుణులకు వాని సరససౌందర్యరేఖ
వీక్షణము చేయ సాత్త్వికావేశ మొదవు
శ్రీవరాంశోదితుండగు నృపతిగన్న
సాత్త్వికావేశమాట నైజంబకాదె 143

ఉ॥ కాయజసుందరుల్ నృపశిఖామణిఁ దప్పకచూచి ముగ్ధలేఁ
బ్రాయపుజవ్వనుల్ విరహభారపరిశ్రమభిన్నచిత్తలై
తీయక వెచ్చనూర్పుచును దీనతచే "నపచారమెద్ది, మే
మాయతదండనార్హులె" మటంచురు ప్రార్థనమీఱఁ దత్సతుల్

క॥ అరినారీజనములకున్ । గురుసంభ్రమకరములగుచుఁ గువలయపతి భా
సురభుజవదనాంబుజములు । కరమలరెం జంద్రహాసకలనాఢ్యములై ॥
క॥ రాజును దినరాజుగ దిన । రాజును రాజుగ సదంతరసమయములఁ ద

ద్రాజమశీతీప్రశౌర్య! భ్రాజత్కీర్తులోఁగి మాఱుపలుచుం దరుచై

తే॥ వాని వితరణసంతతిగాన లేక
శాఖియొప్పారె సంతానసంజ్ఞచేఁ ద
దర్థమై తలఁపొంది చింతామణిప్ర
సిద్ధనామము సురమణిచెందియొప్పె॥ 147

వ॥ అనినవిని "తదనంతరకథావిధానం బెఱింగింపు" మనుటయు.

చ॥ అనుపమచక్రశుక్రశలభాయితశాత్రవగోత్ర! గోత్రభృ
ద్ఘనబలశర్మనిర్మితశతక్రతుచోదితవారిదోదితా
శనిశకులీకులీరకదృషత్పృషదార్తిగఘోష భామినీ
జనవరగోత్ర! గోత్రతనుజాతనుజాతవినూతనార్చితా! ॥ 148

క॥ గౌరీనారీడితగుణ! హరి! దూరీకృతాఖిలాంహోధారి!
శౌరి! మారీచారి! హరి! శ్రీవెంకటాచలాగ్రవిహారి!॥

తరల॥ వనచరద్విజరాజపోషణవైభవోన్నతదండకా
వనచరద్విజరాజభూషణవశీత్వోగ్రపరాక్రమా!
వనచరద్విజరాజభీషణమైనతేయమహోజ్జ్వల
ద్వనచరద్విజరాజదూషణధర్మబద్ధవివాహనా! 149

గద్య

ఇది శ్రీవెంకటేశ్వరకరుణాకటాక్షసంప్రాప్తకవిత్వవిద్యావిచి
త్రాపస్తంబసూత్ర హరితసగోత్రపవిత్ర వెంకటనరస
యామాత్యపుత్రాన్నమరాజాన్వయపయఃపా
రావారసంపూర్ణపూర్ణిమాసుధాకర స
కలగుణరత్నరత్నాకర విద్వజ్జన
విధేయ రమణయనామధేయ
ప్రణీతంబైన
శంతనురాజ
చరిత్రంబను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# శంతనురాజచరిత్ర

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీమదలమేలుమంగా । శ్యామాసంకుమదపంకసంకలితోద్య
త్కోమలకుచకలశశిఖా । రామూల్యాభరణ వేంకటాచలరమణా ॥ 2

వ॥ అవధరింపుము జనమేజయవసుంధరారమణునకు వైశంపాయనుం డిట్లని చెప్పందొడంగె.

—హిమవదృతువర్ణనము—

ఉ॥ అంత ననంతవైభవమహాద్భుతలీల ధరిత్రిఁ దోఁచె హే
మంతము సర్వశాంతఘనమానవతీకుచకుంభసంభ్రమ
త్కాంత మశాంతదంతురితకాంతులతాంతశరచ్ఛిదాధ్వగ
స్వాంత మతాంతకైరవవిశాంతరణత్ప్రియదాళికాంతమై 3

ఉ॥ నిత్యజగత్త్రయీవిజయనిష్ఠురశాసనశంబరాంతకో
ద్ధత్యమునన్ బగల్ సురతంత్రవిలాసములొందఁగోరు నా
సత్యవతీపరాశరుల సాంద్రమనోరథసిద్ధి కెద్ది యౌ
చిత్యగతిం దనర్చె ధరఁ జిత్రత నత్తుహినంబు రాజిలన్ 4

మ॥ సకలస్థావరజంగమంబులకు లోఁ సంస్థాయియైనట్టి త్ర్యం
బకు జామాతగఁ గాంచితింగడఁకఁ దద్బాహ్యస్థలవ్యాపకా
త్యకలంకస్థితి నాకుఁ జెల్లునని సీతాహార్యమూర్ధన్య ము
త్సుకత న్నిండిన రీతి మంచు దనరెన్ సూచీముఖాభేద్యమై 5

తే॥ మహితవిస్ఫూర్తిమీఱ హేమంతసమయ
మాంత్రికుం డుత్తరానిలమంత్రమునను
శీతభూతంబు తగఁ బంపుఁజేయ నార్తి
జడియుకైవడి లోకంబు వడఁకఁ జొచ్చె 6

క॥ పాండురహిమసంఘాతము। నిండినతద్వాసరముల నీరేరుహాజా
తాండంబులవీక్షింపఁగ। వెండికరండములరీతి విలసిల్లెఁ దగన్ 7
క॥ హిమబిందుకందళాశ్రయ। సుమనోగుచ్ఛములు మిగులఁజూపట్టె రతి
శ్రమజనిత ఘర్మకణభృ। త్కమలముఖీలసదురోజ కలశాభములై
తే॥ సాంద్రశశ్వదవశ్యాయసలిలబిందు
కందళంబులు దశదిశల్ గప్పికొనఁగ
నగములెల్లను దేవతానగములయ్యె
నగములెల్లను ఖర్జూరినగములయ్యె 9
క॥ సరసస్థితిఁ బద్మిని యున। కరసంగతిఁజెందకున్న గాసిలదె ధరన్
సరస్థితిఁ బద్మిని యున। కరసంగతిఁబొందకున్న గాసిపడదొకో 10
సీ॥ మృగనాభికాపంక మిళితకాలాగరు
చందనగంధ పర్వాభిషేకముల
సలలితశ్లిష్టాన్న భక్ష్యవ్రాతశాక స
ద్గోఘృతప్రముఖ సద్భోజనముల
జాతీఫలమనోజ్ఞ సౌరభ్యరాగ ర
సస్ఫురత్తాంబూల చర్వణముల
నవమోహనాంగ సుందరలతాంగీవృత్త
శృంగారకుచభరాశ్లేషములను
తే॥ చండసిద్ధామభీమ జాజ్వల్యమాన
ఘనతరపటిష్ఠనిష్ఠు రాంగారతార
విలసితహసంతికానూన వీక్షణముల
భోగులకు నింపొనర్చె శీతాగమంబు॥ 11
వ॥ ఆసమయంబున, 12
శా॥ ఖద్యోతాహ్వాయ మర్కటకీటమణులం గాఢస్థితింజెంది నై
జద్యోతాంతరమైనలీలఁ దన కాశాదేశరాజాళి కు
ద్యద్వ్యక్తిం దగ నామమాత్రము సమంబై చెల్లఁగా నిస్తులా
భేద్యస్ఫూర్తిఁ బ్రదీపుఁ డేలె నిఖిలోర్వీమండలం బయ్యెడన్॥ 13

—ప్రదీపుఁడు గంగాస్నానమునకు బోవుట—

వ॥ ఒక్కదినంబునఁ బ్రభాతంబున మేల్కాంచి గంగాప్రవాహావగాహనోత్సాహియై చని కృతస్నానుండై శరచ్చంద్రధౌతవస్త్రధారణుండై చంద్రికాసాంద్రధవళశీతలసైకతప్రదేశంబున, 14

సీ॥ మానితనియమ సమారూఢ వైఖరి
చెలఁగి పద్మాసనాసీనుఁడగుచు
దేహంబు వక్రసంస్థితి మీఱ నొందించి
కమనీయలీల మొగంబు వంచి
నాసాగ్రదృష్టి విన్యాసంబు గావించి
మానసవృత్తులు మట్టుపఱచి
లాలితాక్షసరంబు కేల సారెకుఁ ద్రిప్పు
చెలమిమంత్రజపాను కలితుఁడగుచు
స్వప్రకాశోరు నారాయణ ప్రశస్త
శబ్దవాచ్యస్వయంభూత జగదఖండ
నిరుపమానందసంపూర్ణ నిత్యసత్య
సిద్ధవస్తువు ధ్యానంబు సేయుచుండ 15

గంగ నరకన్యయగుట

వ॥ ఇట్లు చేయుచుండ, 16

సీ॥ జగములు మోహింపఁ జరియించు మన్మథ
సరస మోహన మంత్రశక్తి యనఁగ
స్థిరసంపద వహించి ధరణీస్థలంబున మెలఁగెడి కొక్కారు మెఱుఁగనంగఁ
జిత్రలీల లెసంగ జీవకళల్ పూనికిఁ తిమించు చిత్తరు ప్రతిమయనఁగ
నవయవసౌభాగ్య హారిమూర్తిధరించి
రహినొప్పు శృంగారరసమనంగ

హావభావవిలాసంబు లచ్చుపడఁగ
భూరి నవ యౌవనాంగ దీప్తులు చెలంగ
నొఱపుగల దివ్యమహిమంబు లుజ్జగించి
గంగ నరకన్యకాకృతి గాంచె నపుడు 17

సీ॥ కటిచరణంబులై కనుపట్టఁగాఁబోలుఁ
బులినంబులును శోణనలినములును
భుజకుంతలంబులై పొలుపొందఁబోలు మృ
ణాళముల్ మత్తకీరాందోళములును
నేత్రకుచంబులై నిలువఁబోలుం డజా
నీకంబులును జక్రవాకములును
బ్రపదరోమాళులై భాసిల్లఁబోలూర్మి
జాలముల్ రుచిర శైవాలములును
గాకయుండిన నాకొమ్మ కటితటాంఘ్రి
బాహుకచవీక్షణ స్తనప్రపదరోమ
రాజి సౌభాగ్యములు నరరాజనాగ
యక్షకిన్నర రాజకన్యలకుఁ గలదె 18

క॥ భంబులుమదబంభరశిం।భంబులునఖరములుకురులుపటురంభాస్తం
భంబులుమత్తద్విపకుం।భంబులుపద్మాక్షితొడలుపాలిండ్లహహా 19

ఆ॥ నీరజాయతాక్షి నెమ్మోముకను సంభ్ర
మించు మించుమించుమించు
శారదేందువదన చక్కనిగళము సుం
దరము దరముదరముదరము 20

తే॥ బాలపాలిండ్లు చక్కని పైఁడిగిండ్లు
చెలువనూగారు నల్లని చీమబారు
తెఱవనునుమోవి తీయని తేనెబావి
పొలఁతిమైతావి కమ్మకప్పురపు దీవి 21

ఆ॥ కనకనగము నెంచుఁ గాలాహి నదలించు
వీణె నెంచుఁ దమ్మివిరుల నెంచు

నార సారశారదాబ్జ బింబానన
శ్రోణి వేణి వాణి పాణియుగము 22

క॥ ఇటువంటిభువనమోహనపటుతరలావణ్యవిభవభాసితయగు న
కుటిలాలకసఖులై యుత్కటముగ నిరువంకలందుఁదగు నలుగొలువన్

ఉ॥ అందెలుఘల్లుఘల్లుమన నభ్రపువేణి పిఱుందుమీఁదటన్
జిందులుద్రొక్క నిబ్బరపుసిబ్బెపుటంబులగుబ్బదోయితో
నందపుదీవిమధ్య మసియాడఁగఁ బయ్యెదకొంగు దూఁగఁగా
నిందునిభాస్యవచ్చె ధరణీశ్వరుఁడున్న సమీపభూమికిన్॥ 24

గంగ రాజునువర్ణించుట

వ॥ ఇత్తెఱంగునఁ జనుదెంచి గంగాకురంగేక్షణ రాజపుంగ వే క్షణకోదండు సరసతారుణ్యలావణ్యగాంభీర్యచాతుర్యవిశేషంబులకు న త్యాశ్చర్యధుర్యయై యవ్వసుధరామండలేశ్వరుని నిజాక్షిణవీక్షణా మృతధారాసారంబున నభిషిక్తుం జేయుచు నొక్కవయస్యావతంసంబున కిట్లనియె, 25

శా॥ కాంతా! గన్నవమ్ము లీలమెఱుఁగు భూకాంతుండో రాకానిశా కాంతుండో రతికాంతుండో యలశచీకాంతాత్మజాతుండో యే కాంతోద్యత్సిరభక్తినిల్చె నితఁడుం గాఁగింట లేకుండినన్ గాంతారాంతరచంద్రికావిభవము ల్గావే సఖీసౌఖ్యముల్ 26

క॥ నరసురవిద్యాధర కిన్నరఖగగంధర్వయక్ష నాగకుమారో త్కరముల గన్గొనినను నిపురుషునింబోలఁ జేయఁ బోలఁగు నెచెలియా

చ॥ చిలుకలకొల్కి! యీపురుషసింహుని నేఁ గనుగొన్నమాత్రనే చిలుకజరాగుతానిపయిఁ జువ్వన హుమ్మని చొక్కళించి బ ల్కలువఫరంగురాహుతు హాహాహళిగాఁ జెలరేగ యార్చుచున్ దలిరుకటారిఁబూని బెదిరమ్ముగ రొమ్మునఁ గ్రుమ్మఁజొచ్చెనే 28

ఆ॥ కుందరదన! చూడ మందు నికామిని
కాము మోము గోము సోమునోము
ఇందువదన! కంటె వేపిసియమృతంపు
దీవికావి మోవి తావిదీవి 29

వ॥ అనివర్ణించి యాచంచలేక్షణ రాజహర్యక్షు దక్షిణోరుభాగంబునం గూర్చుండిన సమాధినిష్ఠఁ జాలించి యక్కన్యకాలలామంబు నిరీక్షించి యత్యంతాద్భుతరసాక్రాంతస్వాంతుండును విస్ఫురితామోదమేదురవికసిత హృదయ కమలుండును నై తనలో నిట్లనియె. 30

క॥ "రతియో యీగుణవతి భా।రతియో యీమంజువాణి రహిఁ గన్పడు పా
ర్వతియో యీశ్యామరమా।సతియో యీకమలపాణి చర్చింపంగన్"

తే॥ మెఱుఁగుఁబొంగారు బంగారుమించు రేకు
కరుపుమురువుగఁ గట్టి శృంగారరసము
రాశిఁగూరిచి మన్మథోగ్రప్రతాప
శిఖిని బుటమిడి విధి దీనిఁ జేయఁబోలు 32

తే॥ కలికిగాదిది చిలుకలకొలికిగాని
కొలికిగాదిది మరుని పూవులికిగాని
ములికిగాదిది రతిచేతి చిలుకగాని
చిలుకగాదిది మరువంపు మొలకగాని 33

తే॥ బళిర యీకొమ్మ నెమ్మేనిపరిమళంబు
చందనామోదమో ఘనసారగంధ
సారమో మృగనాభికాసారభంబొ
కమ్మతావులు గమ్మన గుమ్మరిల్లె 34

సీ॥ మేలైన హరినీలజాలముల్ గాఁబోలు
సొంపొందు దీని సిద్ధంపుఁగురులు
అందముల్ గల కురువిందముల్ కాఁబోలుఁ
దళుకుచూపెడి దీనిదంతములును
తగ డాలుగల జాతిపగడాలు కాఁబోలుఁ
గాంతంబులగు దీనికరపదములు
వగఁగ్రాలుచుండుమేల్ మగఱాలుగాఁబోలు
మిసమిసల్ గల దీనిమృదునఖములు

ఉత్తమంపు సొంపాణిక్రొ మ్ముత్తియముల
తెగయగాఁబోలు దీనిలేసగవు, పల్కు
లేలపెక్కులు, నిజము, రత్నాలరాశి
సందియములేద యీశరచ్చంద్రవదన! 35

క॥ అద్దిరదీనిచోకాటపు! ముద్దులచెక్కిళ్లు ముకురములె, నిజమనఁగా
వద్దా, కాకుండినధరఁ। గద్దా ప్రతిబింబమిటులఁ గానంబడుటల్ 36

తే॥ అవురయీకాంత గమనమధ్యాస్యచికుర
వచనకుచములవర్ణింప వశమెనాకు
సారసాశనహరిసోమ నారదశుక
పర్వత శ్రీలనెంతయుఁ బరిఢవిల్ల" 37

మ॥ అని భూపాలవతంసుఁ డిట్లు మదిలో నత్యంతహర్షంబునన్
వనజాతాయతపత్రనేత్ర మిగులన్ వర్ణించి నెమ్మోమునన్
దన దృక్పంకరుహద్వయంబునిచి "కాంతా! యస్మదంకస్థలం
బునఁ గూర్చుండినహేతువేమి? విలసత్స్ఫూర్తిం దగంబల్కుమా

చ॥ ఎవరికుమారివీవు? శరదిందునిభానన! యక్షకాంచనాం
గివో గరుడాంగనామణివొ కింపురుషోత్పలపత్రనేత్రివో
నవసుతవిద్రుమాధరివొ నాగవధూటివొ కాక సిద్ధరా
డ్యువతివొ సాధ్యరాజసతివో చెపుమా మన ముల్లసిల్లెడిన్ 39

శా॥ సారంగేక్షణ! నీ వినీలచికురాస్యంబుల్ మృదూక్తుల్ బళీ
సారంగాబ్జహరిస్తుతంబులు, నడల్ సత్కంఠరోమావళుల్
సారంగాబ్జహరిస్తుతంబులు, దృగంచత్పాదమధ్యంబులున్
సారంగాబ్జహరిస్తుతంబు లహహా చర్చించివర్ణింపఁగన్ 40

ఉ॥ మోవి మహీజపాకృతిని ముఖ్యతగాంచెఁ, బయోధరంబులు
న్గేవలకుంభకాంతధృతి నిల్పె, నఖంబులుతారకాప్తి నా
రా వహిం కెక్కె, నెమ్మొగము రాజవిభూతినెసంగె, మేలుమే
లోవనజాక్షి! నిన్గనిన యోగకళావిదు లిచ్చమెచ్చరే 41

క॥ సొగసగునీకటితటమును। దగనొప్పెడిలేతగాను తళుకగు మొగముల్
నగరాజో మృగరాజో। తొగరాజో తెలియరాదు తోయజనేత్రీ!

తే॥ అతివ! నీదుచనుంగవ యలమహీంద్ర
యుగళమా కాదు వరతారహారగగన
సింధుబంధురధవళకబంధరూప
ఘనఝరీగతమేరు శృంగయుగిగాని" 43

తే॥ అనుచు నారాజదేవేంద్రుఁ డభినుతింప
రంగుబంగరుచేలచెఱుం గురోజ
కుంభములమీఁదఁ జక్కఁగాఁగూర్చుకొని త
గంగఁ బలికె జగన్మోహనాంగ గంగ 44

గంగపుట్టిన వృత్తాంతముదెల్పుట.

సీ॥ పాలమున్నీటిలోఁ బవ్వళించెడిభోగి
చరణాంబుజంబు నాజన్మభూమి
మంచుగుబ్బలికూఁతు మించివరించిన
దేవునిశిరము నాదివ్యగృహము
భవనాశినీ తుంగభద్రాసరస్వతీ
నదులు చేరిభజించు నాదుచెలులు
కిన్నరనరసుర పన్నగయక్షాది
జనులెల్ల నాసేవకసముదయములు
క్రతుభుగండజమనుజ లోకత్రయంబు
రమణమీఱిన నావిహారస్థలంబు
గంగయనవొప్పుదును రత్నగర్భయందు
రాజవంశాబ్జ వనహేళీ! రాజమౌళి 45

మ॥ ధరణీపాలక! నీవిలాసమును సౌందర్యంబు చాతుర్యముల్
వరభాస్వద్విభవంబు సంపదయు భావప్రౌఢి గంధర్వకి

న్నరయుఖామరసూనులందుఁ గనుఁగొన్నన్ లేక మోహంబునన్
దరుణీరూపము దాల్చివచ్చితిని దాత్పర్యంబునం బ్రోవుమీ 46

క॥ కేళీవనపాళీ పాంథాళీకకరాంబుజాకరాంచన్నాళీ
కాళీ సుమధూళీ మత్తాళిధ్వానము విరాళి నలమటవెట్టెన్. 47

శా॥ జ్వాలాభీలవిశాలహాలహలభాస్వద్వీతిహోత్రోజ్వల
త్కీలాసంఘునిమేళనంబు, మలయాద్రిప్రాంగణోద్యన్మహో
త్తాలాకీర్ణపటీరకోటరతలోద్వాంతాహిదంష్ట్రానట
చ్ఛీలం భీమలయానిలంబు నను దాక్షిణ్యంబునం జూచునే 48

క॥ పలుగాకులతో సంగతిఁ బలుగాకులనంగఁ బక్షపాతములోదవన్
బలుగములుగూడికోయిలఁబలగములువి మోగవహ్ని పాలుఁగ జేసెన్

ఉ॥ ఎక్కడదాతునీవలపు నిందుకులాంబుధిపూర్ణచంద్ర! యీ
చక్కరవిల్తు శ్రీచరణసారస యుగ్మముతోడు, నామనం
బక్కట తెల్పరానివిరహాంబుధిలోన మునింగె నయ్యయో
చక్కరమోవిగ్రోలి నను సౌఖ్యరసంబున నోలలార్పుమీ" 50

మ॥ అని కాంతాతిలకంబుపల్కవిని యాహా యిట్టిచిత్రంబు నే
వినియుం జూచి యెఱుంగ మున్నెచటఁ, బృథ్వీనుఁడలిన్ లోకపా
వని భాగీరథి, మర్త్యకన్యయయి విశ్వవ్యాప్తిం జిన్మయున్
మనమందూహ యొనర్ప సూరువునఁ బ్రేమన్ మన్మథోగ్రేషుసం
జనిత ప్రాకటవేదనాభరపరిశ్రాంతిం గతభ్రాంతయై 51

వ॥ నిలిచెనని మృదుమధురసరసవచన రచనల సబహుమానం
బుగా నవ్వారారోహకిట్లనియె 52

క॥ "అతినా! లోకులపాటిగ। జితేంద్రియుఁడనై ప్రసిద్ధశీలతఁదగి సూ
నృతలీల నేకపత్నీ। వ్రతమూనిననన్ను నంటవచ్చుటతగునే" 53

తే॥ అనియిటులరాజుపలికిన నంబుజాక్షి
పలికెఁ బలుకులఁ దేనియల్ చిలుకుచుండఁ

దావిచక్కెరమోవి చెంగావిఁ వి
ము త్తియపుముంగరనుగూడి ముద్దుగులుక 54

ఉ॥ "ఓతరుణీమనోహర! యహాహా విను తొల్లిఁ బురూరవుండనా
భూతలనాథచంద్రుఁడొగిఁ బొల్పుగ నూర్వశివచ్చి వేఁడినన్
బ్రీతిరమించెఁగాదె, కలరే యిలలోఁ దముఁగోరివచ్చు మే
ల్నాతి మిటారిగుబ్బెతల లీల వరింపనివార లెచ్చటన్" 55

వ॥ అనివనకాంతకు భూకాంతుండిట్లనియె. స్త్రీభాగంబగువా మోరుప్రదేశంబునఁగాక పుత్రార్హంబయిన దక్షిణాంకస్థితవగుటంజేసి మదీయకుమారుండగు శంతను పాణిగ్రహణంబుసేయుము. మృగయా వినోదార్థంబుగా నితాంతవిశ్రాంతానంత పుష్పంధయస్తనంధయామం దబంధురరవాత్యంతనిరంతరీకృత దిగంతరాళంబైన వసంతకాలంబున సల్లలితసహకారపల్లవతల్లజ ఖాదనాకుంఠితకలకంఠకంఠగళత్పంచమకు హూకారంబైన యిచ్చటికాంతారంబునకు నాత్రిభువనమాకందారామ వసంతుఁడైన కుమారకంఠీరవుం డవశ్యంబేతెంచు. తత్సమయంబున నీయభిమతార్థంబుసిద్ధించు, అతండు పుండ్రేక్షుకోదండ భాస్వత్సౌందర్య వంతుండును శ్రీమంతుండును, సౌరధునీహీరమణి నారదనీహారఘృణి క్షీరఫణీంద్రోరమణపారదస్ఫటికయశఃకర్పూరఖండపిచండిల బ్రహ్మాండకరం డ మధ్యభాగుండును, మహాభాగుండును, కామధుక్కల్పభుగ్రత్నోదము క్సుధారుక్సహస్రదృక్సర్వం సహాజాత రోహణమహీధరపయస్సముద్ర సన్నిద్రభద్రానూనదానధారా సారపరివర్షితనిఖిలయాచకసారంగ మండలుండును మహాభోగతిరస్కృతాఖండలుండును, అహార్యవర్యస్థై ర్యధైర్యుండును దర్పాంధపరిపంథికంధి మంధవసుంధరాధరాయమానా నివార్యచోశ్చౌర్యుండును, అతఁ డేనుపచరింపం దగదుకాని మదీయ గుణవిశేషంబులకన్న నెక్కుడగు గుణవంతుం"డని చెప్పి యొడంబఱచిన నక్కన్యకాలలామంబు సంతసించి తత్కాలనిరీక్షణంబుసేయుచు హిమ వన్నగప్రాంతోద్యానంబునఁ జెలికత్తియలు దాను విహరింపుచుండె

అంత సమాధినిష్ఠ చాలించి ప్రదీపక్షమాకాంతుండు నిజపురంబున కేతెంచి యత్యంత వైభవోపేతుండై సుఖంబుండి యేకాంతంబునఁ బుత్రునకిట్లనియె. 56

పంచచామరము.

మరాళయాన నంబుజాంఘ్రి మంథసానుభృత్పయో
ధరం బ్రవాళహస్త నంబుదప్రకాశకైశిక
కురంగశాబకాక్షిఁ బుష్పకోమలాంగి నోర్తు నే
సురాపగాతటంబునందు సొంపుమీఱఁగాంచితిన్ 57

సీ॥ కలికియానమునను జన్నులు కౌను కన్నులు
సారంగధరహరి శ్రీరహించె
నలినాక్షినూగారు నఖరముల్ జడ నాభి
పున్నాగసద్ఘనస్ఫురణ నెసఁగె
పణఁతిపీనులు మేను పల్కులు చెక్కులు
నవచంద్రఖండ సుందరతగాంచె
వనితకంఠము కటి వాతెఱ నెమ్మొగ
మజ్జారిబింబలీలాప్తిఁదనరె
కరి గిరులు సింగ మేణంబు హరి భములు జ
లదము తురగంబు తొమ్మిదులైనఁడి చక్క
రలు కపురము దరంబు చక్రంబుదొండ
పండు శశిఁగూర్చి విధి సృజింపంగఁబోలు 58

చ॥ చిలుకల కల్కి పల్కుల నిసీయనుఁ బల్కులతీపు, కంతుపూ
ములుకులవంకదీర్పు నవమోహనమా నిడువాలుచూపు, మేల్
కొలఁకుల నక్కఁజేయు నల కోమలవృత్తగభీరనాభి, హా
చిలుకలకొల్కితోడ సరిచెప్పఁగ ముజ్జగమందుఁ గల్గునే 59

తే॥ రమణినునుపల్కు తీరు కీరమణి నేరు
లలన లేనవ్వుజిగి వెన్నెలలను నవ్వు

చెలువచన్కట్టు గట్టులచెలువుఁ దిట్టు
నెలఁతమోమును దగు నెల తలనుబూన 60

క॥ ఇన్నేలచెప్పఁ బుత్రక! కన్నియనెఱికొప్పు కప్పుకన్నఁ హెచ్చై
చెన్నారు నారుతీ రాపన్నగపతిచాలఁ జౌర ప్రణతుల్ సేయన్ 61

వ॥ ఇట్లు జగన్మోహనాకారంబుతోడ నమ్ముద్దియ గ్రద్దన నొద్దికతోడ నేతెంచి మదీయదక్షిణోరుభాగంబున సుమశరనిశితనిష్ఠురవిశిఖవిసరజర్ఝరితశరీరయై కూర్చుండి హెచ్చుగాఁ బిచ్చలించు మోహంబచ్చుపడఁ ''గన్నవఁ దన్ను మన్ననం గనుంగొని వరింపు"మన నేను ''నేకపత్నీవ్రతస్థుండ నదియునుంగాక మదీయపుత్రార్థంబైన దక్షిణాంకసంస్థితవగుటం జేసి నీవాకుమారతిలకు పాణిగ్రహణంబు సేయుము మృగయావినోదార్థంబుగా వసంతకాలంబున నీతుషారాచలపరిసరోద్యానంబునకుం జనుదెంచు"నని చెప్పిపుచ్చితి,నీ వవ్వసంతాగమంబునం జనియప్పరాగోహన్ వివాహంబుగ"మ్మని చెప్పి రాజ్యాభిషిక్తుం జేసి మఱియునిట్లనియె 62

—ప్రతీపుఁడు శంతనునకు రాజనీతులు చెప్పుట—

క॥ సప్తవ్యసనవివర్జితు।సప్తాంగధురీణుఁ గలితశక్తిత్రయునిన్
సప్తాశ్వసత్ప్రతాపుని।సప్తద్వీపప్రభుత్వసంపద చెందున్ ॥ 63

క॥ వలయునిలు ధాన్యఘృతతైలలవణపిష్టాదిపుష్కలంబయి జాగ్ర
ద్బలయుతములైన భువన।స్థలగిరిదుర్గములవలె రసాతలపతికిన్॥ 64

క॥ జలకేళిని వనకేళిని।లలనలతో నిష్టలీలలన్ మెలఁగెడివే
ళలఁ బానసుప్తిసమయం।బులరక్షణవలయుఁజుమ్మిభూమీశునకున్॥

క॥ బలవంతునితో సామం।బలవడఁగావించుటయు జయాలోలమతిన్
ఖలహీనునిదండించుట।బలహరునకునయిన నీతిపథముకుమారా॥66

ఉ॥ చతురోపాయచతుష్టయాశ్రయుమహాోత్సాహుల్ రహస్యక్రియా
హితమర్మజ్ఞుని మంత్రరక్షణకళాహేలుల్ సుశీలుల్ నయా

ద్భృతునిఁ స్వామిహితైకతత్పరు నమాత్యుంగాఁగొనండేని భూ
పతి తద్రాజ్యము నూతికట్టపసిపాపండాటగాదే సుతా!॥ 67
చ॥ పతిహితకార్యభార మనపాయతనూననివాఁడు మంత్రియే
మతిఁబరికింపఁ దత్కృతకమంత్రమునమ్మినవాఁడు మేదినీ
పతియె,యతండుసంతతముపాలనఁజేసెడి దెన్న రాజ్యమే
వ్రతముగనచ్చటంగలుగువారిది సంపదయే కుమారకా!॥
క॥ ధనమాస నేలినాతని।పనిభంగముఁజేసి పొసఁగఁబలు తెంచిన దు
ర్జను నిమిషమైననుంచక।తనరాష్ట్రము వెడలనడువఁదగు నరపతికిఁ॥
క॥ తగురీతిని బ్రజఁజేకొనఁ
దగు సరికిలకలిమి నెల్లఁ దగునేకొనఁ బా
లొగి నేర్పుమెయినిబెనుకక
యగు నెఱుఁదవుపొదుగుకోసి యమరంగొనఁగఁ॥
తే॥ సకలవర్ణజనరిబులు శ్వాదివిజుల
గురుమతినిభక్తిసేయుట వరుల దారి
లనుసరించుట నృపదండమున నెకాక
వేదవేత్తల సద్ధర్మవిషులనవునె॥ 71
తే॥ పాపవర్తనమన్నించి పనులుగొనుట
తనయుఁడైన మిగుల విగతనయుడఁగుచుఁ
దప్పొనర్చినచోఁ దగ దండనంబు
మానియుండుట నృపతికిహానిఁజేయు॥ 72
క॥ పరదేశపతులు పంపిన
గురుమధురఫలాదు లొరులఁగుడువఁబనిచి సు
స్థిరగతివారల కరుగుట
యెఱిఁగి మఱిభుజింపనగు మహీశున కెందుఁ॥ 73
తే॥ రఘుయయాతిభగీరథ రామభద్ర
జనకభరతాదులగు పురాతనమహీశ

వరులు చతురబ్ధిముద్రితధరణిచక్ర
మేలుటలు నీతిదక్షులై యొసగఁ గాదె" 74

వ॥ అని చెప్పి తపోవనంబునకుం జనియె నంత 75

క॥ శ్రీకరమై బహుసుజనా। నీకకృతోద్యత్సమస్తనిరుపమపరధ
ర్మాకరమై రాజనముల। కాకరమై శిశిరసమయ మవనిం దోఁచెన్ ॥76

—శిశిరర్తువర్ణన—

మ॥ సకలద్వీపసముద్రముద్రితధరాచక్రావనైకోల్లస
త్ప్రకటద్వాదశపుణ్యవాసరకృతోదాత్తప్రియాభ్యంజనా
స్వకరోర్వాగతవైకృతం బణఁగిపోఁ స్నానంబులన్ సల్పఁదఁ
న్మకరార్కోజ్జ్వలమాఘవేళ జనబృందం బిష్టసంసిద్ధికై॥ 77

తే॥ భువనజాతమ్ములకు సదా మోదమమరె
చిరపలాశవిభూతి నిశ్శేషమయ్యె
తగనపుష్పభావిమాధవోదయమహాను
భవము మునుము న్నెయోగిఁ దేటపడఁజెననఁగ॥ 78

వ॥ ఇట్లత్యంతసౌకర్యాలవాలంబై శిశిరకాలంబు ప్రవర్తించు సమయంబున శంతనుం డఖండవైభవాభిరాముండై సుఖంబుండి యొక్కనాఁడు. 79

—శంతనుఁడు దిగ్విజయమునకు వెడలుట—

క॥ స్రగ్వనజరాగ జీవన। ముగ్వాహననీలమణి విభూషాదుల స
మ్యగ్విభవొ న్నతిఁ దాలిచి। దిగ్విజయంబునకు నేగఁ దివురుచునుండెన్॥

చ॥ ఘనమణిసంచయస్థగితకాంచనకుంభయుతంబు ఘంటికా
ఘణఘణనాదమేదుర మఖండమహోద్ఘటచక్రసింహకే
తనపటురాజితం బగు రథంబు ఘనాశ్వచతుష్టయంబుఁ బూ
న్చి నగు మొగంబుతో నెదుట నిల్చిన సారథిఁ బూని మెచ్చుచున్॥ 81

వ॥ సంతోషస్వాంతుండై యమ్మహీకాంతుం డు బాణబాణాసనతనుత్రాణతూణధారుండై సచివపురోహిత గురుబంధుమిత్ర బుధ

జనంబులచేతననుజ్ఞవడసి పుండరీకవనబాంధవుం డాఖండలహరిద్గిరీంద్రోత్తుంగశృంగం బలంకరించుతెఱంగున నిజశతాంగంబునకుఁ బ్రదక్షిణంబానర్చి యారూఢుండై సూతవందిమాగధకవిగాయకకైవారంబులు చెలఁగఁ బుణ్యాంగనలు మౌక్తికాకుతప్రసూనంబులు సేసలుచల్ల ననుకూలగతిఁబఱతెంచుగంధవహాదిశుభశకునంబులు వీక్షింపుచుఁ జను సమయంబున,

క॥ భేరీతమ్మటకాహళ, భూరిధ్వానములు భూనభోభాగభిదా
స్ఫారగతినడర నాశా। ఘారణములుబ్రమగ్గ మర్చి వారణచెలఁగన్ ॥83
వ॥ అప్పుడు 84
సీ॥ జంభారికుంభీంద్ర శుంభద్విజృంభణ
గంభీరవేది నాగవ్రజంబు
గాంధారబాహ్లీక సింధుదేశోద్భవా
జానేయకంఖాణసముదయంబు
కల్యాణభూధరాగ్ర సమగ్రరుచిమహా
రజతకల్పిత లసద్రథగణంబు
కంఠీరవశ్రేష్ఠ లుంఠనాకుంఠ స
త్పటుపరాక్రమ వీరభటచయంబు
బలసి యత్యుత్కటోద్వేలభారచలిత
సర్వసర్వంసహాచక్రధూర్వహాను
భావసముపేతుఁడై కదుంబ్రబలియుండు
పుడమిఱేనిదళంబు నల్గడలనడచె॥ 85
వ॥ అయ్యెడ 86

క॥ సింధువులుగలఁగఁ బంకజ
బాంధవబింబంబు చెదరఁ బటురభసమునన్
బంధురసింధురరథభట
గాంధర్వోత్కరముతోడఁ గలహాయాత్సుకుడై॥ 87

క॥ మాళవకళింగశక నే। పాళకరూశాంగవంగ బర్బరకురు బం
గాళముఖనిఖిలవసుధా। పాలకగణ మే గుదెంచెఁ బస్ఫుటఫణితిన్ ॥౪౪

—శంతనునియుద్ధము—

వ॥ ఇట్లు గుదెంచి యయ్యుభయసైన్యంబు లన్యోన్యజయకాంక్షులఁ జంద్రవ్యూహంబులువన్ని సంవర్తసమయసముజ్జృంభితసముద్రంబుల రౌద్రంబున నవక్రవిక్రమప్రక్రియం బొంగి తలపడి పోరుసమయంబునఁ దదీయాయోధననిరీక్షణకుతూహలాధీనమానసులై చతుర్ముఖపంచముఖ షణ్ముఖ శతముఖ ముఖ నిఖిలబర్హిర్ముఖ రక్షో యక్ష సిద్ధ సాధ్యు లేతెంచి రయ్యెడ భేరీ వారణ వీరభట భాంకార ఘీంకార హుంకారరావ బధిరీకృతాష్టహరిద్గంధేభశ్రవఃకోటరంబయ్యె నందుఁ గఠోరకుఠారకతారాసిప్రాసకరవాలశూలభిండివాలాదిసాధనంబుల నసాధారణావక్రవిక్రమవిహారంబు మెఱయ నక్షుద్రరౌద్రనిర్నిద్రప్రమదమహోక్షంబులడంబున నఖండోద్దండప్రచండమండితగండభేరుండంబులకైవడి నకుంఠితపరాక్రమకంఠీరవంబులవీక ననూనగంధబంధురసింధురంబులవిధంబున నత్యున్నతోద్రేకదుర్దమశార్దూలంబులలీలం దలపడి సింహనాదమేదురంబుగాఁ బోరువీరభటులును జంచత్పంచధారాకరాళంబులై రింఖాసంఘాతఘాతోద్ధూతవిశ్వంభరాపరాగచ్ఛలాచ్ఛాదితవిద్యోతమానఖద్యోతమండలంబులై కల్యాణపల్యాణబద్ధయుద్ధసన్నద్ధంబులగుచు రాహుత్తులతో విరోధివరూధినీసందోహంబులపైనురువణించు పటుజవతురంగంబులును నుద్దండదండాదండప్రచండంబులై ప్రతిపక్షమండలీకృత కాండాసన ముక్తకాండప్రకాండ స్రవద్రక్తధారాసిక్తాంగంబులై ధాతునిర్ఝరకలితనీలకుల కుధరంబులవిధంబున నాధోరణప్రేరణాతిదారుణదుర్నివారణంబులగుచు శతాంగతురంగసూతధ్వజసుభటగణంబుల నొక్కటఁ బడల్పడఁజేయు దంతావళంబులును ననూననేమిస్వానంబుల భూనభోంతరచరజంతునివహశ్రవఃపుటంబులు విక్షోభింప

సుభటగణంబులవియం దోలిసం జను రథంబులును గలిగి సంగ్రామం బతిభీమంబయ్యె నందుఁ దెగినకాళ్ళును దునిసినవ్రేళ్ళును దుమురైన రొ ముకలును బ్రోవులైన ప్రేవులును వెడలురుధిరంబులును విఱుగుతొడ లును దునుఁగుకొండలును బగిలినచర్మంబులును బఱియలైన మొగంబు లును దునిసిప్రేలెడికరంబులును దిరుగుకబంధంబులును బ్రక్క డొ క్క ప్రక్క ముక్కు చెక్కు మెడ తొడ కన్ను వెన్ను కేలు కాలని నిరూపింపరాక కొండలవలె వండందఱేఁగినరీతిం బహు మాంసఖండంబు లును వివిధాయుధహస్తులై నిలువున గతాసులగువారును హుమ్మని పేర్చియార్చి రోషభీషణాకారంబులంగోఁ బెటపెటఁబండ్లుకొఱుకుచుం గవిసి విపక్షకౌక్షేయకఖండితహస్తమస్తకశిరోధిమధ్యప్రదేశంబులుగ లిగి ధనుశ్శరమాత్రంబునఁ దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడుచువా రును రాహుత్తులమొత్తంబులుఁ దుత్తునియలుగా మొత్తియుఁ బక్కెర లుచించియుఁ గంఖాణరింఖాసంఘాతసముద్ధూతపాంసుపటల సంజాత బహుళాంధకారంబుఁ బ్రచండమార్తాండమండలోపమాన భాస్వత్కర గతఖడ్గమయూఖపుంజంబుల నివారింపుచు విజృంభించి మహోద్దండ శుండాలదండవిఖండితమధ్యులై నిర్వక్రరథచక్రమార్గంబులంబడివాపో వుచు నీల్గువారును శిరంబులు తెగినకరంబుల శిరంబులువిడువకదురంబు న న రి పీ రు ల మ ర ల జ ము ని మం ది రం బు న క ని పెదమనురీతి నిలువంబడి యేనుఁగులు పీనుంగులై పయింబడఁ బుడమిఁబసుమొండెంబులును మాతంగతురంగకళేబరంబులక్రిందఁజొ చ్చి హెచ్చినభయంబునఁ జచ్చినవారలంబలె మచ్చరంబులువిడి ము చ్చుముసంగి వెచ్చనూర్చుచు రిచ్చలుచెడి యచ్చటచ్చటఁబెచ్చు పెరిఁగి విచ్చలవిడి కయ్యంబులుసేయుచు సంచరించు జోదులం గనువిచ్చిచూ చి యచ్చోటువాసి కాళ్ళువడవడవణఁక నోడలెండ వికలశతాంగంబు లక్రింది కేఁగియుఁ బదాతిగణశవంబులు మీఁదికిఁద్రోసుకయు దైవంబు నకు వగచువారును బక్కెరలుచినిఁగియు ఖలీనంబులుతునిఁగియు వా

లంబులువిఱిగియు వాహకులొరగియు విచ్చలవిడిందిరుగు గుఱ్ఱంబులు ను నొగిలినదంతంబులును బగిలినకుంభంబులును ఖండంబులైనతుండం బులును శీర్ణంబులైనకర్ణంబులును ద్రీలినవాలమూలంబులును గలిగి యాధోరణులతో మారణంబునొంది క్రమంది పుడమింబడి వారణంబులు ను జక్రంబులుశకలంబులయ్యె ఘోటకంబులు భగ్నంబులయ్యె సార థులుగూలియు రథికులుమూర్ఛిల్లియుఁ గేతనంబులు రజంబులయ్యె శాతకుంభకుంభంబులుకుంభినింగలిసియు నఱవఱలైనశతాంగంబులు ను దుత్తుథుములైనకంకణంబులును బుడమింబడుకేయూరంబులును దు నియలైనకుండలంబులును బొడిపొడియయినకిరీటంబులును బెండ్లైన హారంబులును దిలలంతలై రాలినఛత్రంబులును భూమింగలసిన చామ రంబులును బంక్తులేర్పడి బహువిధమాంసాహారంబులఁ దృప్తిం జెంది శిరఃకందుకక్రీడాపరాయణత్వంబు నవి చరించు శాకినీఢాకినీనివహంబు లును గలిగి ముఖంబులు పద్మంబులు శిరోజంబులు శైవాలంబులు బాహువులు మృణాళంబులు కంధరంబులు శంఖంబులు తురంగంబులు తరంగంబులు రక్తప్రవాహంబులు జలంబులు ఛత్రంబులు ఫేనంబులు చామరంబులు హంసంబులు బాణాసనంబులు గ్రాహంబులు ద్విరదప దతలంబులు కచ్ఛపంబులు నేత్రంబులు శక్తులు భల్లాదిసాయకంబులు మీనంబులు హారరజఃపుంజంబు సైకతంబు గాఁ దదీయాహవరంగంబు కమలాకరంబుననుకరించె నాసమయంబున॥ 89

ఉ॥ సారథిఁజూచిశంతనుఁడు చండపరాక్రమలీల నిట్లనెన్
"తేరు విచిత్రమై ఖరి నతిత్వరగం జనని మ్మఖర్వదు
ర్వారకఠోరఘోరశరవారవిదారితనీరశూరవి
స్ఫారభుజాబలుండనయి భండనకేళియొనర్తు"నావుడున్॥ 90

వ॥ "అట్లకాక"నియ వాఁడు తదీయస్యందనంబు పెలుచం ద ఱిమె నయ్యెడ, 91

క॥ భేరీభాంకారంబులు,
వారణఘీంకారములును వరహయహేషల్
వీరభటార్భటులును బహు,
ఘోరంబై చెలగె భూతకోటులు బెదరన్॥ 92

వ॥ అప్పుడు 93

క॥ వాహంబులు కుంజరసం,
దోహంబు లభేద్యమానతుంగశతాంగ
వ్యూహంబులు వీరభటస
మూహంబులు భూమిపాలు మొనయుచుఁ దాఁకెన్॥ 94

వ॥ ఇట్లు తాఁకి 95

చ॥ "విడువుఁడు పట్టుఁ డేయుఁడు నవీనమహాగ్రతఁ జుట్టుముట్టుఁడీ
పొడువుఁడు కట్టికొట్టుఁడు నృపున్ వెస" నంచుఁ జెలంగి యార్చుచున్
బెడిదపుటంపరంబ ఱపి భీమముగా రథరథ్యసూతులన్
గడువడి కస్పి యుప్పతిలి కయ్యము చేయఁగఁ గ్రోధమూర్తియై॥ 96

ఉ॥ పంతము మీఱ భాస్కరుఁడు బంధురభానుసహస్రలీలచే
ధ్వాంతము మాయఁ జేయుగతి ధర్మవిముక్తనిశాతనిష్ఠురా
నంతశిలీముఖంబుల ఘనంబుగఁ దచ్ఛరపంక్తి నంతనే
యంతమునొందఁ జేసి విమతాగములన్ విదళించి వెండియున్॥ 97

ఉ॥ బంధురశౌర్యమేర్పడఁగఁ బక్కలు పిక్కలు ముక్కు లక్కులున్
కంధరముల్ శిరంబులును గాళ్ళును వ్రేళ్ళును గోళ్ళు కళ్ళునున్
సంధులు చేతు లూరువులు జానులు వీనులు కౌను లుగ్రని
ర్బంధగవృత్తితో సటికె మార్కొని భూపతి దర్పమేర్పడన్॥ 98

వ॥ ఇట్లు నటికిన బలంబులు విగతబలంబులై చలంబులు దక్కిచి
క్కుపడినం గనుంగొని, 99

—కాళింగునియుద్ధము—

క॥ కాళింగుఁడు నిశితోగ్రజ్వాలాజాలాతిభయద శరసంఘాతం
బాలోన భూమిపతిపైఁ గోలాహలమెసఁగ నార్చి కొంకక యేసెన్ ॥100

వ॥ ఇట్లేసి మఱియును 101

క॥ సూతుని నెనిమిది నెనిమిదిఁ గేతువున నైదు నగ్నికీలలు గ్రమ్మన్
శ్వేతాశ్వంబుల నాల్గిఁట నాతతగతి నేసి ధనువు నఱిమి తోఁదునిమెన్ ॥

ఉ॥ ఒండొక చాపమెత్తి నృపుఁ డుజ్జ్వలరోషకషాయితాస్యుఁడై
దండధరాకృతిం బోలిచి దర్పమెలర్పఁగఁ బేర్చి యార్చి యు
ద్దండతఁ జండకాండములఁ దద్ధనువుం దునుమాడ వే గదా
దండము వైచె వాఁడు సురదానవమానవకోటి భీతిలన్ ॥ 103

క॥ గదవైవఁ దనదు గద చేఁ గద నావనిభాగమునను గడిఖండములై
చెదరిపడ నేసి శక్తులు పదు నెనిమిది వైచె భూమిపాలుఁడు పేర్మిన్ ॥104

చ॥ అవి నిశితార్థచంద్రవిశిఖౌఘములన్ నురుమాడి వాఁడు మా
నవవరు మీఁద నార్చుచు ఘనంజయకీలలు పర్వ శూలముల్
బ్రవిమలభంగి నేయ నది పార్థివశేఖరుఁ డేడు తూపులన్
దివిజులు చూచి మెచ్చఁగ నతిత్వరగం బొడిచేసి వెండియున్ ॥ 105

క॥ ఖరకరవరకిరణసముత్కరనిష్ఠురశరము లేర్చి గాఢాకర్ణ
స్ఫురితములు గాఁగ దిగిచి యుబరువడిఁ దద్రథము నెల్ల భగ్నము చేసెన్ ॥

వ॥ ఇట్లు వికలరథుండై 107

క॥ కాళింగుఁడు క్రోధాగ్నిజ్వాలలు కన్గవఁ దొలఁగ సముద్ధత శుం
డాలారూఢుఁడయి జగత్కోలాహలలీల మరలె దోర్బల మెసఁగన్ ॥

వ॥ ఆసమయంబున 109

సీ॥ దానధారాయుక్త దంతావళంబులు
గురుతరోద్భటవృత్తిఁ గోటివేలు
ప్రబలమహామనోబలసంయుతములౌచు

ఘనతకెక్కిన ఘోటకములులక్ష
కాదంబినీసమాకలితసుందరములై
మొనసినరథములు మూఁడుకోట్లు
పటుసింహవిక్రమప్రకటవిస్ఫూర్తిఁ జేఁ
బరఁగెడిరణవీరభటులనేకు

గీ॥ లుక్కుమిగిలి తదీయమహోగ్రగంధ
సింధురమునల్గడలనిల్చి బంధురాస్య
శస్త్రసంహతిశంతను స్యందనంబు
పొదవి రుష్ణాంశుని హిమంబుపొదవినట్లు॥ 110

తే॥ పొదవిన బలంబు చెడక బెబ్బులివిధమున
హుంకరింపుచునాతఁడత్యుగ్రమెసఁగ
నాశుగాశుగ మేసి తదాశుగముల
నాశుగతిరూపుమాపె లో నరులుతలఁక॥ 111

వ॥ ఇట్లువేసి యయ్యతిరథసింహుండు సింహవిక్రమంబుమెఱయ శాత్రవచమూమధ్యంబునఁ బుండరీకాకరంబునఁ గేళిసలుపు శుండాలంబుపోలికిఁ గోదండపాండిత్యంబు నెఱపుచుఁ బడల్పడఁజేసిన సింగంబుగనుంగొని భంగంబులై పాఱు సారంగంబులతెఱంగునఁ దత్సైన్యంబు దైన్యంబు నొందినఁ గాళింగుం డుత్తుంగమాతంగంబుఁబఱపి. 112

క॥ అక్షీణఘోరభిదుర సదృక్షుంబౌ ధల్లమొకటి దిటిజాదితిజా
తేక్షణవర్గము బెదరఁగ వక్షమునాటిచిన భూమివల్లభునేసెన్॥ 113

వ॥ ఇట్లేసినఁ గల్పావసానసమయసముద్దండదండధరరేఖం గడుమీఱి శంతనుండు 114

శంతనునిచేతఁ గాళింగుఁడు చచ్చుట.

చ॥ కరిశిర మొక్కబాణమున ఖండితమైపడ నేసి యుల్లస
చ్ఛరములఁదొమ్మిదింట ఘనచాపమునుగ్గుగఁజేసి తీవ్రతన్

గరములు రెండురెండువిశిఖంబుల భూస్థలిఁ ద్రుంచివైచి వి
స్ఫురదురురత్నకుండలవిభూషితశీర్షము భల్లమొక్కటన్
ధరణికిఁ డొల్లఁ జేసె మునిదైవసమూహము సన్నుతింపఁగన్. 115

ఉ॥ అగ్రజుపాటుఁ జూచి మహితాగ్రహమేర్పడ వానితమ్ముఁడ
త్యుగ్రతఁ దేరు దోలి తనదోఃకుశలత్వముఁ జూపి బాణముల్
విగ్రహముచ్చిపోవ నృపవీరుని నేయ నతండు వేమదో
దగ్రత సంచలింపక ముదంబుననిట్లనిపల్కె నవ్వుచున్. 116

ఉ॥ "ఇంతకుమున్ను క్రోధమున నిందఱుచూడఁగ నీమపూర్వజుం
డంతకుచెంతకుం జనియె నట్టులె నీవుచనంగనేల యో
రింతటనైన నుండొలఁగు మీఁసున బైఁ జను దెంచితేని క
ల్పాంతఘనంజయోజ్జ్వల మహాస్త్రములం దలఁద్రుంతు" నావుడున్.

ఉ॥ అంతటఁ బోకవాఁడు విలయాంతకు భంగిఁ జెలంగియార్చి దు
ర్దాంతనిశాత బాణసముదాయము పైఁ నడరింప వాని నిం
తింతలు చేసి భీషణతరేషుచయంబులు నాటఁజేసె భూ
కాంతుఁడు వాని మేన సురకాంతలు మిన్నున సంతసింపఁగన్. 118

శా॥ సూతున్ ధాత్రికిఁ ద్రెళ్లఁ జేసి ధనువుం జూర్ణంబుగాఁ జేసి వి
ఖ్యాతిన్ వాహచతుష్టయంబు శిరముల్ ఖండించి కోటీరమున్
కేతుస్యందనముల్ వెసన్ నఱికినం గ్రోధాత్ముఁడై ఖడ్గమున్
జేతంబూనుక రాఁగ వేగ దునిమెన్ శీర్షంబు దగ్రంబుగన్. 119

వ॥ ఇట్లు కళింగనాథానుజుండు పడినఁ దదీయవరూధినిఁ జే రుగలిగిన యోధులా యోధనంబున నమ్మహీధవు "వధింత,, మం మధుమథనునిపయింబఱతెంచు పూర్వగీర్వాణులవిధంబున దశదిశాం తరాళంబులునిండ నార్చిపేర్చి పీఁకం దాకిన నమ్మేటిమగండు గండు

మీఁతి శరాకర్షణసంధానమోక్షంబు లేర్పరింపరాకయుండఁ బ్రచండ మండలీకృతకోదండదండంబు మెఱయ నిశితార్ధచంద్రభల్లకౌక్షేయకాదిసాధనంబులఁ జతుష్షష్టిసహస్రసంఖ్యలగు వసుంధరకుంబలిఁ జేసె నప్పుడు. 120

సీ॥ మృగమదఘనసార మిళితవక్షోజముల్
నెఱిమించునఖముల నిమిరినిమిరి
మహితవీటీరాగ సహితములై యొప్పు
చక్కెరమోవులు నొక్కినొక్కి
దరహాసచంద్రికాంకురకపోలంబులు
పెంపుసొంపుదుత ముద్దుపెట్టిపెట్టి
ఫణిపద్మబద్ధ్వాణపాశబంధంబుల
లీలతో రతికేళిఁదేలితేలి
గీ॥ రమణ రంభాదినిఖిలాప్సరఃకదంబ
కాంతతరదివ్యభర్మహర్మ్యాంతరాళ
కల్పసుమకల్పితానల్పతల్పములను
వీరులుండి రనేకు లవ్వేళయందు. 121

—శంతనుమీఁదికి సాళ్వుఁడు యుద్ధమునకువచ్చుట—

వ॥ ఆసమయంబున. 122

క॥ శకసాల్వమహీపతు లా త్యకలంకగు సంతసముల నలరుచు నిశితాంబకసంహతిశంతనుపైఁ బ్రకటంబుగఁగదిసిచలముబలముగ గదురగ.

వ॥ ఇట్లనిరి. 124

చ॥ "చలమున నొవ్వ దివ్యశరజాలము నేసి వరాభియాతిదో
ర్బలవిభవంబుమాన్పి పటుబంధురశౌర్య మవార్యమైతగగ

వెలసిన వారమేము పృథివీపతులందు,తొలంగు పిన్న వు
జ్వలబలదర్పశౌర్యములు చాలవు నీకు రణంబుసేయఁగన్. 125

సీ॥ బంధుమిత్రామాత్యసింధురగాంధర్వ
రథతమోభాస్వత్కిరణము రణము
అశ్రాంతరాజమానానంతనిర్నిద్ర
ఘనసుఖదుఃఖకారణము రణము
స్ఫుటతరమానసాంభోజసంభవలస
త్ప్రకటరోషానలేంధనము రణము
చిరకాలసంచితాంచితమహోన్నతపుణ్య
రమణీయమార్గవారణము రణము
ప్రబలకిల్బిషవిసరశరణము రణము
ప్రథితబుధలోకకలితగర్హణము రణము
ప్రకటధర్మక్రియాబ్జవారణము రణము
ప్రమదకౌటిల్యదుర్విచారణము రణము. 126

ఉ॥ కావున నెట్టివారికిని గయ్యము నెయ్యము సేయ నేర్చునే
నీవు తొలంగు బాలుఁడవు నిత్యము సత్యము తప్పకుండ నా
త్మావనిపాలనంబు ముదమార నపారనదీనదీనత
స్త్రీవిగఁ జేసికొమ్ము నిను నేరము లెన్నము కాచి ముందరన్". 127

వ॥ అనిన విని శంతనుండు క్రోధహాసభాసురముఖారవిందుండై యిట్లనియె.

ఉ॥ "పిన్న బలంబు పెంపు మఱి పెద్దలశౌర్యము తెంపు నాజిలోఁ
గన్నులఁ జూతు రందఱును, కష్టపుమాటల కేమి, లోకమె
ల్ల నుతిసేయ నాదు కరలాఘవ మిప్పుడు గానవచ్చు మీ
కెన్న నిమేషమాత్ర మిటు లేర్పడ నిల్వుఁడి నాదు ముందటన్. 129

తే॥ చండతరమద్ధనుర్ముక్తసారఘోర
నిష్ఠురామోదఘుమఘుమనినదభూత
బాణనిర్ఘాతసంఘాతబహుళభటాత
ములకు బ్రహ్మాదులైనను నిలువఁగలరె. 130

వ॥ అదియునుంగాక. 131

ఉ॥ ఇంతకుమున్ గళింగపతి యేర్పడఁ దమ్ముఁడు తాను కూలుటల్
పంత మెసంగఁ జూచియును బాహుబలంబుచలంబులొప్పఁగా
శంతనుపైకివచ్చుటలు జన్మఫలంబటుగానకుండు రం
డంతకుఁగొల్వఁగాఁజనుదు''రంచు శరంబులు నాటనేసిరన్. 132

◆ సాళ్వశంతనులయుద్ధము ◆

క॥ శకభూపాలుఁడు క్రోధో
త్సుకుఁడై వాహములమూట నూతుబదింటన్
బ్రికటాంగంబులునాటఁగ
నకుటిలగతి నేసి పేర్చి యాజినికినుకన్. 133

తే॥ శక్తివైచినదనుమాడె జనవిభుండు
నరికెఁ బదిశక్తులేసిన సురసముండు
శక్తిశతమేయ ఖండించె శంతనుండు
మించి వెయిశక్తులడరింపఁ ద్రుంచెనతఁడు. 134

వ॥ ఇట్లు త్రుంచి. 135

క॥ పదులు పదిపదులు వేలునుబది వేలును నూఱు వేలు బంధురశరముల్
గుదిగ్రుచ్చినట్లునాటెనఁ జదికిలఁబడి లేచిపాఱె శకవరుఁడంతన్. 136

మ॥ చటులభ్రూకుటిదుర్నిరీక్ష్యుఁడగుచున్ సాల్వుండు వేగంబ వి
స్ఫుటరౌద్రానలతీవ్రకీలల మహాంభోరాసులం గ్రాచు ను

ద్భటశూలంబు త్రిలోకభీకరముగాఁ బైనేయ ఖండంబులై
యటభూమింబడ నేసె శంతనుఁడు శాతాస్త్రస్ఫురచ్ఛక్తిమై. 137

వ॥ సాల్వుండు 138

క॥ నిటలాంబకవిటలాంబక
చటులాంబకమేర్చియార్చి తన్మోభుజాభుజమున్
దటుకున నాటఁగ నేసిన
జొటజొటరుధిరంబు దొరఁగె సురలుతలంకన్. 139

ఉ॥ కోపముతోడ శంతనుఁడు గొబ్బున హుమ్మని భల్లమొక్కటన్
జాపమునుగ్గుగాఁ దునుమ సాల్వుఁడు వేఱొకచాపమెత్తి పృ
థ్వీపతిమేన బాణములు తీవ్రతనాటఁగ నేసి వేడ్కఁ ద
చ్చాపముచక్కఁగా నఱికెఁ జండభయంకరతీవ్రమూర్తియై. 140

వ॥ మఱియును 141

క॥ చండఘనుర్దండముగొని మండలపతి క్రోధఘూర్ణమానానూనో
ద్దండస్వాంతుండై బల్కాండంబునఁ బెలుచసూతుకంఠము దునిమెన్.

వ॥ ఇట్లుసారథిఁజంపి మఱియును 143

క॥ బాణంబులనాల్గిటఁ గంఖాణంబులతలలుదునిమి కాండాసన మ
ర్ధేణాంకశరమునఁ దనుస్త్రాణకిరీటములు భల్లతతి విదళించెన్. 144

వ॥ అంతటఁబోకసాల్వుండు కల్పితస్యందనుండై నృపతిపురందరుపయింగవిసి నిశతవిశిఖవిసరంబులు దశదిశలునిండనేసి పేర్చి యార్చిన. 145

క॥ మార్వి మొరయించి హాహా! గర్వంబేపారనృపుఁడు గంధవహాస్త్రం
బుర్వగఁదగులఁగఁ నేసిన, బర్వతబాణమున వాఁడు భగ్నముఁ జేసెన్॥

క॥ నాగాస్త్రమేసెభూపతి

వేగమె సాల్వుండు గరుడవిశిఖాభిహతిన్
బాగమటించితునియఁ జేసెను
వేగుగఁ దిమిరాస్త్రమేసె విభుఁ డుత్కలికన్॥ 147

శా॥ చండక్రోధమహోగ్రమూర్తియగుచున్ సాల్వుండు వేగంబమా
ర్తాండాస్త్రంబడరింపఁ ద్రుంచి సురదైత్యశ్రేణియార్వంగ ను
ద్దండప్రక్రియ శంతనుండడరి గాంధర్వాస్త్రమున్ వైవ సా
ల్వుం డింతింతలుచేసె నిర్జరవరాస్త్రోత్సాహసంరంభతన్॥ 148

క॥ ఇవ్విధమునఁ దనశరములు
క్రొవ్వాడినిరూపుమాపఁ గుత లేశు డులో
నివ్వటిలు క్రోధమెసఁగఁగ
నవ్వుచునిట్లనియె సాళ్వనర నాయకుఁ శోన్॥ 149

మ॥ "వినురామూఘుఁడ! సాల్వభూరమణ! నీవిన్నాణ్త్రి నేఁగంటి నేఁ
డనిలో నిందఱుచూడ నీదుశిర మత్యంతోగ్రబాణత్రయం
బునఖండింపుదు, లేకతక్కినఁ బ్రదీపోర్వీతలాధీశసం
దనుఁడంచున్ ననుఁబల్కనే"లని మదోద్ధత్యంబువాటిల్లఁగన్॥ 150

క॥ అర్ణవసంఘముగలఁగఁగ, స్వర్ణాద్రిచలింప దొడ్డశరమేర్చి మహా
దీర్ణత నెక్కడ విల్లా, కర్ణాంతముగాఁగఁదిగిచి కదువడినేసెన్॥ 151

క॥ మింటనుమంటలుగ్రమ్మఁగఁ
గంటకమున నేగుదెంచుఘనబాణము క్రే
గంటను బాఱఁగఁగనుఁగొని
తుంటలుగాఁ జేసెవాఁడు దోర్బలమలరన్॥ 152

ఉ॥ ఒండొకబాణమేర్చినృపుఁ డోయనిమింట సుపర్వులార్వఁగాఁ
జండధనంజయార్చులు దిశాతతులన్ వడిఁగ్రమ్మ నుల్లన

ద్దండధరాకృతింగనలి తప్పక నేయనతండు మార్గణా
ఖండపటిష్ఠలీల గడికండలుచేసె విచిత్రమేర్పడన్॥ 153

వ॥ ఇట్లు సాయకద్వయంబు నిరర్థకంబయిన మహీనాయకుండు కలంగక దుర్వారబాహాఖర్వగర్వసంపన్నుండై తొల్లి గంధపుష్పాక్షతాలంకృతంబగుచుం బసింపుయొరం బెట్టిన యమ్మహాసియశక్తి సమంత్రకంబుగాం గైకొని యం దాదిమధ్యాంతంబులం గల్పాంతసమయానల్పకేళివిహారి ఫటచ్ఛటారవస్ఫురత్స్ఫులింగభూన భ్రాంతరాళకరాళత్రిశూలపాణియగుశూలపాణియుం బ్రళయవేళాసముజ్జృంభమాణకీలాపభాస్వరుండగు వైశ్వానరుండును సంవర్తసమయసముద్దండదండధరుండైన దండధరుండు నుండునట్లుగా ధ్యానంబుచేసె 154

క॥ "దానము సద్గురుభక్తియు
జ్ఞానము జపముం దపంబు సత్యంబు హరి
ధ్యానము నాయెడఁగలిగిన
మానుగనీశక్త సాల్వ మహిపయిఁగూల్చున్" ॥ 155

వ॥ అనిపలికి యేసిన 156

క॥ పిడుగులుటక్కులఁబడియెను। దడఁబడెఁబద్మాప్తు తేరి ధారాటంబుల్
గడగడవడఁకెజగంబులు। వడిచెడెనింద్రాదిదివిజవర్గముమనముల్॥

సీ॥ ఘంటికాసాహస్రఘణఘణోద్యద్ధ్వాన
పరిపూరితాజాండభాండమగుచు
బంధురోగ్రప్రభాపటలవిద్యోతిత
ప్రస్ఫురద్దశదిశాభాగమగుచు
వర్ణితాంభోజసంభవనిర్జరేంద్రాది
నిఖిలకమప్పాలనివహమగుచుఁ

జలితలోకాలోక శైలావృతోల్లస
త్సర్వసర్వంసహాచక్రమగుచుఁ
జటులశతకోటికోటినుస్సహానిశాత
ఘోరతరకీలికీలికాకులితసర్వ
జంతుసంతానమగుచు వే సాల్వుమీఁద
నరుగుదెంచిననాతండు బిరుదుచెడక॥ 158

—శంతనునిచేత సాల్వుఁడుచచ్చుట—

తే॥ వడి రథమునుండి పలుకయు వాలుఁ బూని
మంటపైనేగు వీరసింహంబుమాడ్కిఁ
బయిఁగవియ రత్నకుండలప్రభ వెలుంగు
తచ్ఛిరమ్ముద్రుంచె విమతులుతల్లడిల్ల॥ 159

—శతకవచుఁడు యుద్ధమునకు వచ్చుట—

వ॥ ఇట్లుసాల్వుండు తక్షణంబ తీక్షణంబగుశక్తిచేత నిహతుం డైనఁ గనుంగొని వానితమ్ముఁ డుత్తుంగాభిరామంబును గామగమనోద్దామంబును శాత్రవచమూభీమంబును నగు తేరునడిపించి 160

క॥ శతకవచుఁ డుగ్రవైఖరి। శతకోటినిశాతవిశిఖసంతతులు మహీం
శతమన్యుమీఁదనేసెను। శతధృతిముఖలేఖగణమునన్నుతిసేయన్॥

వ॥ అవియును శంతనుం డనర్గళమార్గణాసారంబున వారించి 162

క॥ మెఱుఁగడరు నంపగమిచే
నురువడిఁ దచ్చాపదండ మురుఖండములై
ధొరగంగఁజేసి హయముల
నఱువది బాణములగప్ప నాఱనికినుకన్॥ 163

వ॥ సాల్వానుజుండు వేఱొకవిల్లెత్తి 164

క॥ దండధరచండధామా।ఖండపరాక్రమముతోడఁ గాండౌఘము భూ
మండలవల్లభు మేనన్।నిండారఁగనాటునేసె నిర్జరు లడలన్॥ 165

ఆ॥ మరలజమునిచూపుధరఁగొనుతూపుల
నాగ్రహమున నృపునివిగ్రహంబు
గరిమఁదూఱనేసె నురువడిఁబాములు
పుట్టలోకినేగుపోల్కిఁ దోడ॥ 166

వ॥ ఇట్లేసి సింహనాదంబుచేసిన నవ్వసుంధరామండలాఖండ
లుండు దండతాడితపుండరీకప్రచండంబుడంబునన్ గండుమిగిలి బెండు
పడక॥ 167

శా॥ ఆస్ఫోటించి ప్రచండదావదహనవ్యాభీలకీలాచ్ఛటా
ప్రస్ఫీతేక్షణలీలఁబోల్చి నిబిడద్రాఘిష్ఠమౌర్వీప్రభూ
తస్ఫారారవపూరితోర్వీధరమాద్యత్కుంభిరాట్కర్ణుఁడై
విస్ఫూర్జత్స్ఫుటవిస్ఫులింగచయముల్ వే కన్నులంగ్రమ్మఁగన్॥ 168

వ॥ విజృంభించి॥ 169

చ॥ పిడుగులఁబోలుబాణముల భీమముగాఁగ నృపాలశేఖరుం
డడరిపదేనువైవఁ గవచాభిహతిన్ వడి బిట్టమోఘమై
పుడమిఁబడన్ మహోగ్రతను భూపతి క్రమ్మఱ భల్లసప్తకం
బుడుగనిచేవనేయ నవియుం దొరఁగెం గతశాతసంపదన్॥ 170

వ॥ అయ్యెడ॥ 171

క॥ శతకవచుఁ డుగ్రసాయక।వితతిన్ భూపాలుమౌర్వి విచ్ఛేదముగాఁ
గ్రతుభుక్సంఘము మెచ్చఁగ।నతులితగతి నేసియార్చె నంబరమగలన్॥

వ॥ అంత శంతనుండు॥ 173

చ॥ చిటచిటవిస్ఫులింగములు చిందఁ బవందఁ బలై కనుంగవన్
జొటజొటరాల వేఱొకటి శూరత నారినమర్చి వేగమే
పటుతరరుక్మపుంఖయుత భాస్వరసాయకతీవ్రపావక
స్ఫుటచటులప్రభాపటల పూరితసర్వదిగంతరాళుఁడై॥ 174

క॥ పదిపదులు నైదుపదులును। బదినూఱులు లక్ష కోటి పద్మానీక
ప్రదరములు మరల నేసినఁ। గడనంబున మునలువిఱిఁగి ఖండములగుచున్

చ॥ అవియునునట్టి గాఢకవచాభిహతిం గడునక్కజంబుగాఁ
భువిఁబడియొం బదంపడి విభుండు శితార్ధశశాంకబాణముల్
జవమునఁ దొంబదేయ నవి సర్వజనంబులు చిత్రమందఁగాఁ
బ్రవిమలరీతిఁ వ్రాలె రణరంగమునం దగఁ బూర్వవైఖరిన్॥ 176

వ॥ శంతనుండుమఱియును ననేక నిశితశరపరంపరలుగురిసిన ఛిన్నంబులై విపక్షక్షమాభృత్పక్షవిక్షోభంబు సేయనేరక తద్దంభోళికోట్యమోఘనిష్ఠురకవచాభిఘాతంబున వ్రాలినం గనుంగొని చేయునది లేక దురంతచింతాక్రాంతస్వాంతుండై యిట్లనివితర్కించె॥ 177

ఉ॥ మాయయొ యింద్రజాలమొ సమాయతశాస్త్రవగర్వభేదనా
పాయమొ మంత్రసిద్ధియొకొ భావభవారివరప్రభావమో
స్థాయతర త్వగింద్రియపృథుస్థిరపాటవమొక్కొ భారతీ
నాయకకల్పితంబొ యిది నాకుఁదలంప నసాధ్యమెంతయున్॥ 178

శా॥ కల్పాంతాగ్నిసమానఘోరములు నిర్ఘాంతస్ఫురద్భీషణా
నల్పంబుల్ చటులాంతకప్రకటదండక్రూరముల్ భూరిసం
కల్పోద్భూతహరత్రిశూలనిశితాఖండంబు లస్మచ్ఛరం
బు ల్పొల్పొందఁగ వీనిఁదాకి పొడియై భూమిస్థలిన్ వ్రాలెడిన్॥ 179

ఉ॥ ఏమివిధంబునం గెలుతునీతని నుగ్రరణాంగణంబునం
దేమియుపాయమింక, మనుజేశ్వరమాత్రుడుగాడువీడు, సం
గ్రామమిఁ కెట్లుచెల్లునొ శరప్రకరం బడరించి మన్భుజో
ద్దామపరాక్రమక్రమముడంగెను వైరివధం బిఁకెట్లొకో॥ 180

వ॥ అని తలంచుసమయంబున గగనభారతి యిట్లను "నిఖిలకవ
చనిర్భేదినియను శక్తి సురేంద్రదత్తంబై భవదధీనంబగుటం జేసి య
న్యశస్త్రాభేద్యంబులగు వీనికవచంబులు నూఱు నిమిషమాత్రంబునఁ
జూర్ణంబులగు, అంతటఁగాలియు, దానిం బ్రయోగింపు"మని చెప్పి
యూరకుండె నంత శంతనుం డత్యంతకుపితస్వాంతుండై యమ్మహాసీ
యశక్తి ప్రయోగించిన॥ 181

• శంతనునిచేతిలో శతకవచుఁడు చచ్చుట. •

క॥ అవిరళగతి సురలార్వఁగ। భువనము లాకులతఁజెంద భూరిస్ఫురణన్
రవికోటిసన్నిభోన్నతిఁ। గవచంబులునూఱు రజముగతిఁగావించెన్॥

వ॥ ఇవ్విధంబునఁ గవచంబులుచూర్ణంబులుచేసి యంతలోన॥

క॥ భగ్నస్వాంతుండై పతి। మగ్నంబై సర్వలోకమండలి తలఁకన్
భగ్నముగఁజేసె ఘనని‌శి। తాగ్నేయాస్త్రమునవిమతునరదంబెల్లన్

వ॥ ఇట్లు కవచస్యందనంబులు భగ్నంబులైన నతండు పక్షర
హితంబైన విహంగంబుకైవడి బలశౌర్యంబులడంగి పైకినేతెంచి గదా
దండంబువైచిన॥ 185

క॥ గదదునిమి వజ్రనిశిత। ప్రదరంబున దేవచయము ప్రస్తుతిసేయన్
గదనస్థలిఁ బడనఱకెను। ముదమారారంగ శత్రుమూర్ధము వేగన్

వ॥ ఆసమయంబున॥ 187

• శంతనునికడకు నారదుఁడువచ్చుట •

సీ॥ ప్రాచేతసవ్యాసభట్టారకులకు నె
వ్వానిబుద్ధి ధరిత్రి వన్నె నెఱపెఁ
బుండరీకస్తోత్రిపాసఁగఁ జక్రికిఁ జక్రి
వరుఁడిచ్చు శిరము లెవ్వానిపాట
కొత్తానపాడి ప్రహ్లాదుఁ డెవ్వనిఁ గార
ణాచార్యవర్యుఁగా నాత్మఁదలఁతు
రెవ్వఁడు రాయంచనెక్కుడు తెలిగంటి
పెద్దకు ముదమిచ్చుముద్దుపట్టి
జగతినెవ్వఁడు వైష్ణవచక్రవర్తి
యెవఁడురుచిరాంగనిర్భర్గితేందుకుంద
శరశరన్నీరదుం డట్టిసారమౌని
నారదుఁడు సర్వవిద్యావిశారదుండు॥ 188

వ॥ పాడచూపిన నప్పుడమితేఁడు వినయభయభక్తితాత్పర్యం
బుల నమస్కరించి సుఖాసీనుం జేసిన నారదుండిట్లనియె॥ 189

క॥ "శోకారివంశపావన! నీకబ్బెఁ విజయలక్ష్మి నిస్సీమగుణ
స్తోకత ధరణీమండల! మేకాతపవారణముగ నేలుము" మహిమన్॥

వ॥ ఇంక నృపతివధంబుడుగుము, "అహింసా పరమోధర్మ"
యను వచనంబెఱుంగవె" యనిపలుకునప్పలుకుచిలుకలకొలికిపటపుకా
యనిపట్టికి రాజతిలకుండిట్లను '(మహాత్మా! భవదాశీర్వచోవిశేషంబున
ననల్పసంకల్పసిద్ధుండనౌట కద్భుతంబేల, "రాజవధంబుడుగు" మనిపలి
కితిరి యప్పనికిపమ్మతించితి, మిమ్మునొక్కవిచిత్రంబడిగెద నానతిండు॥

క॥ శతకవచనృపతిసమర! క్షితిరంగమునన్ మదీయసితశరపాశా
ఘాతినింతకుమునుకూలెను!శతధృతిముఖలేఖగణము సన్నుతిసేయన్॥

చ॥ అవిరళబాహుశౌర్యమహిమాతిశయంబున నస్త్రశస్త్రవై
భవమున దివ్యతేజమునఁ బార్థివకోటులు వీనిసాటియే
భువి నదిగాక శాత్రవసమూహముచే నిరపాయమొందు నీ
కవచశతంబు మేననెటుగల్గెను దేవమునీంద్ర! తెల్పవే॥ 193

◆ నారదుఁడు శతకవచునిపూర్వవృత్తాంతము చెప్పుట. ◆

తే॥ అనిన నంభోజసంభవతనయుఁడని యెఁ
గుంభినీజంభభేది కుజ్జృంభమాణ
సారగంగాతరంగగంభీరభూరి
ఘుమఘుమారావమధుర వాగ్గుంభనమున॥ 194

క॥ అత్యంతసుందరంబై। ప్రత్యక్షశ్రీవిలాసభాసితవిభవా
న్నత్యేషాపరతంత్రా। దిత్యంబై జగతి సాల్వదేశంబలరున్॥ 195

చ॥ కలదొకరాజధాని శశికాంతశిలామయసర్మహర్మ్యమం
డలవరకూటకోటిఘటితస్ఫుటికస్ఫుటదీధితిచ్ఛటా
కలితవిచిత్రవృత్రహరకాంచనసౌధమణిప్రభాళియై
విలసితసర్వసంపదల విశ్వధరిత్రిని శ్రీపురంబనన్॥ 196

క॥ ఆనగరింబేలెడిపృథి। వీనాథుఁడు ఘోరశత్రుతిమిరౌఘోద్య
ద్భానుఁడు శశ్వద్బాహా। క్షీణపరాక్రముఁడు చంద్రశేఖరుఁడలరున్॥

సీ॥ రాజతాచలధామరమణీయధృతిగాంచి
వహి సర్వమంగళావాసుఁడయ్యె
పుణ్యజనేశ్వరాగణ్యమైత్రివహించి
సకలలోకప్రియ సరణిగాంచె
అతులితానంతసాయకరూఢిఁజెన్నారి
వరధర్మవిజయ సంభరత నెసఁగె

గరిమ మహేశ్వరఖ్యాతిచే,గన్పట్టి
కమనీయశుచిసమాఖ్యను జెలంగె
నవత రామిత్రపురభేదనంబొనర్చి
విబుధవర్ణితసద్గుణవిఖ్యాతిగనిమె
చంద్రశేఖరుఁడౌనని జనులువొగడఁ
జెలఁగె నిమ్మహి నా నృపశేఖరుండు॥ 198

ఉ॥ ఆతనికుద్భవించిరి హిమాచలధైర్యధురీణు లస్త్రవి
ద్యాతతనైపుణుల్ విమతదారుణభూరిపరాక్రమక్రముల్
హీతభయుల్ జయోన్నతులు విశ్రుతనిర్మలసాంద్రకీర్తిసం
జాతులు సాల్వుఁ డీతఁడును సర్వజగత్ప్రణుతప్రసిద్ధులై॥ 199

వ॥ ఇంతకుమున్నె కయ్యంబున నీచేతఁగూలినవాఁ డీశతకవ చాగ్రజుండు సాల్వుండనువాఁడు సురాసురాభేద్యమానానూనదుర్వార బాహాశౌర్యసంపన్నుండై తమతండ్రియనుమతంబున రాజ్యపాలనంబు సేయుచుండె, శతకవచుండును ద్వాదశవత్సరంబులునిండినయనంతరంబ తపంబుసేయువేడుకం జనిచని॥ 200

చ॥ కనియెనృపాలనందనుఁ డఘూతగభీరకనద్దరీఝరీ
ఘనతరఘోషభీషణవికస్వరతుంగతరంగసంభ్రమ
ద్వనగజరాజరాజినిబిడగ్రహణాగ్రహవిగ్రహోల్లసత్
వనతమదేభశత్రుకులవైభవచిత్రము పారియాత్రముఁ॥ 201

వ॥ అప్పర్వతోపకంఠంబునందు॥ 202

సీ॥ ద్విరదవిద్విడ్వ్రాత తీవ్రఘోషప్రతి
ఘోషిత దశహరిత్కుహరముఖము

కుహనాగహనవాగ కోట్యుగ్రనిగ్రహ
చకిత నానామృగసంగతంబు
వాహద్విపచ్ఛమూ వాహప్రోత్సాహస
న్నాహధూర్వహాచల న్మహితలంబు
స్థరోమస్తోమ సాంద్రఘుర్ఘురరావ
కంపితానేక శాఖామృగంబు
స్వచ్ఛమధురసపానాల సాచ్ఛభల్ల
భల్లసఖముఖ నిర్దళద్బహుళ నాకు
రంధ్రనిర్గత గూఢపాద్రటకుదార
హారిభుగావళియగు నరణ్యమును గనియె ॥ 203

వ॥ అందు 204

సీ॥ పాకాలపాంకురా స్తోకాంగసుఖచక్ర
వాకాంగనాచయ శ్రీకరంబు
భేకాలిఘోషణా నీకాంబరోద్గతా
నేకార్భక బకౌఘనిరుపమంబు
నాళీకవిగళ న్మధూళీభ్రమద్భృమ
రాళీకలస్వనాభ్యంచితంబు
లోలీభవద్భృంగ కేళీగత లసన్మ
రాళీమణీచక్రవాళయుతము
రంగదుత్తుంగ యజ్ఞాంగ తుంగనాగ
రంగ నారంగ కట్వాంగ లుంగ మాతు
లుంగక లవంగ సుకుదుంగ సంగతోరు
తీరమీక్షించె నెదుటఁ గాసారమొకటి॥ 205

వ॥ అమ్మహాసరోవరంబునందుఁ గ్రుంకి భూతిరుద్రాక్షమాలికా ధరుండై యమనియమంబులు గలిగి స్వస్తికాసన పద్మాసన సిద్ధాసన మయూరాసన భద్రాసన కపాలాసనసింహాసన వీరాసనాది నానాసనం బుల మూలోడ్యాణ జాలంధరబంధంబుల సుస్థిరుండై యాధార స్వాధి ష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాది నానావిధచక్రానుగతంబైన ప్రా ణాపానవ్యానోదానసమానాఖ్యలం బరఁగిన పంచానిలంబులఁ జంద్రసూ ర్యాగ్ని సంజ్ఞలం బరఁగిన యిడాపింగళాసుషుమ్నా నాడికోటరంబుల రేచ క పూరక కుంభకంబులు సేయుచు వాయుజయంబు గలిగి నిర్మలంబును నిశ్చంచలంబును నైన చిత్తంబునఁ జిత్తజారాతి నారాధించుచుఁ బం చరాత్రంబుల కొక్కమాఱు బదరీఫల శ్రీఫలఫలాది వన్యఫలంబులు భ క్షించుచు మాసంబు గడపి యంతటనుండి దశరాత్రంబుల కొక్క నాఁ డు పత్రభక్షణంబు సేయుచు రెండవమాసం బుత్తరించి యంతటఁ బక్షం బునకొక్కమాఱు కరతలప్రమాణోదక పానంబు సేయుచు జఠరాగ్నిన డంచి మూడవమాసంబు గడపి యంత నిరాహారుండై యచేతనంబైన కులధరంబు కరణి నిశ్చంచలుండై యుండె నాసమయంబున॥ 206

• గ్రీష్మర్తు వర్ణన •

క॥ ఉష్ణాగమ మెసఁగె ధర
నుష్ణమయూఖోజ్జ్వలన్మయూఖపరిభవా
తృష్ణాప్తిగ జనమై మృగ
తృష్ణైకసమేధమాన తీవ్రస్ఫురణన్॥ 207

క॥ వడిఁబ్రవఁజొచ్చెబోరునఁ। బడమటిగాడ్పులు మహోష్ణభరణశ్రీలన్
జడనిధిసంభృతభాస్వ। ర్బడబానలశిఖలఁగలసి పఱతెంచెనన్ ॥208

తే॥ గరిమ నఖిలర్తువుల వేయికిరణములను
బూనికను సర్వజంతువితానదేహ
దాహమునకయి యవ్వేళఁ దాల్పఁబోలు
ననినకైవడి వేడిమి నినుఁడుమెఱసె॥ 209

క॥ మెండుకొనిపుండరీకోభ। వాండకరండములనిండి యతిచండంబై
యెండ వడిఁగాయఁజొచ్చె న।ఖండంబుగ నగ్నిగురియుకైవడిఁబుడమిన్॥

తే॥ వరుస సరసుల జీవనస్ఫురణమెడలె
నహరహముఁ గుందెఁ గువలయం బాత్రిచేత
నినుఁడపుడు పంకజాతమైఅని మహోగ్ర
తేజమునమీఱి నిటులౌట నైజమొకద॥ 211

క॥ పరలోకతాపకృద్భాస్కరకరసాంగత్యమునకు శ్వసనాశసరా
డ్గరళాగ్నులుచనుదెంచెడి। సరణులగతిఁ జిల్లులు రసాస్థలినెఱసెన్॥

తే॥ భవుఁడుతగవిష్ణుఁడవిష్ణుపది జలాంత
రముననుంచుట యయ్యుష్ణశమముకొఱకె
పద్మనాభుండు జలరాశిభవనుఁడౌట
పరఁగనయ్యుష్ణమునకును వెఱచికాదె॥ 213

చ॥ స్తనహిమశైలముల్ ఘనభుజాబిసముల్ కచశైవలంబులున్
వినుతవళీతరంగములు నిర్మలనాభిసరోవరంబులున్
గనదధరామృతంబులు వికస్వరభాస్వరహాసచంద్రికల్
తనువులుచల్లసేయ సతులం బతులొంది సుఖించిరత్తఱిన్ ॥ 214

తే॥ సకలజనముల తృష్ణోపశాంతిసేయు
తక్రమవ్వేళఁ బానీయధామములను
బరఁగనొనరించె బహుజలపాన మింక
నితరులగుప్రాణుల విదాహ మెన్నవశమె॥ 215

సీ॥ తొడలపైఁ జేర్చుక తోరంపుఁబాదముల్
సిరియు భూదేవియుఁ జేరియొత్త
భాసురేందీవరప్రస్ఫురద్విగ్రహా
వరణసంపద హారిద్వస్త్రమమర
వేత్రదండముఁబూని సూత్రవతీభర్త
యమరుల కోలాహలముననుమాన్ప
వేయితేకులుగల్గు వెల్లతమ్ములతోడ
హాయాలుఁజూపెడు నేత్రయుగముమూసి
నిద్రఁజెందెఁ దగంగ నిర్నిద్రరత్న
ముద్రితాత్ముద్రదుగ్ధసముద్రమధ్యఁ
గాద్రవేయఫణాతల్పకంబునందు
మాధవుండు తదాషాఢమాసమునను॥ 216

శా॥ జీమూతాఖ్యవహించె భాసురశిరస్సీమావతంసంబుగా
జీమూతంబులువూనెఁ దద్భవనద్రశ్రీనాత్మఁగాంక్షించి మ
న్నామంబూనినబర్హికోటికి శరణ్యంబ్ చేర్చెర్ధ వీని నే
వేమా చిత్తచినన్నలీల శిఖి యుర్వీధ్రాళి హెచ్చెంగదా॥ 217

సీ॥ శాత్రవచయసమిజ్జయఘనాభ్యుదయాప్తి
నలరారి హరిసహాయత్వమొంది
కీచకహరిబలాక్షీణలీలఁజెలంగి
పున్నాగజాలవిభూతినంచి
సుందరకాంచనస్యందనచక్రము
లుర్విపాల్చేసి మాయులనడంచి
బాణాసనశరాళి భస్మంబుగావించి
పరవీరవరుల పే రరుదుచేసి
రన్యుకీలాలసద్గతి రహిందనర్చి
మేలిమిప్రతాపదీప్తుల మిన్నుముట్టి

సంభ్రమస్ఫూర్తితో ధనంజయుఁడు మెఱసె
నొనరన వ్వేళఁ దగ మహావనులయందు॥ 218

మ॥ జలతృష్ణన్ క్షితిభృద్గుహాచయములో సంతాపముం బొందుచున్
గలభద్విట్కుల మష్టదిక్కులదరన్ గర్జిల్లి యార్వంగ మ
ర్త్యులకుం దోఁచుఁ బ్రచండదావమున నాయుర్వీధరాగ్ర్యంబులు
జ్వాలరౌద్రోద్ధతి నార్చెనో యనఁగ భీష్మంబైన గ్రీష్మంబునన్॥ 219

వ॥ ఆసమయంబున॥

క॥ పంచాగ్నిమధ్యమంబునఁ బంచాననునిం గుఱించి భక్తిని భూభృ
త్పంచాస్యనందనుండు ప్రపంచము వెఱఁగంద ఘనతపంబొనరించెన్॥

శా॥ ప్రావృట్కాల మమోఘమేఘపటలీప్రత్యగ్రజాగ్రద్ద్యుతి
శ్రీవిద్యుద్వరపుంజసంజనితనిస్సీమాగ్రగర్జార్భటీ
భావాసహ్యపరద్విపద్విషదురుప్రారంభగంభీరఘో
షావిఖ్యాతజయోద్యమాద్రిబలహార్యక్షంబుతోడన్ దగెన్॥ 221

చ॥ ధళధళదివ్యకాంతుల నుదారములై తగెఁ జంచలాలతల్
పెళపెళతీవ్రనాదముల భీష్మములయ్యెను మేఘఘోషముల్
గళగళనిస్వనంబుల జలస్థలులం గనుపట్టె భేకముల్
సలలితలీల వర్షదివసంబులయందు విచిత్రవైఖరిన్॥ 222

క॥ అభ్రమ్ముగ ప్పెనభ్రము లభ్రసరిజ్జూటకంఠహారినీలతమా
లభ్రమరాంజనభూభృద్విభ్రాజదదభ్రకాంతివిభవములగుచున్ 223

సీ॥ సురసరిఝ్ఝురచర ద్వరహారిత్కరకర
స్ఫూర్తి రాలిన సీరుబుగ్గలనఁగ
భటులగర్జామహార్భటి నుల్కి దివినుండి
తనరంగ డుల్లిన తారలనఁగ
దధిమహోదధి పయోధరమాని వెడలంగఁ
గ్రక్కిన తత్ఖండగణములనఁగఁ

ప్రావృట్సమయము మహారమ్యవంశాటవి
నందుండిపడిన ముత్యంబులనఁగఁ
జంభభిద్వనపుష్పోపచయవిరాజ
దనిమిషానిమిషేక్షణాహస్తవారి
జాతగళదుల్లసత్పారిజాతవికచ
పుష్పములనంగఁ గరకలు భూమిబడియె॥ 224

క॥ మండితవనభృన్మదవే దండలసద్గండరీణదానముక్రియ ను
ద్దండగతివృష్టిగురిసె నఖండముగాఁ బాము ప్రేలఁగట్టినలీలన్॥ 225

సీ॥ తతబహిస్స్థలకృతాంచితతపస్సామ్రాజ్య
యతికోటి యమృతాప్తి నతిశయిల్లె
వర్ణనీయాఖిలవనకదంబంబులు
పరిపూర్ణఘనపుష్పభరములయ్యె
సురుచిరసారసాకరసమూహంబులు
స్థిరకమలోల్లసచ్ఛ్రీలఁదనరె
కమనీయసానుమత్కటకభూభాగముల్
శంబరాడంబరోజ్జ్వలములయ్యె
సాంద్రసేతూన్నతతటాకసముదయంబు
భూరిజీవనజాతవిభూతిఁదనరె
ధరణి నేమనిచెప్పఁ దత్సమయమందు
సరవి శ్లేషార్థరతులు నైజంబె కాఁగ॥ 226

తే॥ కర్షకహలాగ్రభేదనోత్కటకఠోర
రత్నగర్భాంతరోద్భ్వాంతనూత్నగారు
డాశ్మసంతతులనఁగ సస్యాంకురములు
సవ్యరేఖానుగతులఁ గానంగఁబడియె॥ 227

తే॥ నారదాగమవేళ స్వాంతము లిగుర్చె
సత్కదంబంబులకు ధరాస్థలమునందు

నారదాగమవేళ స్వాంతములిగుర్చు
టలు నిజంబెకదా సత్కదంబములకు॥ 228

క॥ గురుతరపదగమ్యములై సరవిన్ నవరసగభీరశబ్దాకర్ణ
స్ఫురణల సరస్వతులుతగె స్థిరనవుడు సరస్వతీవిశేషములొదవన్॥

ఉ॥ స్ఫారములయ్యెసస్యము లసారములయ్యెబకావళుల్, వ్యథా
ధారములయ్యెహంసము లుదారములయ్యెనదుల్, సుగంధవి
స్తారములయ్యెగేదగులు, సారములయ్యెనుశాద్వలప్రబల్
తోరములయ్యెమాలతులతోటలు వార్షికవేళ భూస్థలిన్॥ 230

వ॥ మఱియువర్షాకాలంబు మందీకృతనిఖిల ప్రకాశంబయ్యు నమందీకృతశిఖిప్రకాశంబై విద్యోతమానఖద్యోతప్రకరంబయ్యు నవిద్యోతమానఖద్యోతప్రకరంబై స్ఫుటనవామోద మేదుర రాజీవంబయ్యు నస్ఫుటన వామోద మేదుర రాజీవంబై విభ్రాజమానాభ్రసౌందర్యంబయ్యు నవిభ్రాజమానాభ్రసౌందర్యంబై యర్జునకదంబవర్ధనంబయ్యు ధార్తరాష్ట్రకదంబవర్ధనంబై విజృంభితమహాశరంబయ్యు నఖండహరిముఖరవముఖరితదిఙ్ముఖంబై మహోత్పలాకరసదాప్రేక్షణీయమహోత్పలంబునుజీమూతన మాశ్లిష్టజీమూతంబును జీమూతవాహనహరిన్మరుత్పగంపరావిరాజితంబునునై యొప్పారె. నప్పుడప్పుడమిఱేనిపట్టి బహిఃప్రదేశంబుల నిశ్చించలుండై తపంబుసేయుచుండె నంత॥ 231

## —♦ శరదృతువర్ణనము ♦—

క॥ ధారాధరాగమంబున్ భూరిస్థితిగడచె, నిఖిలభువనశ్రేణి
స్ఫారానందకరములై! శారదదినములుపొసగె జారువిభూతిన్॥

సీ॥ సానుమత్తుంగాగ్రసంస్థితవరనీల
కంఠవధూ కలగానముడిగె
కాండభృద్వేష్టితాఖండరుగ్మండల
ప్రకటవిద్యుల్లతాప్రకరమణగె

భవ్యనీలప్రభాభాసమానానూన
వితతఘనాఘనోన్నతితొలంగె
కూలంకషాభంగఘోషణోద్యద్భంగ
నిరుపమవాహినీగరిమదూలె
తే॥ చిత్రనిస్తంద్రసాంద్రరుచిరప్రకీర్ణ
జంభభిత్కార్ముకాంచద్విజృంభణంబు
సమసె సంతతభాసురోత్సవములగుచు
లాలితములైన యాశరద్వేళలందు॥ 233
మ॥ అలరెన్ శారదవేళలన్ ఫలితసస్యాయాతనీడోద్భవా
వళిసంతోష్యద్యదభీక్ష్ణరమ్యతరశుంభత్సిద్ధ్యనైకప్రదో
జ్వలపష్టాపదకంకణాకలితమంచత్ప్రాంతరస్థాంచదు
త్పలగంధీజనశస్తహస్తతల విభ్రాజచ్చపేటార్భటుల్॥ 234
సీ॥ భంజితాంతరఖేదరంజితేందిందిర
శింజితాంచత్కుంజపుంజములను
లలితార్భకానిలచలితాగమాంత వి
గళితాసవోద్యానతలములందు
రాజితాబ్జాసనభ్రాజితాంసలహంస
కూజితోద్యత్సరిత్కూలములను
నింద్రాశ్మవైడూర్యచంద్రోపలప్రభా
సాంద్రామితోత్తుంగసౌధములను
సరసచతురవచోవిలాస రస హాసవ
నవ్యపరిరంభణామోదభవ్య సద్వి
హారకేళీవినోదవిస్ఫారగతుల
సతులుపతులొప్పి రా శరత్సమయమందు॥ 235
సీ॥ జయశబ్దపూర్వకోచ్చైస్స్వనంబున మేలు
కొలుపులు వైతాళికులువచింప

మనవులు తగఁ జెప్పుకొనవచ్చి మందిరాం
గణభూమి నిర్జరుల్ కాచియుండ
నీళాదికామినీనికురుంబములు పూర్ణ
కనకకుంభంబులు ఘనతఁదాల్ప
గార్యభారముపూను కర్తాయితంబుగ
సైన్యాధినాథుఁడెచ్చరికనిల్వ

నిద్రమేల్కాంచి కలశాంబునిధికుమారి
కలికిచూపులు తననేత్రకమలములకు
భవ్యశకునైకకల్యాణభరములొసఁగ
శౌరికాన్పించె నా శరత్సమయమందు॥ 236

సీ॥ ధర రత్నగర్భయౌ టిరువంద లోనుండి
వెడలిన మగరాల వెలుఁగులనఁగ
హరిమేలుకొనుశుభాహములని నిర్జరుల్
గురిపెనసురశాఖివిరులనఁగ
బహుకళాఢ్యుండైనపట్టిగన్గొని వెల్లి
విరిసినకలశాబ్ధితరఁగలనఁగ
అజుఁడు మానవులకుసృజియించినట్టి మేల్
తెలిచల్వపైగిణెవలువలనఁగఁ

గనఁ దనర్చె సురౌఘము కలహంస గర్భ
వనజభు గ్వాతభుగ్వార వా గ్వశక్షు
రు గ్విషమదృ గ్విశదరు క్సదృ గ్విశాల
కోమలస్ఫూర్తులను తెల్లుగుంపులపుడు॥ 237

క॥ పంకంబులిగిరి కన్నులు। పంకములయ్యె సుగంధబంధురవికస
త్పంకేజరజఃపాళీ। సంకీర్ణములగుచుఁ బిదపశారదవేళన్॥ 238

సీ॥ ఘనసార లామజ్జక లవంగసలిలమం
తస్నీమఁ జల్లఁగాఁ ద్రావిత్రావి
బంధురసౌరభ్యపాటీరపంకంబు
లలఁదాఁపఁ బొంగంగ నలఁదియలఁది
మాలతీసుమమిళన్మహితతల్పంబులఁ
బూర్ణవిభ్రాంతిచేఁ బొరలిపొరలి
మధుకరశుకపికమధురకోలాహల
స్వనములు చెవిసోఁక వ్రాలివ్రాలి
బాసురమనోజ్ఞనర్మగర్భప్రశస్త
వచనరచనల జీవితేశ్వరవితతికి
బరఁగ సకియలచేఁ జెప్పిపంపిపంపి
విరహిణీలోక మొప్పు నవ్వేళయందు॥ 239

వ॥ మఱియు నా శరద్వాసరంబులు సల్లలితభిల్లహల్లకపాణీసంగతసంగీతజాతచేతోమోదవిస్ఫురద్ధూర్ణపాన్మిళిత లలితమలయవలయపటీరతరునికరసుకరబంధురసుగంధధురంధరమంధరగంధవహస్తనంధయపరంపరాపరికంపమానకబంధజాతసౌగంధికబృందనిష్యందమానమధురమధురసపారణపరాయణ రంగద్భృంగీసంగీతరవానుషంగ చక్రాంగరథాంగ విహంగకులకోలాహలవిరాజమాన నాళీకాకరతీరనితంబినీనితంబబింబవిడంబమాన సాంద్రచంద్రాతపసదృశాఖండపాండుర శీతలసికతాతలంబులవలనను, సికతాతలంబుల సుస్నాతులై సిద్ధాసనంబుల నుండిమంత్రలఁయహఠరాజయోగంబు లనుష్ఠించుయోగీశ్వరులవలనను

నీశ్వరార్పణమనస్థైర్యోర్వీగీర్వాణకృతాభిరామహోమధూమామాతు తాంతరిక్షవీక్ష్యమాణాఖండ పాండుర కాండభృన్మండలా దభ్రశుభ్రేత రచ్ఛాయాచ్ఛటాచ్ఛురిత స్వచ్ఛతర పునరాయాతప్రావృడ్జీమూతవిభ్రమతాండవకేళీవిలోలశిఖండిప్రకాండంబుల వలనను గండజాతషండ వికాసలక్ష్మీవిమోచనంబులై జీవంజీవదంపతిమనఃప్రమోదకరంబులై మందారకుందారవిందారి శేఖరశతానందసుందరీసుందర ప్రభాభాసమానంబులగుచు బ్రహ్మాండకరండంబునకు వెండినీటిపోతఘాతిం దగు పండువెన్నెలవలనను దహనహిమాంశువంశ సంభూతవిశ్వంభరాకాంతాకాంతదంతావళశ్రవణకోటరబాధిర్యవిరచనానూనప్రభుస్థాన భేరీధయం కరభాంకార రవాకలిత తదీయమాతంగతురంగశతాంగవీరభటోద్వేల కోలాహలంబులవలనను శతపత్రతులసీదళపున్నాగకరవీరమాలతీచంపకమాతులుంగంబుల నకలంకమానసాంబుజులై సహస్రనామంబు లుచ్చరింపుచు లక్ష్మీనారాయణోమామహేశ్వరపూజలొనరించు పుణ్యాత్ములవలనను దుష్కృతాంధతమఃపటలనిర్భేదన దిగ్వధూటీసీమంత సిందూరరజః ప్రశస్తతేజోవిరాజమానంబులగుచుఁ గన్పట్టు కార్తీకదీపికాచయంబులవలనను గోభూహిరణ్యసాలగ్రామ కన్యాదానాదిదానంబులాచరించు వదాన్యులవలనను నత్యంతమనోహరంబులై యొప్పె నాసమయంబున 24

సీ॥ కల్పకసంతాన కమనీయతరుచయం
బుద్యానవనములై యుండునెచట
మందాకినీనామ మహితవిఖ్యాతిచే
విష్ణుపదీనది వెలసెనెచట
మొనసిజ్యోతిష్టోమముఖమహాయజ్ఞముల్
చేసినఘనులు వసింతురెచట
గంధర్వసురసిద్ధ ఖచరకిన్నరయక్ష
సంతతుల్ రూఢి వర్తించునెచట

నట్టిస్వర్గంబు నివసితాహావపటిష్ఠ
శూరకుంజరవర్గం బుదారసార
ఘోరపరవీరభటరథకుంజరాశ్వ
దుర్గమం బొప్పు భాగ్యసంసర్గమగుచు॥ 241

సీ॥ జంత్రగాత్రంబుల శైలముల్ గరగించు
నప్సరోజనముల కాలయంబు
కలశాంబునిధిఁబుట్టి కప్పులేక చెలంగు
యుచ్చైశ్శ్రవంబున కుండునెలవు
కొండలఱెక్కలు ఖండించుమేటికిఁ
బ్రాభవంబొసఁగూర్చు రాజధాని
అచ్యుతాంశోదితుండైన ధన్వంతరి
సొంపుమై తెచ్చిన సుధకురావు
మహితనీలప్రభాభాసమానచిత్ర
వరవరణసౌధయూథసుందరతరాల
యప్రశస్తము సన్మంటపప్రకాండ
గోపురము పొల్చు నమరావతీపురంబు॥ 242

ఉ॥ బాపురెయంచుఁ జూపరులు ప్రస్తుతిసేయఁగ నొప్పె లక్ష్మికిన్
గాపురమై సురేంద్రమణిగారుడరత్నహిరణ్యవిస్ఫుర
ద్గోపురమై విడూరభవకుట్టిమనిర్మలనర్మహర్మ్యమై
గోపుర మెన్నఁగావశమె గోత్రరుణీపతికైన వేడ్కఁ జేన్॥ 243

వ॥ అందు, 244

సీ॥ ఒకవంక మంజుఘోషోర్వశీహేమాది
నిఖిలాప్సరోవధూ నృత్యమెసఁగ
ఒకచాయగంధర్వనికరకిన్నరయుక్త
సంగీతవిద్యాప్రసంగమెసఁగ
ఒకమూలబలజంభవికటోగ్రపలలభు

గ్విజయాంకములు వందివితతిపొగడ
ఒకచక్కి సకలధర్మకథావిధానంబు
లవధానమున గురుం డానతీయ
గురుతరాభ్రమతంగజకుంభయుగళ
జిన్మనోహరవృత్తశచీతుషార
కరముఖీస్తన లిప్తసుగంధపంక
సరసరేఖాప్రశస్త వక్షంబు మెఱయ॥ 245

మ॥ శిఖధర్మాసురపాశివాయుధనదశ్రీకంఠగంధర్వయ
క్షఖగామర్త్యశిఖాకిరీటఘటితాంచద్వజ్రముక్తాఫలా
ద్యఖిలానూల్యమణీఘృణిప్రకరనాట్యారంభపాదోజ్వల
త్నఖుఁడై యుండె నిలింపనాయకుఁడు చింతారత్నపీఠస్థలిన్॥ 246

వ॥ ఇట్లుకూర్చుండి యాఖండలుండు తన్నృపకుమారాత్యుగ్ర
తపోభంగప్రారంభమన, ఉత్సుకుండై కొండొకతడవువిచారించి॥ 247

ఆ॥ పురుషుచిత్తమనెడి భూరిచంద్రోపల
శకలమునకు జ్యోత్స్న చాననవ్వ
తెలియఁ బంచజనుని ధృతియనువల్లికి
వాయునిహతిగాదె వనితపొందు॥ 248

వ॥ అదియెట్లంటేని, 249

మ॥ భామారత్నము నూర్వశిం గని తపోభంగంబులం జెందినా
రామిత్రావరుణుల్, మహామహిము మేనాజ్జేక్షణాం గూడి వి
శ్వామిత్రుండు సమాధినిష్ఠతొఱఁగెం, జర్చించి వేఁగిగ్గరా
షోమాజ్జావనయా తిలోత్తమకునై సుందోపసుందుల్ భువిన్॥ 250

వ॥ కావున, 251

కం॥ అమరీజాలములోనన్। జమరీవాలసమవేణి సౌందర్యోద్య
ద్భ్రమరీలోలేక్షణ వి, భ్రమరీతిందనరురమణి రంభయకాదే॥ 252

వ॥ అక్కాంతంబనిచినమదీయకార్యంబవార్యచాతుర్యధుర్యమై

తత్క్షణంబున సిద్ధింపఁజేయునని వేత్రహస్తుల "రంభం దోడ్కొనిర" మ్మని పనిచిన॥ 253

ఉ॥ వారు "మహాప్రసాద" మని వందనముల్ ఘటియించి యేగి వి
స్ఫారమహేంద్ర నీలవరచంద్ర శిలాప్రతిభాప్రభాసమా
నారుణరత్నసంఘనుయహర్మ్యతలంబున యక్షసూనుతో
వారక జూదమాడు శుకవాణిని రంభనుగాంచి వేడుకన్॥ 254

వ॥ ఇట్లనిరి॥ 255

క॥ "రంభా! హారాంచితకుచ, కుంభా! లసదూరుహసితకోమలరంభా
స్తంభా! వీక్షణజితమృగ, డింభా! మాపలుకువినుము దృఢతరభక్తిన్

ఉ॥ దేవకులాధినాయకుఁడు దిక్పతి మౌళిచిరత్నరత్నశో
భావృతపాదపంకరుహుఁ డవ్యయలీల సుధర్మయందు సం
సేవితరీతినుండి నినుఁ జిత్తమెలర్పఁగఁ బిల్వఁబంచినన్
దేవరయాజ్ఞఁబూని యతితీవ్రతవచ్చితి"మన్న వేడుకన్॥ 257

వ॥ విని వికసితవదనారవిందయై డెందంబున నమందానందంబు సందడింప నిజమనోహరుఁడగు నలకూబరునితో నిట్లనియె॥ 258

క॥ "నలకూబర! నను సురపతి
కొలువునకుం బిలువఁబంచె గురుమతిఁ బోవన్
దలఁచితి, నే నటుపోయిన
బలువిడి యేపనికి వేడ్కఁ బంచునొ వేగన్" 259

వ॥ అనిన విని యత్యంతమోహావిభ్రాంతచేతస్కుండై నలకూబరుండు రంభ కిట్లనియె॥ 260

సీ॥ "కమలాక్షి! నీచూపుగమితో డసరిఁబోర
దర్పకుబాణముల్ తలఁకుఁగాదె
విమలాస్య! నీమోము వీక్షించి చూడంగ
సంపూర్ణచంద్రుండు జంకుఁగాదె
చిలుకలకొలికి! నీపలుకులతో వాదింపఁ

జిలుక లేకాలంబు నులుకుఁగాదె
నీలాభ్రవేణి! నీ నెరులతో జగడింప
హిందోళములు భయంబాదుఁగాదె
యిట్టినినుఁబాసి మరుధాటి కెట్టులోర్తు
పర్వచంద్రుని కేనెట్లు భంగపడుదు
చిలుకపలుకుల కేరీతిఁ గలఁగకుందు
అళులచే నెట్టు కాలంబు నపనయింతు"॥ 261

కం॥ అని సంమోహ భ్రాంతిని
దనుఁబల్కెడి ప్రియుని విరహతాపం బారన్
గనుగవలనవ్వలొలఁకఁగ
వనజాననయిట్టులనియె వాక్ప్రౌఢిన్॥ 262

తే॥ "కాంత! నిను బాసియుండినయంత నిమిష
మబ్ద మబ్దముయుగమును నయ్యుగంబు
తనకుఁ గల్పాంతమయి కాన తడయ నేల
పోయివచ్చెద దయయుంచు భూరిగతిని"॥ 263

వ॥ అనిననలకూబరుండిట్లనియె॥ 264

సీ॥ "పండ్లుగొర్కుచునుండు బాలకీరములతోఁ
బద్మాక్షి! యేమంచుఁబలికెదో కాక
కన్నులెఱ్ఱఁగఁజేయు కలకంఠములతోడ
ఘనసారగంధి! యేమనియెదో కాక
వైషమ్యగతినున్న వనజాస్త్రశరముల
తోడఁ జేడియ! యేమి చెప్పెదో కాక
మ టగప్పుచువచ్చు మలయానిలంబుతో
సీమంతినీ! యేమి చెప్పెదో కాక
నన్ను నేఁచంగవలదని సన్నుతించి
మీనకేతనుశ్రీపాద మాన వెట్టి

పోయి వేవేగరమ్ము సంపూర్ణపూర్ణి
మానిశాకాంతవిభ్రాజమానవదన!" 265

వ॥ అనినఁ బ్రియునకుఁ బ్రియంబుదోఁప రంభయిట్లనియె॥ 266

క॥ "చిలుకల గూటఁ వేయుము।కలకంఠుల నడవిపాలుగాఁ జేతునహా
వలరాజుశరంబులకుఁ । వెలచేసిశమింతు,గాలివేగ మణంతుఁ ॥ 267

క॥ అటుగాననీదుమదిలోఁ
బెటిలకయుండు,, మని చెప్పి ప్రియమలరారఁ
దటుకునఁగంకణఝణఝణ
పటురావములొలయమ్రొక్కి పాణియుగము చేఁ॥ 268

ఉ॥ కవిదలిర్పవిట్టులఁ బటీరసుగంధి తగంగ మ్రొక్కినఁ
వావిద్రుచ్చియెత్తి కరుణఁ మనసారఁగఁ గౌఁగలించి సం
భావనఁ జేసివిడ్కొలుప బంధురహాసవిభాసితాస్యయై
జీవనజాయతేక్షణలు చిత్తమెలర్పఁగఁ దన్నుఁగొల్వఁగఁ॥ 269

తే॥ మందయానంబుతోడ నామందయాన
యంతిపురమున కేగి యత్యంతహర్ష
మేర్పడఁగ వేడ్కమైఁ దాను సింధువదన
లలరఁ బన్నీటఁ బొలుపొంద జలకమాడి॥ 270

ఉ॥ రంగుమెఱుంగుబంగరుచెఱంగులచీనిపుణంగుగట్టి చ
క్కంగ నునొగలందు నెఱిఁగాటుకరేకలు దీర్చి కీల్జడఁ
జెంగలువల్ ధరించి ముఖసీమ మృగీమదరేఖదీర్చి చ
న్నుంగవమధ్యభాగమున నూతనహారములఁ ఘటించి యు
ప్పొంగుచుఁ బైరిణీరవిక పొల్పుగఁదాల్చి ముదంబెలర్పఁగఁ॥ 271

క॥ మాణిక్యమండితోజ్జ్వల, వీణామర్దనముఖప్రవిమల మనోజ్ఞా
నూనసుసాధనసంచయ, పాణులగుచుఁ గొంద ఱోలిఁబఱతేరంగఁ

వ॥ అచ్చటఁగదలి, 273

* రంభ యింద్రసభకువచ్చుట. *

సీ॥ తనయాన గాంభీర్యమును గాంచి గజములు
లీలతో నిద్దుర లేకుండఁ
దనయూరుయుగముతోఁ దార్కొని యరఁటులు
పరఁగంగ నాకులపాటు నొందఁ
దనవృత్తగురుపయోధరకుంభములు గాంచి
చక్రములో జడవృత్తి సంభ్రమింపఁ
దనకన్నుఁగవ గాంచి తలఁగి సారంగముల్
భూరివనస్థలిఁ బూరిగరవఁ
దనదు మోహనమూర్తి సాంద్రగుచిరేఖఁ
గాంచి కనకంబు నిరుగాఁ గరఁగుచుండఁ
దనదు ముఖకాంతిఁ గనుఁగొని తామరసము
లులికి తమ్ములనఁగను గొలిచియుండ॥ 274

సీ॥ కమనియతపనియకరకంకణధ్వనుల్
ఝణఝణఝణఝణఝణయనంగ
మాణిక్యనిర్మితోడ్యాణఘంటాతతి
ఘణఘణఘణఘణఘణయనంగ
లలితతాటంకకిలాపకాంతిచ్ఛటల్
ధగధగద్ధగధగద్ధగయనంగ
గురుపయోధరకుంభవరణాంశుకప్రభల్
నిగనిగన్నిగనిగన్నిగయనంగ
జనియె సురపతియాస్థానసదనమునకు
లలితమన్మథసామ్రాజ్యలక్ష్మి యనఁగ
నెసఁగఁ జరియించు శృంగారరసమనంగ
రమ్యకుచకుంభ లాస్యసంరంభ రంభ॥ 275

క॥ అనిమిషనగసమకుచయుగ
ననిమిషలోలాయతాక్షి నాశ్చర్యమునన్

గనుగొనుసురకోటులకవు
డనిమిషభావంబు సౌఖ్యమాపాదించెన్॥ 276

మ॥ చని వేవేగ జొహారుచేసి తనలావణ్యప్రౌఢి నద్దేవసా
ధునకుం దేటపడంగఁజూపి విలసత్తోషాంచితస్వాంతయై
వనజాక్షీతిలకంబునిల్వఁ గని నవ్యస్మేరసంపూరితా
ననుఁడై యిట్లనె లేఖనాయకుఁ డనూనస్థైర్యవాగ్గుంభనన్॥ 277

ఉ॥ "హాసముచేయు నంచగమి యానము, చిల్కలపిండు కట్టరా
భ్యాసముచేయుఁబల్కులల బంతుల గంతులణంచు గుబ్బలు
ల్లాసము మాన్పుఁ గెంపునకు లాలితభూరిసుధాధరోష్ఠ మో
హాసరసీరుహాంఘ్రియుగ! యొప్పగ నీసరిఁబోల్ప శక్యమే॥ 278

క॥ అండజయానా!నీపా! లిండులుతలపోసచూడ లీలహసించెన్
బెండుల కడాసిబంగరు!కుండల మారేడుపండ్లఁ గొండలనెల్లన్॥279

క॥ నీచతురత నీలాస్యము!నీచక్కదనంబు సొబగు నీయావనమున్
జూచితిమే!కలలోను!నేచంద్రాననలయందు నిభరాడ్గమనా!॥ 280

సీ॥ అతివ! నీకొప్పుకప్పరసిభయంబంది
రహి నీలములు తృణగ్రాహులయ్యె
అంబుజాతాక్షి!నీయాగుటీరుతలంచి
భోగికులంబెల్లఁ బుట్టకెక్కె
కోమలి! నీచూపుకో పారసితలంకి
హరిణసంచయమెల్లఁ నడవిఁజేరె
ముదితాలలామ! నీమోముగోమీక్షించి
నీరజాతంబులునీటఁగలసె
నవలతాతన్వి! నీదుయానంబుగాంచి
మత్తగజములు నెమ్మోముల త్తమఱచె
ఏమిచెప్పుదు నీసాటియిందువదన
యహాహా! పదునాల్గులోకంబులందుఁగలదె॥ 281

వ॥ అని పలికిన నక్కలికిచిలుకలకొలికి కులుకుపలుకుల నమృతంబుచిలుక మొగంబున మొలకనవ్వు లొలుక సురవల్లభునితో నిట్లనియె॥ 282

క॥ "దేవర! ననుబహురీతుల। వేవర్ణింపంగ నేల వినుఁడీ మీ సం
భావనచే సర్వగుణ। ప్రావీణ్యముఁ జెందఁగంటి భద్రస్ఫూర్తిన్॥ 283

వ॥ నన్నుఁ బిలువఁబంచిన కారణం బేమి" యనిన నద్దేవతాసార్వభౌముం డిట్లనియె,॥ 284

సుగంధి॥ "రాజశేఖరుండనంగ రాజుపొల్చు భూమి నా
రాజశేఖరాత్మజుండు రాజితప్రకాశుఁడై
రాజశేఖరుంగుఱించి రమ్యనిష్ఠచే సుధీ
రాజశేఖరుల్ గణింప రత్నగర్భనుండెడిన్॥ 285

వ॥ అట్టుగావునఁ దదీయకార్యనిర్వాపణావార్యచాతుర్యగాంభీర్యలావణ్యతారుణ్య కళావిభ్రమ విలాసలక్షణ విచక్షణవగు నిన్నుఁ బిలువఁబంచితి, నీకుఁదక్క వేఱొక్కచక్కెరబొమ్మచేఁ దత్ప్రయోజనం బసాధ్యంబు గావున మదీయవచనంబుఁ దప్పక తపోభంగంబు సేయవలయు, నీనేర్పుమాత్రముకదా? ఆగోత్రాకాంతపుత్రుండు పారియాత్రగోత్రపరిసర వనాంతరంబున నున్నవాఁ"డని పలికి మఱియు నిట్లనియె॥ 286

క॥ "చంచలనయనా! యిప్పని। కొంచెంబనిమదినిజూడకుమి, యెట్లనినన్
చాంచల్యరహితధైర్యో। దంచితహృత్సాహసుం డతండు తలంపన్॥

——రంభను "శతకవచునితపస్సుభంగముచేయు" మని
యింద్రుఁడుంపుట.——

వ॥ అనినవిని రంభ నూత్నరత్నకంకణఝుణంఝుణక్వణనశస్తహస్తతలసంఘటితాంశుకపయోధరకుంభయై శుంభత్సంరంభంబుతో జంభవైరికిట్లనియె॥ 288

సీ॥ "ధారుణీధరములనీరుగాఁగరఁగించు

నొకపాటచాలదే యుక్తచరిత!
మించిదారువు లంకురించునట్టులఁజేయు
నొక మాటచాలదే యురుగుణాఢ్య!
వలరాజునైనను వలలఁబడంజేయు
నొక చూపుచాలదే ప్రకటధైర్య!
మునిసమూహము నెల్ల మోహింపఁగాఁజేయు
నొక నవ్వుచాలదే యుగ్రచరిత!
గీ॥ పద్మజముకుందహరులకు భ్రాంతిసేయు
నొక్క నాట్యంబుచాలదే యోగివినుత!
రాజనందనుఁడన నెంత రంభకిట్లు
తృణము మేరువుగాఁజెప్పనేల దేవ! ॥ 289
చ॥ విరసములైనపండ్లు సువివేకముగల్గనివాని యేండ్లు సం
గరమునఁగానివిండ్లు బలుకమ్మనినిద్దపుఁదావిలేసిమే
లరవిరిచెండ్లు చక్రములనందముఁజెందనిబండ్లు పూరుషుఁ
బొరివశుఁజేయలేనివిరిబోండ్లు సురేశ్వర! యేలమెన్నఁగన్ ॥ 290
క॥ మగవాని వశునిజేయని।మగువలసౌందర్యసౌకుమార్యము లేలా
పొగడంగన్నులచన్నులు। మొగముందగురూపమాటబొమ్మకు లేవే॥
వ॥ అనిన నింద్రుండిట్లనియె॥ 292
సీ॥ "అలనారదస్ఫూర్తి గలఁగదే భామ! నీ
యొప్పారుకీల్జడ హొయలుచూడ
పుండరీకస్ఫూర్తి పొలియదే కొమ్మ! నీ
తెలివాలుగన్నులు తేఱిచూడ
అత్రేయవిస్ఫూర్తి యణఁగదే చాన! నీ
సొగసైననగుముద్దు మొగముఁజూడ
పర్వతవిస్ఫూర్తి పాయదే రమణి నీ
బిగువైన వక్షోజయుగముఁజూడ

రాజనందనుఁడననెంత రాజమండ
లాస్య! త్రైలోక్యమోహనంబైననీదు
మూర్తి గనినంత నేవశవర్తియగుచు
దాసుఁడై కొల్చియుండఁడే తపముమాని 293

వ॥ అదియునుంగాక, 294

క॥ పాటలగంధీ! యమృతపుఁ। దేటలనంబరఁగునీదు తియ్యనిసొలపుం
బాటలముద్దులమాటల। నాటలనాకొమరుమనముహరియింపవెసన్॥

తే॥ ఘనత గోరంతయాలస్యమునకుఁ దలఁచి
చూడఁ గొండంతపనిచెడుసొరిదివినవె
జగతి "నాలస్యమమృతంవిషం" బనంగఁ
గాన వేవేగఁ గదలుము కమలనయన''॥ 296

వ॥ అనిపల్కి కల్పకల్పితానల్పాకల్పచిత్రాంబరామూల్యమా
ల్యాదులు బహుమానంబుచేసి పంచిన మించినవేడ్కనచ్చంచలేక్షణాక
టాక్షాంచలంబుననవ్వనివ్వటిల్లహల్లకపాణులుందానునుదక్షిణాంబకదళి:

ఉ॥ నందనపారిజాతసుమ నవ్యసుగంధధురీణుఁడై జనా
నందమిళిందబంధుర నినాదలసత్స్వరదీర్ఘికోర్మికా
బృందవినిర్గతామల కృపీటకణాతిశయావకీర్ణుఁడై
మందకురంగవాహనుఁడు మార్గపరిశ్రమమెల్లఁబాపఁగన్॥ 298

వ॥ భూలోకంబునకేతెంచి మాల్యవ దృష్యవ ద్రుక్మవ ద్ధిమ
వంతంబులుగడచి గంధమాదనహేమకూటమహేంద్రశుక్తిమంతంబులు
చూచుచుఁ దన్నికటప్రకటలవంగమాతులుంగలుంగతుంగనారంగనారి
కేళనాగపూగచంపకచందన మాకందమాలతీకుటజకుద్దాలతాలహిం
తాలతమాలకేతకీవనంబులవీక్షింపుచుఁ దన్మధ్య సల్లలితోత్ఫుల్లహల్లక
కుముదకువలయబిసప్రసూననిష్యందమానమకరందపానానంద భృంగీ
సంగీతవిద్యాప్రసంగరంగత్సరోవరంబులుఁ గనుంగొనుచు నమందానం
దంబు డెందంబునం గ్రందుకొనఁ జనిచని, 299

ఉ॥ కాంచిరి దేవకాంతలు వికస్వరభాస్వరనీరరుడ్వనీ
చంచలచంచరీకకుల ఝుంకృతినాదసముల్లసర్ఝరీ
సంచయకూటఝాటతట సంజనితోత్కటభూజరాజశా
ఖాంచలసన్నిగూఢ లసదంబుజమిత్రము పారియాత్రమున్॥ 300

వ॥ కాంచి తదుపకంఠసల్లలితపల్లవవిచిత్రచారుకోరక రాజమాన ప్రసూనశలాటుఫలగుళుచ్ఛ లతావితానవిభ్రాజితమందారకుందచందన సాలరసాలతమాలఖర్జూరనారంగనారికేళపున్నాగ చంపకవకుళకుద్దాల మాలతీమధూకసల్లకీభల్లాతకజంబూప్రముఖ నిఖిలతరుపుంజరంజితంబగు వనంబుప్రవేశించి కలకంఠపంచమస్వనంబులు కేకుల కేకారవంబులు కలరవకలరవంబులు హిందోళఝుంకారనినాదంబులు బకకోలాహలంబులు శుకరుతంబులు శారికాకూజితంబులు మరాళమధురమణితంబులు చెవుల పండువులు సేయఁ గొంతతడవు విశ్రమించి చిత్తంబున నిట్లని వితర్కించె. 301

క॥ సురపరివృఢుసంముఖమున।బరునడిపంతంబులాడి పఱతెంచితినే
నఱలేక వీని విభ్రమ।పగవశుఁగాఁ జేతుననుచు బహుభాషలచేన్॥

క॥ నాచన్నులగమకంబును।నాచక్కని మొగములీల నాసుందరమున్
నాచాతుర్యము భాగును।సూచింపఁగఁ దెలియుసిచట సురుచిరఫణితిన్

చ॥ "రమణులలోనఁ జక్కనిది రంభ"యటంచనిపల్కు దేవతా
రమణునికల్కిపల్కునకు రమ్యత వన్నియవెట్టినట్లుగా
రమణ మదీయవిభ్రమవిలాసకళామహిమంబుచే మహీ
రమణకుమారు నాదువలలంబడఁ జేయుదు నన్నిభంగులన్॥ 304

ఉ॥ రాజకుమారు నెమ్మనము రాజితవజ్రగిరీంద్రతుల్యమై
యోజఁదలిర్చు నిశ్చలతనొందిన గ్రావముచేసి యంతటన్
మ్రోజముచేసి సత్ఫలముగాఁ దగఁ జేసి సలీల సూనమై
రాజిలఁ జేసి చారుమకరందముచేసి కరంతు నీరుగన్॥ 305

వ॥ ఇట్లమ్మధురాధరీతిలకం బయ్యుత్తమతపోనిధిసన్నిధికే తెంచి మహీధరంబుచాదంబున నిశ్చించలుండై యున్నఁ గనుంగొని కనుంగొనలనవ్వునివ్వటిల్ల నల్లనల్లనఁ జేరంజను, 306

సీ॥ గవిసెనసడలించి కమనీయవిస్ఫూర్తి
నిగనిగల్లలడాలు నెఱయఁదుడిచి
తనరుదక్షిణహస్తమున దండమొనరించి
జిగిదేరుమేలిసోయగపుఁగాయ
లపరంజికుండలనపహాసించెడిగుబ్బ
కవదాకఁ దంత్రులుకలయదీటి
యొనరుమెట్టులుచక్కనొత్తి రాగవ్యాప్తి
నొనరించి తాళలయోరుగతిని
మంద్రమధ్యమతారనిస్తంద్రరూఢి
వెలయ గీతప్రబంధముల్ చెలువుమీఱఁ
జేతనంబు లచేతనస్థితివహింప
వీణవాయించె లీలాప్రవీణయగుచు॥ 307

క॥ ఆనలినాక్షీతిలకము । గానంబత్యంతసౌఖ్యకరమై ఘనమై
వీనులవిందై వెస బ్ర । హ్మానందంబగుచునలరె నతులితఫణితిన్ ॥

క॥ మృగములుచొక్కు వహించెను
నగములుమిక్కిలిద్రవించె నానాగతులన్
ఖగములువిభ్రమమొందెన్
జగములహో!భూరిచిత్రసంస్థితిఁదనరెన్॥ 309

తే॥ పొంకముగ సారదారువు లంకురించె
చిత్రవై ఖరిఁ జిత్రముల్ జీవకళలు
దాల్చె నేమన వచ్చు నత్తలిరుబోణి
యతులగాంధర్వగీతవిద్యానిరూఢి ॥ 31

వ॥ ఇత్తెఱంగున నామెయుంగుబోణి తనసంగీతప్రసంగంబుకొంత తడవుసేఁజేసి మనంబునంగరంగక చట్టుంబోలి యెప్పటియట్టు నిట్టట్టు కదలకయున్న యప్పుడమిఱేనిపట్టి దిట్టతనంబును మనంబునంబొగడి మగుడి విలాసవచనరచనాచమత్కారలాస్యకేళీనైపుణ్యంబు లేర్పఱించి వేసరి చిత్తం బుత్తలపడ నత్తలోదరి తనపొత్తుకత్తియలతో నిట్లనియె,

* రంభ శతకవచునితపస్సు భంగపఱుపలేకపోవుట *

క॥ "అండజయానా! యీముని।మండను నెమ్మనములీలమది నేచంగాఁ
జండతరస్థాణువో బలు।కొండయొకా కిట్టులుంట కుంభినిగలదే॥312

ఆ॥ కలికి!యడవిలోనఁగాసినవెన్నెల। పగిదియయ్యె నాదుపాటయెల్ల
సకియ!చెవిటివద్దశంఖంబుఁబట్టిన। మాడ్కి-యయ్యె నాదుమాటలెల్ల॥

సీ॥ జోరీఁగ మందారసుమగళన్మకరంద
మాధుర్యమెఱుఁగునే మధురవాణి!
పరిపక్వసహకారఫలరసమాధురి
శలభ మెఱుంగునే జలదవేణి!
రమణీయసంగీతరసపరిపాకంబు
రాసభమెఱుఁగునే రాజవదన!
పసిబాలుఁ డేర్పడఁ బర్వచంద్రుని కళా
సౌందర్యమెఱుఁగునే కుందరదన!
యిట్టిమూర్ఖుండు నన్నెట్టులెఱుఁగ నేర్చు
నెన్నిపల్కి-నఁగాని యోసన్నుతాంగి!
తపునెయిఁటువంటియెడలకుదివిజనాథుఁ
డనుప మముబోటివారల నలరుబోణి! 314

• రంభ యింద్రుని దూఱుట •

సీ॥ జడదారిమవ్వంపుజవ్వనితోఁగూడి
శాపమొందిన దురాచారిగాఁడ
చేతులతీఁటవోఁ జిడిముడిపాటుతోఁ

గొండలనఱకిన కుమతిగాఁడె
పొలసుతిండులనెల్లఁ బోరిలోదయలేక
బలునిద్రవుచ్చిన చిలిపిగాఁడె
తనుజముదాల్చికై తపసికన్నియవేడి
ఘనతంత్రబాణముగొన్న కష్టిగాఁడె
పరఁగ గాధేయు నుగ్రతపంబు చెఱుపఁ
బంచి నను రాయిఁజేసిన భ్రష్టుగాఁడె
యిట్టిదుర్మార్గుఁడనుచు మున్నెఱిఁగి పనుప
నేలవచ్చితి నయ్యయో లోలనయన!" 315

వ॥ అనిపలికి 316

క॥ "ఆడుటొ రాలుగరంగఁగఁ। బాడుటొ చౌశీతిబంధఫణితిఁ రతులన్
గూడుటొ యీతనితపమును। వేడుకఁజెఱుచుటలుమనకువింతే చెలియా!

వ॥ కావున నెప్పటినెలవునకుంబోద"మనిపలికి యక్కలికి చెలువలుగొలువ మఱలిచనియెనంత 318

——శివుఁడు శతకవచునికిఁ బ్రత్యక్షమగుట——

సీ॥ కడలిఁబండినవాఁడు, గాలితిండులఱేఁడు
నమ్మగా సొమ్ముగా నలరువాఁడు
వేలుపువిడిమట్టు వెల్లనిబల్లటు
విల్లుగా నిల్లుగా వెలయువాఁడు
చలిమలదొరపట్టి సత్తిపట్టినజెట్టి
యాలుగాఁ జూలుగా నమరువాఁడు
జముతంత్రిజముకోడె చక్కనితెలికోడె
పూవుగా మావుగాఁ బొసఁగువాఁడు
మేలుగలవాఁడు శేశేలనేలువాఁడు
మించువాఁడల్ల వీనులఁద్రుంచువాఁడు

మీఁటువాఁ డెల్లతపసులుగోరువాఁడు
దండివాఁడు విసంపుమేత్తిండివాఁడు॥ 319

క॥ గోపతిగోపతిగోభా। మాపతిగీష్పతిమునీంద్రమానసవినుత
శ్రీపాదాంబుజయుగళుఁడు। మాపతిప్రత్యక్షమయ్యె మానికిఁ బ్రీతిఁ॥

వ॥ ఇట్లు వేసికంటివేలుపు కట్టెదురంబొడకట్టిన రాచపట్టి పట్టం జాలని తోషంబున నవ్వృషధ్వజు మకరధ్వజసంహారు పాదపద్మంబులకు సాష్టాంగదండప్రణామంబులాచరించి లేచి ముకుళితకరకమలుండై యిట్లని స్తుతియించె. 321

సీ॥ భూషణీకృతసర్వభూభరణభుజంగ
జంగమస్థావరాంచత్స్వపూర్ణ!
పూర్ణిమాచంద్రికోదీర్ణనిర్మలకాయ!
కాయజాఖర్వ దుర్గర్వహరణ!
రణకళావిభవ నిర్దళితగజాసుర!
సురలోకవిస్తుతసుభగదక్ష!
దక్షకన్యాపయోధరమనస్సంచార!
చారణగేయ భాస్వత్ప్రతాప!
భావనిశ్చయముక్త విపక్షపక్ష!
పక్షిరాడ్ధ్వజ దివ్యప్రభావబాణ!
బాణగీర్వాణరిపుముఖభక్తవరద!
వరదయాకర! శివ! శర్వ! శరణుశరణు॥ 322

సీ॥ తీరైనకడియంబు తెల్లనిపాముగా
మీటినసామి! జోహారునీకు
అల్లిబిల్లగురాణి తెల్లనియేటుగా
మీటినసామి! జోహారునీకు
మొల్లమెుదనరావు తెల్లనిగట్టుగా
మీటినసామి! జోహారునీకు

తేజైనతలపువ్వు తెల్లనిగాముగా
మీఱినసామి! జోహారునీకు
తెల్ల తేజీవజీ రల్ల తెల్లతపసి
తెల్ల యేనుఁగు రాహుత్తు తెల్లదీవి
యుల్లుగలవేల్పు పొగడఁగ నుల్లసిల్లి
మీఱు తెల్లనిసామి! జోహారునీకు॥ 323

క॥ నల్లనివన్నియదుప్పటి। నల్లనిదొరవిడిదిదొనయు నల్లనియాలుఁ
నల్లనికుత్తుకగలిగిన। చల్లనిమాతంగి! నీకుశరణుమహేశా! 324

వ॥ దేవా! నీవు జగదుద్భవస్థితిలయకారణుండవై రాజససాత్త్విక తామసగుణంబులగుఱియించి చతురానందగోవిందరుద్రరూపంబుల వర్తింతువు, సర్వభూతాంతర్యామివి, సర్వేశ్వరుండవు, పురాణపురుషుండవు, కాలమూర్తివి, ఆదిమధ్యాంతరహితుండవు, అవ్యయుండవు, అక్షరుండవు, అగోచరుండవు, ఇట్లు నీకునమస్కరించెద” ననిపల్కి మఱియు॥ 325

సీ॥ “శ్రీకరద్యోధునీసిద్ధగజనారాతతుల్
రమణీయచిత్రపత్రములుగాఁగ
రంగదుత్తుంగవిరాజితస్వర్ణదీ
భంగికాణములు పుష్పములుగాఁగ
ఘనతరామృతమయూఖ ప్రాంచదుత్పల
బాంధవఖండంబు ఫలముగాఁగఁ
బ్రాలేయభూమిభృద్భవలసద్దేహంబు
వెలితపల్లీమతల్లిగాఁగఁ
గలిగిమదభీష్టఫలములుగలుగఁజేయు
కల్పకంబీవయగుచు సాక్షాత్స్వరూప
మునను జనుదెంచినట్టులఁ గనఁగనయ్యె
శర్తగోపతిగోపతి! శరధిశరధి!” 326

వ॥ అనిపలికిన నంతకాంతకు డత్యంతసంతోషస్వాంతుండై తన యమందవచోమకరంద బిందుబృందంబుల నారాజసంక్రందననందను డెందంబునకు నత్యానందంబుఁబొందుపఱచుచు నిట్లనియె, 327

క॥ "తపమునకుమెచ్చితిం గృప। నృపసుత! నీకెద్దియైననిచ్చెదఁ గానఁ
నెపమిడకనీదుకోరిక । చెపు"మననిట్లనియెఁ జంద్రశేఖరుఁతోఁడన్॥

వ॥ "దేవా! నిఖిలాభియాతిదుర్లంఘ్యవిరాజత్తేజోవిశేషంబును నఖర్వదుర్వారశౌర్యైశ్వర్యంబునుసురాసురాభేద్యమానానూనాస్త్ర శస్త్రవిద్యానవద్యనైపుణ్యంబును గామగమనంబుగా శతాంగంబునుని" మ్మనిపలికి మఱియును, 329

తే॥ "సరవిమాతండ్రి చంద్రశేఖరుఁడు పేరు
గలుఁగజేసెను వెస శతకవచుఁడనుచు
రూఢి నయ్యర్థమున కనురూపముగను
గవచములునూఱొనర్పు నాగాత్రమందు॥ 330

వ॥ అవియును విపక్షదుర్నిరీక్ష్యంబులును నత్యంతగుంభితంబులునుబరశస్త్రాభేద్యంబులునై యుండునట్టుగాఁ గరుణసేయు"మనిప్రార్థించిన నవ్వరంబిచ్చి చిచ్చరకంటిసామి తననెలవునకుంజనియె నంత, 331

తే॥ శతకవచుఁడటఁబాసి విశ్రుతసమస్త
నిస్తులైశ్వర్యయుక్తుఁడై నిజపురంబు
కేగి యత్యంతవిభవమహేంద్రుఁడగుచు
నుండి దిగ్రాజనికరంబు గండణంచె॥ 332

వ॥ ఇట్లు దిగ్విజయంబుచేసి, 333

సీ॥ మందరసుందరకందరభూములఁ
గైలాసపర్వతకటకములను
మంజులహేమాద్రిమణిశిఖరంబులఁ
బృథులనందనచైత్రరథములందు

మలయాగనిలయోరుమలయజచ్ఛాయల
రాజితోద్యానాంతరంబులందుఁ
కాంచననవరత్న కలితహర్మ్యములందు
సలలితకృతకాద్రితలములందు
సారసోత్పలకల్హారషండహారి
భూరిశృంగార కాసారతీరములను
గామగమనశతాంగంబు గడఁక నెక్కి
ప్రేయసియుఁదాను విహరించుఁ బ్రియమెలర్ప॥ 334
వ॥ ఇట్లు యథేచ్ఛావిహారంబుల దినంబులుపుచ్చుచుండెనంత.

—మణికంధరునికథ—

క॥ మణికంధరుఁడనుయక్షుఁడు | ఫణిరాడ్వైరివేయునకునుబరమప్రియుఁడౌ
ధనదునిమిత్రుఁడు వైభవ | ఘనుఁడై మణినగరమందుఁగాపురముండున్॥
తే॥ అతనిపుత్రిక మహితాపరావతార
మోహినీదేవి త్రైలోక్యమోహనాంగి
తతనిరీక్షణమాలికాజితకురంగి
శ్రీహరికుమారు వజ్రాంగిమోహనాంగి॥ 337
ఉ॥ చక్కనిమేల్మికుందనపసల్ సరిపాలుగఁదూచి నిద్దపుం
జుక్కలతేనిచాయలొగి సొంపుగనందులమేళవించి పెం
పెక్కెడుక్రొమ్మెఱుంగులు పయిందిగఁబాఱఁగఁగమ్మిచేసెఁబో
యక్కనకాంగి నబ్జభవహాటకకారుఁ డపూర్వవైఖరిన్॥ 338
తే॥ ఆత్మవిద్వేష విషమాంబకాఖ్యఁదనరెఁ
దలఁపఁదన్నామధేయంబు తననుజెందె
ననుచు నాఱవశరముగ మనసిజుండు
చేసికొనెఁబోలు నక్కన్యఁ జిత్రఫణితి॥ 339
సీ॥ ఇరులతో నీలంపుసరులతోఁ దుమ్మెద
గరులతో వెనఁబోరుఁ గురులతీరు

చెండ్లతో మా రేడుపండ్లతో బంగారు
గిండ్లతోఁ దిప్పరుఁ బాలిండ్లసౌరు
చిలుకలతోఁ గవ్వరంపుఁబలుకుతో విరితేనె
కొలఁకుతో జగడించు బలుకుసంచు
పూలతో నలువగుత్తాలతోఁ గళ్కువ
జాలతో నిక్కు హాసంబు టెక్కు
ప్రాపు మరుతూపునకుఁ దళ్కుచూపు చూపు
మీఱుఁ జీమలబారుఁ జెన్నారు నారు
ఠీవి యమృతంపుబావి చెంగావి మోవి
ముదితరూపంబు త్రైలోక్యమోహనంబు॥ 340

సర్వలఘుగీతము॥ అవుర!పలుకఁగనలవియె హరిణనయన
బెడఁగునునుజిగిబిగితొడ లొడలు నడలు
మనమునకుఁ దెలియవశమె వనజవదన
ఘనవదనరదనపదనఖములసొబగు"॥ 341

వ॥ అనినవిని "తదనంతరకథావిధానం బెఱిఁగింపు"మనుటయు,॥

క॥ సామీరిస్తుత!సద్గుణ భూమీ! భూమిముఖపంచభూతసదాంత
ర్యామీ! చామీకరభృచ్ఛ్రీమహిళాకామి! శేషశిఖరస్వామీ!343

సుగంధి॥ జారచోరవీరవార! సారచారువర్ణనో
దార! తారహార! హీరతారకోరుకీర్తివి
స్తార! ఘోరభూరివైరి! వారుణాతిదారుణా!
స్ఫారశూర!ధీరచిత్తసారసప్రచారణా॥ 344

గద్య॥ ఇది...అన్నమరాజాన్వయపయఃపారావార సంపూర్ణపూర్ణిమా
సుధాకర సకలగుణరత్నాకర విద్వజ్జనవిధేయ రమణ
యనామధేయ ప్రణీతంబైన శంతనురాజ
చరిత్రంబను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

# శంతనురాజచరిత్ర.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీమత్కౌస్తుభరత్నో
ద్దామ! ధగద్ధగితభాస్వితశ్రీవత్సాం
కామలరుచిసమ్మిళిత! కో
మలదరహాస! శేషకుధరనివాసా! ॥ 1

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డనుకం
పాన్వితచిత్తుండై యిట్లనియె. 2

ౘ మణికంధరునికొమార్తె వనవిహారమువచ్చుట ౘ

ఉ॥ అచ్చపలేక్షణాతిలక మంత వసంతము వింతమీఱ రా
నచ్చరతీఁగెబోండ్లఁ బరిహాస మొనర్చు విలాసినీమణుల్
చెచ్చెర నిచ్చ ముచ్చటలు చెప్పుచుఁ దోఁజను దేరఁ బచ్చరా
గుచ్చుల హెచ్చుడాలు వగగుల్కెడి పల్లకియెక్కి వేడ్కచేఁ॥ 3

వ॥ శృంగారోద్యాన కేళీవిహార సంరూఢభావయై చనిచని
ముందర. 4

క॥ వనజాక్షీతిలకంబటఁ
గనుగొనె మాకందకుంద ఖర్జూరలస
త్పనసాశోకశమీవట
ఘనతరతరునికరచిత్రతరమగుదానిఁ॥ 5

వ॥ ఒక్క యుద్దామాభిరామంబగు నారామంబు ప్రవేశించి
కించిన్మధ్య యచ్చట యానంబుడిగ్గి యొక్కచెలియ కైదండగొని
యచ్చటచ్చట వర్తింపుచు. 6

* వసంతఋతువర్ణన *

క॥ "శుకవాణి! చూడుమివ్వని
శుకగేయస్ఫూర్తిఁ జక్రసుందరనియతిం

ప్రకటతరహంసనివహో
త్సుకవైఖరి నీలవర్ణసాటుగుణ కలదే॥ 7
వ॥ అదియునుంగాక. 8

సీ॥ తావిగుప్పుచునొప్పు మావిగుత్తులచొప్పు
వలిగబ్బిగుబ్బల చెలువుగాఁగఁ
గల్కిచిల్కల సొరుగుల్కుపల్కులతీరు
పొలుపుచూపెడి ముద్దుపలుకుగాఁగ
మదికినింపులునింపు కొదమయంచలగుంపు
డంబైన మందయానంబుగాఁగ
నెలమినీలపుడాలుగలుగు తుమ్మెదజాలు
కప్పుగుప్పెడు గొప్ప కొప్పుగాఁగ
సొగసునులిపచ్చిపగడంపుఁ బొగరుచిగురు
ఠవివిలసిల్లు చెంగావిమోవిగాఁగఁ
గలిగియివ్వని యవ్వనకన్యవోలెఁ
గాననయ్యెను గనుగొంటె కమలవదన!॥ 9

క॥ సురసాలముగాంచితె చెలి!
సురసాలముగతి నభీష్టశుభఫలదము భా
సురసాలము గనుగొంటివె
సురసాలముకొమ్మలంటి శోభిలెఁగొమ్మల్॥ 10

సీ॥ మన్మథనామసమారాధినో సుమ
నోబాణసంభృతి నుతులుగాంచెఁ
బురుషాభిధానతఁ బొలుపుమీఱుటనేమొ
శ్యామానుగతమున సంచరించె
నర్జుననామధేయప్రశస్తినో కౌశి
కగురువిస్ఫూర్తిచే ఘనతగాంచెఁ

గాంచననగసమాఖ్యునిమీఁదటను బహుళ
పాదసంగతిఁగల్గి పరిఢవిల్లె
సురతరోద్యచ్ఛివాహ్వాయాభ్యుదయమునను
నాగధరభూరివైభవప్రాన్నతులుగాంచె
ననుచుఁ గరమునఁ గరము గీల్కొనఁగఁ జేసి
చెలియ కేలిఁగించెఁ జిలుకలకొలికియపుడు॥ 11

వ॥ ఇత్తెఱంగున నమ్మోహనాంగి కురంగమదగంధబంధురప్రవాహార్ద్రాష్ణవంబు వెల్లిగొన నయ్యారామాభిరామమహీరుహావిశేషంబులు ముద్దుచెలియ కెఱింగింపుచుఁ బంకజాక్షులిరువంకలఁ గొంకులేక సేవింప నచ్చటచ్చటవర్తింపుచు వనలక్ష్మి తమరాకల కలరి యడుగులకు మడుగులుపఱచినకైవడిఁ బుడమి నెడలేక నిండిన గొప్ప కప్పురంపుఁదిప్పలపై నుప్పరవీథిగప్పుకొని యొప్పులుగలతావులు గుప్పుచు విప్పుగల పూవుచప్పరంబుల యిమ్ములఁ గొమ్మల తోరమ్ములగుకుచమ్ములఁ బొందుపఱచుచుఁ దఱచు ఫలమ్ముల విఱ్ఱవీఁగు కొమ్మలుగల నిమ్మలు గనుంగొని సంతసిల్లుచుఁ గొదమతుమ్మెదకదుపులరొదలఁ బొదలు పొదలమొదల వదలక యల్లిబిల్లిగ నల్లికొన్న మొల్లంపు టల్లికల కుల్లసిల్లుచుఁ బాలకడలిపట్టి తోఁబుట్టుచుట్టాల గట్టిగఁగట్టిన మెట్టుల నిట్టట్టు గొట్టుపడక నెట్టన గట్టుననుండి బోరునం బాఱు పూవుఁదేనియవాకలు చొచ్చి విచ్చలవిడి విడివడిన పచ్చవిల్తుని మదపుటేనుంగుగుంపుల పెంపున నీదులాడు బోదరాయంచలంగాంచి వంచించి పట్టందలంచుచు విహరించుచున్న సమయంబున, 12

శతకవచుఁడు వనమునకువచ్చుట.

క॥ రతిపతిసంహారదత్తో, న్నతచారుశతాంగమెక్కి నానాతిశలక్ష
జతురతంత్రోవతిఁజాంపుచు, శతకవచుండేగుదెంచెఁ జయ్యననటకున్॥

తే॥ ఏగుదెంచితదారాపు మెల్లచోట్లు
గాంచి ఘనరోహిణీకాంతకాంతరత్న
సంకలితభూరివేది విటంకములను
నిలిచినిలిచివిహారంబు సలిపిసలిపి॥ 14

వ॥ అంత నొక్కయెడఁ దారకామధ్యగతయైన చంద్రరేకవిధం
బున సఖీనికరాంతస్థితయైన యమ్మోహనాంగి మనోహరాంగినిం గనుం
గొని వినిశితశంబరాంతకనిర్ఘాతసంఘాతోపమానవిభ్రాజమానప్రసూన
శిలీముఖబాధ్యమానమానసుండై నితాంతచింతాకూపారాంతర్నిమ
గ్నాంతరంగుండగుచుఁ దనలోనిట్లనియె॥ 15

క॥ "ఈలోలేక్షణ మరునిల్లాలో లేకెన్నిచూడ నచ్చరలేప్రో
యాలోకా దీనికిపరి భూలోకమునందుఁబోల్పఁ బోలఁతులుగలరే॥

సీ॥ చక్రపరీహాససౌందర్యమునమీఱెఁ
గలికికుచంబులు కటితటంబు
కమలవిదూరచంక్రమమున నొప్పారెఁ
గనకాంగి నెమ్మోము కన్నుగవయు
కాంచనవ్రీడాకృదంచితస్థితిమీఱె
నలినాస్యమైజిగి నాశికంబు
పున్నాగసాధ్వసస్ఫూర్తితోఁగనుపట్టె
నంగనయానంబు నారుతీరు

భాసురతరప్రవాళవిభ్రాజమాన
గతినలరెఁ గొమ్మకరములు కావిమోవి
యౌర! యీతన్విఁగనుగొన్న నతనుఁడైన
మోహవారాశిలోపల మునుఁగకున్నె॥ 17

సీ॥ తమ్ములమీఁదటఁదనరారుచున్నట్టి
కమలగర్భంబులఁ గమలగర్భ

ములమీఁద సనఁటుల లలి ననంటులమీఁద
మేదిని మేదినిమీఁదఁ బొన్న
విరి పొన్నవిరిమీఁదఁ దరఁగలుతరఁగల
మీఁదను జాళువామేనిగిండ్లు
వానిపై వలమురి వలమురిమీఁదను
విండ్లు నావిండ్లపై విధుని విధుని

పై మొగులు తగులొ్కనఁజేసి పద్మభవుఁడు
పొసఁగఁ గ్రొమ్మించుమించుగఁబొదలి తనదు
శిల్పవైఖరి దెలియంగఁ జేసినట్టి
ప్రతిమగాఁబోలు సిద్ధమీ పద్మనయన॥ 18

సీ॥ అబ్జాక్షికటిచక్ర మాక్రమింపఁగఁగల్గ
నవనిమండల మేలినట్లుగాదె
కుసుమకోమలి కుల్కుగుబ్బలు చేపొఁక
నల్ల మేరువునందినట్లుకాదె
అంగనమోవి నొక్కంగఁగల్గినను ది
వ్యాహారమబ్బినయట్లుగాదె
పూఁబోఁణినెమ్మను పొదలిపట్టగఁగల్గఁ
నమితకాంచన మబ్బినట్లగాదె

కాన యీముద్దుగుమ్మ యీకలికిచిలుక
యీజగన్మోహనాకార యీకుమారి
యీమనోహరసౌందర్య యీలతాంగి
నన్నుఁగృపఁజూడ భాగ్యంబునాదికాదె”॥ 19

వ॥ అని యక్కుసుమకోమలి సౌందర్య సౌకుమార్య చాతు
ర్య విశేషంబు లశేషంబుగా వేఱువేఱవర్ణింపుచుఁ దత్సమీపమ్మున
కేతెంచునవసరంబున॥ 20

కం॥ కనుగొనియె మోహనాంగుని
వనజేక్షణభూరిరూపవైభవజితత
ద్వనజాంబకు వనజాంబక
హననకృపాలబ్ధతేజు సల శతకవచుఁ॥ 21

వ॥ అయ్యెడ 22

క॥ అయ్యారె! చెలువనత్తతిఁ।దియ్యనివిలుఁబూని విరులతెగలశరాళిన్
గయ్యాళిపచ్చ తేజీ।యొయ్యారివజీరు తగ మహోద్ధతి నేసెన్॥ 23

తే॥ కంటికిదిసింపనట్టివాఁడంట కందుఁ
డమ్ములనె కొమ్మనెమ్మది హాళిఁ జూచి
యమరఁజెందించె,ధర మెత్తనైనచోట
వరుసఁగలపోయ గుద్దలివాఁడిగాదె॥ 24

వ॥ అంతనచ్చోటఁ దనకోటి మేటిబోటికి వసుంధరాభృచ్ఛత
కోటిధరుంజూపి యిట్లనియె. 25

ఉ॥ "గెంటనిచాయకుందనము గేలియొనర్చెడిమేను నోటలే
యింటిలోనొక్కటీడుగలదేయని తమ్ములనవ్వునెమ్మొగం
బంటినకందుహస్తములు నమ్మకచెల్ల! మహోన్నమైన వా
ల్గంటులు పీసెఁజూచినను గంటికి నిద్దురవచ్చునే చెలీ!॥ 26

క॥ కాంతా!యలవియె యీభూ,కాంతుసతోనిష్టగోష్ఠి గడపుచుఁదా నే
కాంతమున నుండఁగలిగిన।కాంతామణిజన్యఫలము గణుతింపంగన్॥

తే॥ కండచక్కెర పూఁదేనె కలయఁగలపి
యజుఁడుచేసిన పీనధారామృతంబు
గుటుకుగుటుకున గుటక్కునఁ గ్రోలఁగలుగు
దానదేమిమి భాగ్యంబు తరళనయన!॥ 28

తోటకము॥ కంతుజయంతులఁ గాంతుము,తారా
కాంతు వసంతుని గందుము ని భూ

కాంతునితోఁ సరిగానను పోల్పఁగ
వింతగు నెంతయు నీరదవేణి! 29

క॥ తొలిజన్మంబుల నేతపములు చేసెనో నిష్ఠ మణులు ముఖ్యాకల్ప
స్థలసంఘటితములగుచుఁ । జెలియా! యీనృపుని దేహసీమఁ నిలువఁ ॥

క॥ కొమ్మా! యీకన్నుల యా। నమ్మా యీనృపునిఁ జూచినది యాదిగ నా
నెమ్మనమునఁ బరితాపము। నిమ్మ కెరువు వేసినటుల నెఱసెఁగదమ్మా!

క॥ మకరాంకుబాణపంచక। మకటా! నిర్ఘాతజాత మటుగాకున్నఁ
సెకచల్లుచు మద్ధైర్యము। సకియ! వకావకలు చేయఁజాలునె తలఁపఁ ॥

ఆ॥ మోహనాంగి! పాసఁగ ముల్లునాటినచోఁట
గొఱ్ఱుగొట్టినట్లు కుమతియగుచు
నన్ను నేచఁజొచ్చెఁ బన్నుగా వలిగాలి
తొలుత వీనిచర్య ధూళిగాను॥ 33

క॥ జాలిం బెట్టఁగఁ జొచ్చె। నుజాలగ నీశుకపికాళిజలజాస్త్రబలో
ద్వేలాట్టహాససన్నిభ। కోలాహలనాదమిపుడు కోకిలవాణి॥ 34

క॥ అరియరియై శిఖిశిఖియై। హరిహరియై యాశుగము మహాశుగమై శం
బరభంజనుండు తగ శంబరభంజనుఁడై యొసంగె బరిభవము చెలీ!॥

వ॥ అనిపలికి మఱియు నిట్లనియె. 36

తే॥ "అమ్మ నే చెల్ల! భూరి మోహప్రతాప
మంతకంతకు నగ్గలంబై చెలంగె
ఏమి చేయుదు నింకనో యిగురుబోణి!
ఎట్లుగానున్నదో కదా యీశ్వరాజ్ఞ॥ 37

వ॥ ఇందిందిరబృందసుందరాలకా! యీసుందరీకందర్పపూర్ణిమాసుధాధామబింబంబునకు క్షీరపారావారంబునుంబోలిన యన్వాయంబును, జందనగంధీ! హరిచందనంబునకు సంక్రందననందనంబునుంబో

లిన యీతనిజనకునామంబును, సుందరవదనా! కుందంబునకు సౌరభంబు
నుంబోలిన వీని విమలాభిధానంబును, వేఱువేఱ నెఱుంగవలయు" నని ప
లుకుచున్న సమయంబున నన్నరవరకుమారమాకుమారుం డక్కుమారి
సమీపంబునకే తెంచి మృదుమధురవచనరచనాచాతుర్యధుర్యుండగు
చుఁ గంతుని మదదంతివింతం దనరు నయ్యింతికిట్లనియె, 38

సుగంధి ॥చంద్రసన్నిభాస్య! యేను జంద్రవంశజాతుఁడన్
జంద్రశేఖరావనీశచంద్రు కూర్మిసూనుఁడన్
జంద్రశేఖరోల్లసత్ప్రసాదలబ్ధతేజుఁడన్
జంద్రికాబ్జహారహీరచారు కీర్తిఁ గుంతుఁడన్॥ 39

తే॥ శతకవచుఁడంద్రు నాపేరు జగతియందుఁ
జల్లకనివచ్చి ముంత దాచంగనేల
యేనువచ్చినకార్యంబు నెఱిఁగికొనుము
నిజముచెప్పెద నుత్ఫుల్లనీరజాక్షి॥ 40

శా॥ నీలావణ్యము నీకళావిభవముల్ నీవిభ్రమాకారముల్
నీలాలిత్యమనోజ్ఞయౌవనము హా! నేఁగన్నమాత్రాననే
బాలా! పుష్పధనుర్విముక్తవిలసద్బాణావళిన్ మద్ధృదు
ద్వేలాప్రాభవమెల్లమార్చెమరుఁ డుద్రేకప్రతాపోగ్రుఁడై॥ 41

కం॥ వనజానన! నీచూడ్కులు ననుసోకినయంత మదనునారాచంబుల్
తనువుననంటెనుగొమ్మల! కనుసన్నలమెలఁగుఁగాదె కామునిశరముల్।

తే॥ ఎంతఘాతకుఁడకట! లతాంతకుంతుఁ
డతనిశరములు సూనంబులనుట దగదు
కనుగొనఁగ ధాతచేసిన కమ్మపూల
పేరిటనెసంగు బలువైన పిడుగులగును॥ 42

మన్మథదూషణ

తే॥ మామగారిని గురుకాంతమరుగ జేసి
యగ్రజుని గూతునంటుడునట్లు చేసి
కోర్కె బెదతండ్రి మునిపత్నిగూడ జేసె
నిట్టికంతుడు నన్నేల యేచకుండు"॥ 44

వ॥ అని పలికి॥ 45

ఉ॥ "కన్నియ! నిన్ను జూడ నరకాంతవిధంబు కనంగ రాద హా
కిన్నరకంబుకంధరవొ, కింపురుషాంబుజపత్రనేత్రవో
పన్నగభామవో, దివిజపల్లవపాణివొ, యక్షకన్యవో
యున్నదియున్నయట్టులెగ నొప్పుగ నాకెఱుగంగ జెప్పుమా॥ 46

క॥ తలిదండ్రులెవ్వ రెచ్చట నెల విచటికి నేల రాక నీవిధమెల్లన్
బాలుపుగ దెల్పుము మధుకరకులమేచక వేణి! పూసగూర్చినగీతిన్॥

• శతక్రతుండు మణికంధరుకొమార్తెను వర్ణించుట •

సీ॥ తరలాక్షి! నీమోము తామరసంబని
గెంటక ద్విజరాజు నంటరాదె
కనకాంగి! నీయూరు కస్తూరిచాలని
పన్నుగాం బెనుపాముం బట్టరాదె
బాల! నీహస్తముల్ పల్లవంబులటంచు
దమ్ములమీదుగా దాటరాదె
తరుణిరో! నీకౌను తారాపథమటంచు
బరగ హరిని జూచి పల్కరాదె
సరసిజాసన! నికటిచక్రమనుచుం
గోర్కె భూదేవి నరు చేతం గొట్టరాదె
సిద్ధముగ నెన్ని బాసలు చేయవచ్చు
సమదగజయాన! రతిరాజుచరణమాన॥ 48

సీ॥ నీడలుచూడనా నిజముగాఁ జెక్కులు
　　　　అద్దంబులౌఁగదా ముద్దుగుమ్మ!
మీటఁ గంగునమ్రోయు మేలిమిగుబ్బలు
　　　　తాళంబులౌఁగదా తలిరుబోణి!
కళలు తేరుచునుండు కలికిముద్దుమొగంబు
　　　　చందమామాఁగదా సుందరదన!
తీయనై యొప్పారు తేటైనకెమ్మోవి
　　　　పులఖండమౌఁగదా పువ్వుబోణి!
యిచ్చకముతోడ నంతయుమెచ్చులౌలుకఁ
బలుకుటలుగాదునిజమహో భాసురాంగి!
యిట్టినినుగన్న మరుధాటి కెట్టుతాళ
వచ్చుఁ బురుషుల కయ్యయో వనజగంధి!॥ 49

ఉ॥ భామిని! నీదుకన్బొమలు భావజుసింగిణిమిండ్లు నేత్రముల్
కామునిచిల్కుములుకులు మొగంబు రతీశ్వరుమామ పల్కులా
హా మకరాంకుఘోటకముల ట్లగుటం బురుషుల్ నిజంబుగా
వేమఱునిన్నుఁజూచి మరువేదనజొక్కరె నీకుదక్కరే" ॥ 50

వ॥ అనిపలికిన విని యాన్మృగమదామోదప్రమోదమోహాతిశయంబులుగనఁబడ శరద్రాకానిశాకరబింబప్రతిబింబనైసర్గిక శోభావిభాసమానంబగు ముఖంబువంచి మఱుమాటపలుకక యూరకున్నఁ గ్రమ్మఱనమ్మహీపతి యిట్లనియె॥ 51

చ॥ చిలుకలనేతితేనియలు చిల్కెడిపల్కులుపల్క వేల వె
న్నెలదొలకించులేనగవు నీకగునే మరుపొందఁజేయఁ ద
మ్ములసిరిబాపువాని నగుమోముటువంచఁగనేల యయ్యయో!
చిలుకలకొల్కి!నన్నునిటు సేనకు వేఁగఁజేయఁ బాడియే॥ 52

తే॥ మాఱుమాటాడకటువేయు మారుపువ్వు
టమ్ములటుఁదూరిచనియె నాయమ్ములెల్ల

నీయొయ్యారంబుగన్నంత నోయొయ్యారి!
యీవయో నాకుఁగౌఁగిలి యీవదేల॥ 53

తే॥ తియ్యపూదేనియలనిగ్గు తీయఁజాలి
కండచక్కెరలప్పలఁగాసి చేసి
యలరునీపల్కు నాకోడఁ బలుకఁదగదె
చెలువ!నీనోటిముత్తెముల్ చిందిపోన॥ 54

క॥ చిలుకలకులుకము పలుకులకలవలనగుముద్దుపలుకు కరుణంజెపులన్
జిలుకంగఁజేయరాదే పలుకో కుందనపుబొమ్మ!బంగారమటే॥ 55

సీ॥ ముద్దుగట్టగవచ్చుముద్దుచిల్కలకెల్ల
నేర్పుగాఁబల్కులు నేర్పరాదె
పాదపద్మంబులఁబసు నంచబోదుల
కేర్పడ నడలొగిఁ దీర్పరాదె
వెనువెంటఁబాయని వింతనెమిళ్ళకు
నొప్పుగా నాటలు చెప్పరాదె
ప్రియములుపల్కెడి పెంపుకోయిలగమి
కరుదుగాఁ బాటలుగఱపరాదె
యెద్ది ననుగన్నయంతనే యిన్నివదలి
ముదముదిగనాడి లేనవ్వు మొగము వాంచి
యూరకుండుట కయ్యయో కారణంబు
కొమ్మ! యేమందు నా యభాగ్యంబునకును॥ 56

క॥ నగుమొగము మొగమునందిడి
బిగికౌఁగిటఁబట్టి అవికవిక్కటములునై
జిగికుల్కు నీదుగుబ్బలు
తగనాయెదనొత్తరాదె తాపముదీఱన్॥ 57

క॥ అంగజుఁడు రతియు నాడెదు
బంగరుబొంగరము లేమొ బటువై కుల్కె

శృంగారరసముకు లెక్కడి
సంగన! నీగబ్బిగుబ్బలంటుదునటవే॥ 58

క॥ ఇంతీ! రతియాడెదవా మేల్బంతీ! నీబంగరుగుబ్బపాలిండ్లపూ
బంతులు సొంపౌ చేతులఁ జెంతింపకపట్టియాడ సెలవీయఁగదే॥ 59

తే॥ పసులపాతరనైతిని కుసుమధన్వ
సైన్యకలకలమునకేను జంకి నీదు
శరణుఁజొచ్చితి ననుఁగావఁజనును నీకు
ప్రాణదానంబు పరమధర్మంబుగాదె"॥ 60

వ॥ అనిపలికి॥ 61

ఉ॥ "లేమ! భవత్సమాగమము లేక యిఁకెట్లుచనంగనేర్తు నా
హైమవతీమనోహరజటాగ్రతలస్థితబాలచంద్ర రే
ఖామహితాతపాక్రమితకందర రాజితరాజకీరుభృ
త్సీమను మన్మనోరథము దీరవిహారరమాభిలాషినై॥ 62

తే॥ తరుణి! నీకుచదుర్గముల్ దాపులేక
చందనాచలములకేను జనినయపుడ
తలఁపఁదత్పర్వతోపరిస్థలనిశాంత
గంధవహకందళములునన్ గలపఁకున్నె॥ 63

ఉ॥ మాటలు వేయునేటికిఁక మత్పుటభేదన మేనుజొచ్చి యీ
హాటకరత్నసంఘటితహర్మ్యతలంబుల రాత్రియామముల్
బోటులు గొల్వ సంతసముఁ బొందుచునుండఁగ నెట్లుగల్గు నో
పాటలగంధి! చంద్రుఁడు పాల్పడనాయె కాచియే చెడెన్॥ 64

తే॥ వెలఁది! మత్కేళికోద్యానవీధులందుఁ
బోరినై సర్గికోద్యద్విహారరతిని

జనినయంతఁదదంతరస్థలమయూర

శుకపికానీకములునన్నుఁజుట్టుకొనవె॥ 65

వ॥ కావున భవదీయకరుణాకటాక్షవీక్షణామృతలహరీపుంజం
బులవలన మదీయతాపజ్వరనివారణంబుచేసి మన్మనోరథంబుసిద్ధింపం జే
యందగు"ననిన॥ 66

క॥ 'లకలరతిఁ గ్రమోహమున|జిలుగుఁ వెలతిఁ గెంగపుచెంవముగులుకన్
కులుకుంబలుకులనమృతము| చిలుకఁ గాసుతునకని యొసగ్గొలంకన్ |

క॥ 'రాజకుమార! దివిజ | ద్రాజకుమారరతిరాజ రాజద్రజనీ
రాజకుమారకుమార| శ్రీజయసౌందర్య! మచ్చరిత మొగివినుమా॥

క॥ మణిపురమను పురిభూపతి| మణికటకకలాపలసితయగునా
మణినగర మేలుచుండును| మణికంధరుండనెడి వాఁడు మహితప్రీతిన్॥

క॥ ఆ మణికంధరునకుఁ ద|ద్భామామణియై కమలపాణికి సుతనై
ప్రేమన్ బుట్టితి నన్నా|మము విను మోహనాంగినరపతితిలకా॥ 70

వ॥ వనవిహారాభిలాషిణినై చనుదెంచితి, వీరలు మదీయసఖీ
జనంబు"లనిపలికి యక్కలికి తనవలపు తెలుపక మఱుంగుపెట్టి చిలుక
రాతువిరి చిలుకుములుకులకఖుకు రాట్తిలకున కిట్లనియె॥ 71

క॥ తలిదండ్రుల యాజ్ఞను నే|మెలఁగుట మదితలఁకి కలల మీనాంకశరో
జ్వాలతాపయుక్తి నన్నిటు|పలుకఁగ ధర్మంబెనికుఁ బార్థివతిలకా!॥ 72

వ॥ అదియునుంగాక॥ 73

క॥ ప్రబలులు ధరణీనాయకు|లబలల మేమెన్ని చూడ నట్లగుటనిలన్
ప్రబలులతో సాంగత్యం|బబలలకు దగునె చేయ నవనీపాలా!॥ 74

క॥ పురుషులు మాయాశీలురు
పురుషులు చాంచల్యగుణులు పురుషులుకుటిలుల్

పురుషులు సత్యవిహీనులు
పురుషులనమ్మంగరాదు పొలంతులకెందున్॥ 75
వ॥ అది యెట్లంటేని॥ 76
సీ॥ అడవిడింపఁడె రాముఁ డతిగర్భదుర్భరా
విర్భావవై భవాన్వీత సీత
చంపబూనఁడె హరిశ్చంద్రభూమీంద్రుండు
సాంద్రసద్గుణవతిఁ జంద్రమతిని
చీరెచించుక నిద్రఁజెంద నలుఁడుపాసి
పోవఁడా సద్గుణ భూమిపైని
కారిన్యచిత్తుఁడై ఖండింపఁ జేయఁడే
రేణుక జమదగ్ని మౌని పూని
అగ్నిదేవునిసాక్షిగానటువరించి
ముగ్ధలౌ కామినుల నిట్లుమోసగించి
దుర్దశలనొందఁజేసిరి నిర్దయతను
పురుషులకు సత్యమెచ్చటఁ బోల్పఁగలదె॥ 77
క॥ మనమునఁ దావలచినచోఁ
జనువిచ్చుంజెనటియగుచు సరసతనాత్మన్
తనువలచిన నిన్నారం
బునఁజూచును రంభనైనఁ బురుషుండహహా” ॥ 78
వ॥ అని యిట్లుపలికినవిని సౌందర్య శౌర్యతిరస్కృతరమాకు
మారోమాకుమారుండగు రాకుమారుం డక్కుమారికిట్లనియె॥ 79
క॥ కొమ్మా! నామనవినిగై! కొమ్మా నిక్కముగ నీదుకోమలచరణా
బ్జమ్ములుపాయకనీచి! త్తమ్మురువచ్చునటులేను దగఁజరియింతున్॥

తే॥ నాదుసంపూజ్యరాజ్యంబు నావిభూతి
నిజము యీశ్వరుసాక్షిగా నీదిసుమ్మి
నీవుపనిగొన్నఁ జేయుదు నేటనుండి
కౌఁగిటనుబట్టినన్నేలు కమలనేత్రి! " 81

క॥ ఓచంద్రబింబవదనా!, యోచందనచారుగంధి! యోతరలాక్షీ!
నీచిత్తము నాభాగ్యము, నేఁజిక్కితిఁ బుష్పచాపునిశితాస్త్రములన్

ఉ॥ ఏగతిఁగాచెదో సరసిజేక్షణ! మన్నన నన్ను నీ”వనన్
దీఁగెమెఱుంగులేనగవుతీయనిచక్కెరమోవిగ్రమ్మఁగా
సోగమిటారికన్నులను జల్కగఁదేలఁగఁజూచి యిట్లనెన్
నాగసమానయాన తననవ్యవచోవిభవంబు దెల్పుచున్॥ 83

వ॥ "నరనాయకా! యట్లయిన నస్మద్వచనక్రమంబున నెన్ని దినంబులు మెలంగుదు నన్నివాసరంబులు భవదధీననై యుండుదు, మదీయవాక్యోల్లంఘనంబుఁ జేసిన క్షణంబున నెడఁబాయుదు, ఏతత్కృత్యంబున కొడంబడుము" అనిన రాజనందనుండు సమ్మతించి॥ 84

క॥ మనమున మన్మథు డోహో
యనియార్వఁగఁ బట్టె మృదులహస్తము వీరన్
మణిఘృణిభాస్వత్కంకణ
ఝణఝణితాగణితరతిసంపదనిగుడన్॥ 85

వ॥ ఇట్లుకరగ్రహణంబుఁ జేసి యమందసుమనిష్యందమరందపానానందితమిళిందసుందరఝంకారరవపరిపూరితంబును రోహిణీకాంతాకాంతకాంతమణికాంతఘృణినిశాంతనితాంతసంజాతశీతలోపేతశాతకుంభశుంభద్వితర్దికావిరాజమానంబును నత్యంతరమ్యంబును నైయొప్పు ప్రాంతమంజులనికుంజాభ్యంతరస్థలంబునఁ బూపాన్పుఁ జేర్చి॥ 86

క॥ చెక్కిలిముద్దిడి నిద్దపుఁ జక్కెరకెమ్మోవినొక్కి సారస్యమునన్
జక్కనివలపుచెలంగఁగఁ దక్కకమరుకేళిఁ దేలె ధాత్రీశుఁడాగన్॥ 87

క॥ మరుకేళీవైభవమున
డిరవుగ నళిపతులకహా హా యింపుఘటింపన్
పరివలపులైన కూటమి
కరయఁగ నెనయైన సౌఖ్య మవనింగలదే॥ 88

వ॥ ఇట్లు మన్మహీనాయకుం డసమసాయక కేళీలోలాత్ముండై జవ్వనింగూడి యవ్వనిం గొన్ని దినంబులుండి యంత నక్కన్నియం దోడ్కొని తనపురంబునకేతెంచె నంతటఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగి మణికంధరకమలపాణులు బహువిధంబుల దుఃఖించి రంతఁ దల్లియగు కమలపాణి యిట్లనియె॥ 89

* మణికంధరకమలపాణులు కొమార్తెను గుఱించి దుఃఖించుట *

క॥ హా కూఁతుర! నినుఁ జూడక, యేకరణిం నిలుచుదాన నెట్లోమిందన్
నీకొఱకునోము లెన్నియొ నేఁ గోరి నోచి కంటి నిన్నుఁ గుమారీ॥ 90

సీ॥ ఆహారమింపుగా దయ్యయో నాముద్దు
కూఁతురు పొత్తునఁ గుడువకున్న
నడవఁగాళ్లానునే తడబడకనుచాల
ప్రమదంబుతో వెంటరాక యున్న
నిద్దుర వచ్చునే నిజముగాఁ గూరిమి
పట్టి నాప్రక్కలోఁ బాడకున్న
నిలువగా మనసొప్పునే క్షణమొక్కచోఁ
గనికికన్నియ దండ నిలువకున్న
ఏమి చేయుదు నింక నే నెందు బోదు
నక్కటా! మేని లేఁత శోకాంబురాశి
నెల్లు మీఱియుంతు నాకు నింకేదిదిక్కు
బాపురే దైవమా" యని పలువరించి॥ 91

వ॥ మఱియు నిట్లనియె॥ 92

తే॥ "నీకొఱకు నీదుతండ్రి "యయ్యోకుమారి!
రావదే"యని శోకింప రావదేమి?
తల్లిదండ్రులపై నల్క తగునటమ్మ?
వద్దురావమ్మ తగనీటు గద్దటమ్మ॥ 93

సీ॥ ప్రొద్దుప్రొద్దున లేచి ముద్దుటంచల కాట
లేర్పడ నేర్పువా రెవ్వరింక
చెక్కిలి గొట్టి రాచిలుకపిండుకుఁ బల్కు
లింపుగాఁ జెప్పువా రెవ్వరింక
ఉపవనాంతరములనుండు పూఁదీవెల
హెచ్చుగాఁ బెంపువా రెవ్వరింక
సరసత సంగీతచాతుర్యమున వీణ
మెసఁగ వాయించువా రెవ్వరింక
ఇంక నెవ్వరు నాతోడఁ గొంకిగొంకి
కలికిపలుకులు తిన్నగాఁ బలుకువారు
నిగనిగని రత్నకాంతులు నిగుడుచున్న
తూఁగుటుయ్యాల లింకెవ్వ రూఁగువారు॥" 94

వ॥ అని బహుప్రకారంబుల విలపించె, అంత మణికంధరుండు
బంధురరోషాక్రాంతచిత్తుండై యిట్లనియె. 95

క॥ "గురుతరగతి మత్పుత్రిని। బరువడిఁ గొనిచనినయట్టిపాపాత్ముఁడు వి
స్ఫురదుగ్రాహవమండలి। హరిహరకమలాసనాదు లడ్డంబైనన్॥ 96

క॥ భూమిన్ శశికులజలనిధి। సోముండగు శంతనూగ్ర నునిశితభాస్వ
ద్భీమామోఘశరంబుల। చేమరణము జెందు"ననుచుఁ జెలఁగి శపించెన్॥

వ॥ తదీయశాపాగమనం బెఱుంగక యాశతకవచుండు బహు
వాసరంబు లమ్మోహనాంగి మనోహరాంగిం గూడి యనంగకేళీపరా
యత్తచిత్తుండై నానావిధసుఖంబుల ననుభవించి కాలవశంబున నేఁడు
రణంబునకేతెంచి భవదీయనిశితవిశిఖశిఖిశిఖాకలాపంబులఁ బతంగం
బు తెఱంగున ద్రుంగె"నని చెప్పి నారదుండు శంతనుతో వెండియు

* నారదుండు శంతనునకుఁ దత్త్వోపదేశము సేయుట *

నిట్లనియె,నరేంద్రా! పృథివ్యప్తేజోవాయ్వాకాశమయంబులై కామక్రోధలోభమదమాత్సర్యాలయంబులై క్రిమికీటకమలమూత్రరక్తశ్లేష్మవాతపిత్తసంగతంబులై క్షణభంగురంబులగు దేహంబులనమ్మి హింసారిరంసాపరాయణుండవై యుండం బాడియే? ఇదియునుంగాక మహాభంగభంగసంగతంబులగు తరంగిణులంబెక్కులగు కాష్ఠంబులు నొక్కదిక్కుఁ బ్రోవగుచు విచ్చుచందంబున సంసారంబునం బుత్రమిత్రకళత్రభ్రాతృబాంధవరూపంబులంగూడి యింద్రియసుఖంబులందగిలి జంత్రపుబొమ్మలవిధంబున వర్తింపుచుఁ గాలవశంబునఁ జచ్చుచుఁ బుట్టుచు నందుఁ బూర్వభవకృతసుకర్మంబువలన జ్ఞానదీపాంకురంబులయిన దేహంబులును దుష్కర్మంబువలన సూకరశునకగార్దభాదిహీనజంతుజన్మంబులును గలిగి వర్తింతు రదియునుంగాక, 98

లయగ్రాహి

ఘోర మతిదుష్కృతవిచారము వినూత్నభవ
సారము విమోహనవికారము విచిత్రా
ధార మరివర్గసదపారము లసత్సుఖవి
దారము మహోగ్రగుణపూరము ప్రచింతా
గార మురుపుణ్యశిఖిసీరము జరామరణ
భారము మనోఘనసమీర మిలలోసం
సార(మిటువంటిదని)యారయక నెమ్మదిసి
మేరువుగ వమ్మటిది మేర యెనృపాలా! ॥ 99

మ॥ కుటిలత్వంబు శిరోజరాజి గురువక్షోజంబులం బంధురో
త్కటకాఠిన్యము చూపులందు వలితైక్ష్ణ్యం బక్షులం సంతత
స్ఫుటచాంచల్యము పూని నైజగరిమం పూబోండ్లు వర్తింతు ర
క్కట!(తత్స్వాంతము)లిట్టివంచుఁ దెలియంగారాదయె వ్వారికిన్ ॥

సీ॥ అకలంకచంద్రాస్య లతివలటందురు
 ముఖముల రక్తంబు మొనయ లేదొ

పుండరీకాక్షులు పూబోడులందురు
కన్నులందునఁ బుసుల్ గారలేదొ
కాంచనాచలకుచ ల్కాంతలటందురు
నరయఁజన్నులు మాంసమానుకావె
సైకతశ్రోణులు జలజగంధులటంద్రు
మలమూత్రములు కటిస్థలుల లేవె
ఔర! భూమండలంబందు ననఁగవలెనె
బంధురస్తోకనిస్తులబహుళచతుర
ఫణితినొప్పు కవీంద్రుల ప్రాభవములు
వారికేమి, పరంకుశుల్ గారె కవులు॥ 101

చ॥ కలుగక కొన్నినాళ్లు సరి కల్గినయంతట భూరిరోగదు
ర్బలములఁ గొన్నినాళ్ళు పటుబాధురదుష్టతఁ గొన్నినాళ్ళు పెం
పలరెడి తంద్రి కెప్పటను హాళిగ దుఃఖము సేయునట్టి పు
త్రులు తగ మిత్రులంచనుచు, శోషముఁ జెందఁగ నేల ధాత్రిలోఁ॥

తే॥ పుత్రులను మానసమున నమిత్రులనుచు
సూనులను సంతతంబు దుర్మానులనుచుఁ
గొడుకులను నెమ్మది బలు తుంటుడుకులనుచుఁ
దలఁపవలయునుజనులు తథ్యంబుగాను॥ 103

చ॥ ధన మిలఁ గామరోషముఖదారుణశాత్రవభూరిశౌర్యసా
ధనము, మహోగ్రపాపసముదాయవిశాలధనంజయోజ్వలేం
ధనము, పరిస్ఫుటప్రచురధర్మసుకర్మవినూత్నమార్గబం
ధనము, తలంచిచూడఁగను దంధన మౌర! వసుంధరాస్థలిన్॥ 104

వ॥ కావున సర్వంబును బరిత్యజించి యనంతంబును నచ్యుతంబును నవ్యయంబును నమృతంబును నక్షరంబును నప్రతర్క్యంబును నాదిమధ్యాంతరహితంబును సర్వంబును సర్వపాలకంబును సర్వాతీతంబును సర్వాధారంబును సర్వపరిపూర్ణంబును నిరంజనంబును నిష్కళంబును నిరాభాసంబును నిరుపమంబును నిరుపద్రవంబును నిరాలంబంబు

ను నిర్గుణంబును నిత్యంబును నిగమాంత వేద్యంబును నైన పరబ్రహ్మ
స్వరూపంబును హృదయకమలకర్ణికామధ్యంబున ధ్యానంబు సేయవల
యు"నని చెప్పి మఱియునిట్లనియె, 105

సీ॥ సర్వసర్వంసహాచక్రజనస్తుత్య
సత్యనిత్యుఁడు హరిశ్చంద్రుఁ డేడి
నిర్మలసత్కీర్తి నిఖిలసుపర్వాది
నాయకుం డైనట్టి నహుషుఁ డేడి
అష్టదిగ్విజయ బాహాటోపనైపుణి
విఱ్ఱవీఁగిన కార్తవీర్యుఁ డేడి
భూరివిజ్ఞాన విస్ఫూర్తి శీతోష్ణముల్
సమముగాఁ బరఁగిన జనకుఁ డేడి
వినుతదశకంఠ కంఠలుంఠనమహోగ్ర
చండకోదండసర్ముక్త శాతవిశిఖ
భాసురుండైన శ్రీరామభద్రుఁ డేడి
కాలవశమునుబొందిరి గాదె యధిప!॥ 106

వ॥ కావున నిట్టిదేహంబుకొఱకు రాజవధంబు సేయ నేటికి శాం
తింబొందు" మని చెప్పి నారదుండు స్వేచ్ఛాగతింజనియె నంత॥ 107

తే॥ సింధునాథుండు భంగంబుఁ జెందెఁ గుంత
లుండు తగఁ జిక్కుపడె మాగధుండు హరిని
వినుతులొనరించె నడి మత్స్యవిభుఁడు వనము
ధామముగనిల్చె భూపాలుధాటికులికి॥ 108

తే॥ అతనిశరపాళికగపడినట్టివారు
నగపడనివారు తగ నిలింపాప్తిఁ గొనిరి
అతనిపదగతిగనినవా రతులలీలఁ
గననివారు నరేంద్రులై ఘనతమనిరి॥ 109

వ॥ మఱియును. 110

సీ॥ కొందఱుభూపాలకు జరుల్ భీతిచే
రజిల్ల నమ్రశిరస్కులైరి
సిగ్గునంబాఱి రాట్సింహులుకొందఱు
శైలకందరనివాసములమనిరి
హర్షముల్ విడిచి రాజర్షభుల్ కొందఱు
గాంభీర్యమునం దృణగ్రాహులైరి
గూఢిగా నృపతిశార్దూలురుకొందఱు
కాంతారచయములం గలసిచనిరి

మఱియుంగొందఱురాజులు మణివిచిత్ర
పేటికాకోటికా సవధూటికాతి
ధాటికాఘోటికాస్వర్ణశాటికాదు
లుచితముగనిచ్చి వైభవయుక్తులైరి॥ 111

వ॥ మఱియుం గొందఱు ధాత్రీసుత్రాములు తమతమభూములు గీములు వదలి యత్యంతసౌందర్యాభిరామలగు రాములంగూడి చనిచని,

సీ॥ కుటిలనానామృగోత్కటభీమగహనముల్
శృంగారవనములభంగిమెలంగి
సలలితపంక సంకలితసరిత్తతి
కేళీసరోలీల నోలలాడి
వరకంటకాఖండ వల్లిమతల్లికల్
తూఁగుటుయ్యెలలఁగా నూఁగియూఁగి
అస్తోకతర కర్కశాయతోర్వీస్థలుల్
ప్రసవతల్పములుగాఁ బవ్వళించి

కాకఘూకోత్కరాద్భుతకలకలములు
బాళి శుకసూక్తులుగను వేయాలకించి
యాత్మపురములభంగిగా నమరియుండి
రవుర!ఏమనవచ్చు భూధవునిధాటి॥ 113

ఉ॥ కొందఱుమానులై మునులఁగూడిచరించిరి మోహసక్తులై
కొందఱు దేవదేవు హరిఁగూర్చి తపంబులొనర్చి రున్నతిన్
కొందఱు బంధముక్తులయి కోరికఁ జెందిరి యోగనిష్ఠ సం
క్రందనసన్నిభుండగు ధరాపతికోడి వసిన్ మహీపతుల్॥ 114

మ॥ శబరీసంఘముతోడఁజెప్పదురు రాజన్యావరోధాంబుము
ట్కబరీసంతతు లాత్మనాయకు లుదగ్రక్రోధదుర్వారులై
ప్రబలుండైన వసుంధరాధిపుసితోఁ బంతంబులం బోరిఘో
రబలోద్రేకముఁబాసి తమ్ముఁగని యారణ్యోర్వికిన్ వచ్చుటల్॥

వ॥ మఱియు క్షోణీకాంతులుకొందఱు నిజకాంతలంబాసి కాంతారమ్ములు నిశాంతమ్ములుగానెలంగుచు నితాంతదురంతలతాంతకుంతసంఘాతఘాతజాతవిభ్రాంతస్వాంతులై॥ 116

సీ॥ కొదమరాసింగమ్ము లెదురుగాఁజనుదేరఁ
దరుణులమధ్యముల్ తలఁచితలఁచి
తెలిదమ్మికొలఁకులఁ గలువరేకులఁచూచి
లలనలకన్నులు తలఁచితలఁచి
కపురంపుటనటులు ఘుమ్మనవాసింపఁ
జెలులమైతావులుదలఁచితలఁచి
గుజ్జులేమావుల క్రొంజిగురులఁగాంచి
మెలఁతలచేతులు తలఁచితలఁచి
కలికిచిలుకలకులకంబు కానఁబడిన
జలజనేత్రలపలుకులు తలఁచితలఁచి
యవనినాయకు లాత్మకాంతాతివిరహ
పూర్ణితాత్యంతదుఃఖులై పొరలిపొరలి॥ 117

వ॥ మఱియు బాలరసాలసాలసరసకిసలయవిసరగ్రసనాకుంఠిత కలకంఠకంఠకుహరగళత్పంచమకుహూకారకోలాహలకూజిత ప్రమోహాక్రాంతవిరహిస్వాంతంబులగు వసంతంబులును సంధ్యాకాలసల్లలితోత్ఫుల్లాత్ఫుల్లకమల్లికాప్రసూనసారసౌరభాత్యంతభీష్మంబులగు గ్రీ

ష్మంబులును సానుమత్కూటతటపటునటన్నీలకంఠకామినీయూథా
నూనగానారవసంపూరిత దశదిశాంతరాళంబులగు ప్రావృట్కాలం
బులును జీవంజీవసంజాతాజవంజవసంజీవకమంజులరుచిపిచండిలాఖండ
పుండరీకరిపుమండలప్రభూతకాశసరిత్కాశప్రతీకాశసాంద్రచంద్రికానిచ
యంబులగు శరత్సమయంబులును గడపుచు నిందిరానందనేందింది
రేందీవరమిత్రచైత్ర మందానిలమరాళమయూరకీరశారికాకలకంఠప్ర
ముఖామిత్రపక్షుంబు నిందింపుచు నుండె నివ్విధంబున॥ 118

క॥ శ్రీకరమై దిగ్భావర।భీకరమై యఖిలవిబుధబృందవినుతభా
గ్యాకరమై భూస్థలి న।స్తోకత నృపుదండయాత్ర శోభిల్లె వడిన్॥

కుశుఁడు దిగ్విజయము చేసి మరలి పురంబునకు వచ్చుట.

క॥ నాకేశనిభుఁడు రాజా।నీకములిడుకానుకలు వినిర్మలమతియై
కైకొని యాహవవిజయ।శ్రీకైకొని మరలెఁ దనదు సేనలుగొల్వన్॥
వ॥ ఇట్లు మరలివచ్చి నిజపురంబుగు నిజపురోపకంఠంబున ని
లిచి పట్టణాలంకరణాది శుభోచితక్రియలొనర్ప పవమాత్యులకుం జెప్పి పు
చ్చిన వారలు తదాజ్ఞ శిరంబున నిడుకొని పురంబు చాటించినఁ బౌర
జనంబులు॥ 121

ఉ॥ రచ్చలు వీధులంగడులు రాజగృహంబులు నర్మహర్మ్యముల్
మెచ్చులుగుల్కు వేదికలు మిద్దెలు చప్పరముల్ కురుంజులున్
హెచ్చగు చావడుల్ విశదమేర్పడఁగా నొసరించి యిచ్చమై
నచ్చుపుఁబచ్చకప్రమున నల్కి యొనర్చిరి రంగవల్లికల్॥ 122

వ॥ వెండియుఁ దత్పుటభేదనప్రకాండంబు నానావిధవిచిత్రంబు
లు నెరయ మెఱయ జంభారికుంభీంద్రకుంభశుంభత్పయోధరల యొర
పుగలిగి మెఱుఁగులుపరఁగు చిఱుతొడలవడువున బెడఁగుగలకదవన్న
పసిఁడియనఁటికంబంబులు డంబు మీఱఁ గెలంకులఁ బొంకంబుగా నలంకరిం
చి సముంచితహరిత్త్వభావిభాసమానరుచిరమరకతమణిగణపరికల్పితాన
ల్పకళ్యాణకారణంబులగు తోరణంబులుగట్టి భూమిభృద్భిదుపలనీల
కబరీభారల కపోలఫలకంబుల పోలువు తెలుపుచు......తళుకులుచిలుకు

మగరాలనిలువుటద్దంబులఁ నిల్పించి కుందరదనల సుందరమందహాస
కందళంబుల కెత్తువత్తుమను బిత్తరంపుఁ గ్రొత్తముత్తియమ్ముల నత్తు
చ్చిసర్వతోభద్ర నాగబంధఛత్రపద్మగుచ్ఛశంఖచక్రగోమూత్రికాది
నానావిధచిహ్నితంబులగు రంగ వల్లికలుదీర్చినం బొలుపొందు ప్రతిగృ
హద్వారంబులవలనను బహువిభాకరప్రభాకరబింబవిభ్రమకృచ్ఛాతకుం
భకుంభప్రశస్తనిస్తులశశికాంతశచీకాంతశిలకీలితానర్ఘభర్మహర్మ్యోత్తుం
గశృంగభాగభాగనర్ఘమణిపాంచాలికాసంచయంబులవలనను బురలక్ష్మీ
ప్రతిభుగరినగరీనగరాట్పయోధరాతిలకంబులసాహాయ్యంబునకుఁ గరం
బులెత్తి చీఁకుతెఱంగున నభ్రంకషరత్నగోపురంబులనొప్పారు నూతన
కేతనంబులవలనను బంధురపరిమళమిళితమృగమదసంకుమదచందనపం
కంబులనొప్పుగల పూగుత్తులచొప్పుదెప్పసిబ్బరంపుగబ్బిసిబ్బెపుగుబ్బలజొ
బ్బిలమెత్తిమేఘమండలంబుపొందుఁబాసి వసుంధరకుంజనుదెంచినతొల
కరిమెఱుపులయొరపునఁ జెఱకువింటిదొరయొఱఁ బెఱికి కఱకుపదనిడిమెఱ
పించినమెఱయు నగవిరిములుకులచెలువునఁ బుడమినంగిడి నడువ
నేర్చిన మాణిక్యపుబొమ్మలవిధంబున లోకంబులమోహపఱుప నలువ
చెలువపంచిన మోహినీదేవతలరీతుల నగణ్యలావణ్యతారుణ్యచా
తుర్యధుర్యలయికనుపట్టు వారవిలాసవతులవలనను ముక్తాఫలాక్షత
ప్రసూనంబులు మాణిక్యదీపకళికలు పసిండిపళ్లెరంబులనిడికొని మంద
స్మితసుందరవదనారవిందంబులతోఁ జెలంగు పుణ్యాంగనాజనంబుల
వలనను భేరీమృదంగపటహతమ్మటడిండిమఢక్కాది బహువిధవాద్య
హృద్యవాద్యఘోషంబులవలనను నత్యంతమనోహరంబై యొప్పె
నప్పుడు, 123

ఉ॥ పౌరులు మంత్రులుం బుధులు బంధుజనంబులు మిత్రకోటియుం
సూరిజనమ్ము తన్నుఁగని శోభనలీలలఁ గానుకల్ తగం
బోరుననీయఁ గైకొని ప్రపూర్ణసుధాకరసాంద్రచంద్రికా
సారపటీరహీరసితసౌధతలంబుల నిల్చి వేడ్కతో
నారులు క్రొత్తముత్తెములు నవ్యసుమంబులు సేసఁజల్లఁగాఁ ॥ 124

క॥ శుభలగ్నంబునమఘవ। న్నిభుఁడగుభూజాని రాజనికరము మంత్రు
ల్విభువులు నల్దిక్కులరా। విభవోన్నతిగేహమునఁ బ్రవేశించెఁదగన్
వ॥ ఇట్లుప్రవేశించి తల్లియగు సునందా సుందరీరత్నంబునకు
నమస్కరించి దీవనలుగైకొని సకలజనంబులఁ దమతమనికేతనంబుల
కనిచి యిష్టవినోదంబులనుండె॥ 123

వసంతఋతువర్ణన.

క॥ అంత సమాగతమయ్యె వ। సంతము సంతతనికుంతసంతానరవా
క్రాంతదిగంత మనంతల। తాంతనిరంతరలసద్వనాంతంబగుచున్॥
తే॥ వనరమాదేవి జీవితస్వామియైన
చైత్రుఁడే తేర మలినవస్త్రములుదిగిచి
తలపఁ జెంగావిచీరెలుదాల్చెననఁగ
జీర్ణపర్ణంబు(లెడలి) లేఁజిగురువ్రేడమె॥ 128
తే॥ మానకవనులఁగొమ్మలు మధురసాప్తిఁ
బల్లవనురాగసంపత్తిబరఁగెనార!
మానకవనులఁగొమ్మలు మధురసాప్తిఁ
బల్లవనురాగసంపత్తిఁ బరఁగుటరుదె॥ 129
క॥ కోరకములొప్పెఁ జైత్ర శ్రీరామునకింపు(తోడఁ)జెలువొందఁ(గనా)
క్షీరనిధిభూరిమౌక్తిక। హారంబులుకాన్కతెచ్చెనన నవ్వేళన్॥ 130
శా॥ కాంతోద్యద్గతి మాధవాగమ వయోగాంభీర్య మొప్పారఁగాఁ
గాంతాశేందిరనూత్నపుష్పవతియై కన్పట్టెనన్ విస్ఫుర
త్సంతోషప్రథితాళినీనివహఝంఝంకారనాదార్భటిన్
గాంతామంగళగానముల్ చెలఁగె రంగత్కౌతుకావాప్తిమై॥ 131
తే॥ రూఢి శిశిరర్తువనునమిత్రుండు సిరులు
చూఱఁబుచ్చిన నవలతాసుందరులకుఁ
జైత్రనృపుఁడిచ్చురత్నభూషణములనఁగ
ఫలములొప్పారె లలి వనస్థలములందు॥ 132

తే॥ తనరుసద్ద్విజచయము మాధవునిసేవ
నిష్టఫలములనొందె నంతృప్తిమీఱె
తనరుసద్ద్విజచయము మాధవునిసేవ
నిష్టఫలములనొందుట కేమియరుదు॥ 133

ఉ॥ మారుజయప్రదేశములొ మన్మథుమోహనబాణశాలలో
వారిధికన్యకాసుతుని వైభవసీమలొ కంతుకేళికా
గారములో వసంతసఖు గానివాసములో యనంగ శృం
గారగతిం జెలంగె సహకారముల త్తతి సౌఖ్యదంబులై॥ 134

చ॥ హరిహయధర్మవిక్రమవిహారము పెంపువహించె జాతిసం
కర మొగి(లేక యే)సుఖము ఖద్విజరాజికిఁగల్గె నుల్లస
ద్గురువిభ(వుండు) మాధవుఁ డకుంఠమహావనమండలంబునఁ
గరము పలాశభేదన మొనర్చి నిజాభ్యుదయంబుదెల్పెనఁ॥ 135

సీ॥ చికిలికెంపులఁబోలు చిగురుటాకులడాలు
హాలహలానలజ్వాలగాఁగఁ
బరువమైతనరారు విరులగుత్తులసౌరు
పరిపూర్ణ చంద్రబింబంబుగాఁగ
సొగసైనమవ్వంపు సోగతీఁగెలగుంపు
లిందిరాసుందరి హేలగాఁగ
మధురసంపదనింపు మకరందముల పెంపు
రమణీయమగు సుధారసముగాఁగ
మాధవాగమమందరమ్మథరేంద్ర
మథనపృథుయత్నమునఁ జాలమహితమగుచు
నఖిలభువనోన్నతస్థితి నమరుచున్న
మంజువనరాశివనరాశిమధ్య మొప్పె॥ 136

సీ॥ చూతముల్ పాంథహృద్ఘాతముల్ పల్లవ
జాతముల్ మిగుల రంజకములయ్యె

తుంగముల్ వాసనారంగముల్ మోహనా
భంగముల్ వైభవాస్పదములయ్యె
కుందముల్ మాధవాళిందముల్ విగళన్మ
రందముల్ ఘిగులంగ నందగించె
వకుళముల్ సందీప్తముకుళముల్ మన్మథా
స్త్రకుళముల్ మిక్కిలిరహిపహించె
సమదసంభ్రమసంభ్రమచ్చారుచంచ
రీకదళకీరికాశారికాకదంబ
ముఖరముఖరితదశదిశాముఖములగుచు
వరుసఁగన్పట్టు కాంతారవసతులందు ॥ 137

ఉ॥ పారములేని క్రొవ్విరులపంక్తులు పావటచేర్లుగాఁగ భృం
గీరవ మొప్పుపాటలుగఁ గెందలిరాకులు జాతికెంపురా
యారతిపళ్ళెరంబులుగ నాశుగకంపితముల్ లసద్గతుల్
గా రహిఁజెందెఁ జైత్రనృపు కట్టెదుర్గం బ్రతతీసతీతతుల్ ॥ 138

సీ॥ పాటీరనగశిరఃకోటీతటపటీర
వాటీస్థలమున భవమ్ముగాంచి
యేలాలతాళింద హేలాగతపుళింద
బాలాకుచసుగంధపాళినాని
సారసకల్హారసారసాకరసీర
సారసికరములజలకమాడి
హృద్యబంభరగీతవిద్యానవద్యాత
తోద్యానమకరంద నుగ్గుద్రావి
రంజితనికుంజపుంజాభిరామ కోమ
లోల్లసితమల్లి కావల్లి కోసుచారు
డోలికామాలికల హాళి లాలియూఁగి
యలరె నామని గంధవహార్భకుండు ॥ 139

చ॥ సుమముల వ్రచ్చివ్రచ్చి పరిశుద్ధగళన్మకరందబిందుబృం
దము చవి మెచ్చిమెచ్చి(సునితాం)తలతాంతసుకాంతపుంజపు
న్జములను జొచ్చిచొచ్చి వికసద్ఘనకాంచనదర్శనమ్ముచే
గములొగివిచ్చివిచ్చి కనఁగాఁదగె షట్పదపంక్తు లావనిన్॥ 140
ఉ॥ సాలము లెక్కి లేఁజిగురు సంతసమొప్పఁగ మెక్కి సన్నపుం
గాలికి స్రుక్కి మోహములఁ గాంతలకౌఁగిళులందుఁ జిక్కి హే
రాళసుఖాప్తి నిక్కి సుకరస్థితి భేదముదక్కి వింతయౌ
ఖేలనలీలఁ జిక్కి చెలఁగెన్ మదకోకిలపంక్తు లావనిన్॥ 141
చ॥ ఫలములఁ గోరికోరి పరిపక్వములౌనవి కాంచికాంచి త
త్ఫలరసమానియౌని సురతక్రియలన్ లలి మీఱిమీఱి యిం
పలరఁగజొక్కిచొక్కి మధురాయతభాషల మించిమించి తా
ర్విలసితభంగినొప్పెఁ బృథివీస్థలి నప్పుడు కీరదంపతుల్॥ 142
సీ॥ బింబముల్ గని చంద్రబింబాననల తావి
చెంగావిపెదవుల చెలువులెన్ని
సారంగములఁగాంచి సారంగయానల
విపులవీక్షణవిలాసములుపొగడి
పున్నాగములఁగాంచి పున్నాగవేణుల
నాభివిశేషవర్ణనలుచేసి
కాంచనమ్ములఁగాంచి కాంచనాంగుల తనూ
లతలబంధురగతులుమెచ్చి
సరసు లాచైత్రవేళల సరసలీల
లతిశ(యింపఁగ)జొక్కిరి గతులరరతుల
నతులవాసంతికా నికుంజాంతరముల
గలసిమెలసిరి రహి వనస్థలులయందు॥ 143

వ॥ శ్రీఖండభూభృత్పరిసరస్థలచర ద్భిల్లపల్లవాధరీజన కాఠిన్యప
యోధరపరిలిప్త కురంగనాభికాసారభసంకలితాగమనశమనహారిన్మరు

త్పరంపరాపరికంపిత కేసరకుసుమ కేసర ధూళిధూసరితదశదిశాముఖంబులవలనను, భూదేవతాజనంబులకు భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయసంపన్నంబులగు శాల్యోదనంబులొసంగి తాంబూలంబులిచ్చి ప్రసూనాంబరధారులంజేసి ఘనసారగంధసారపంకంబులలంది తాళవృంతంబులవిసరి చరణ(రక్షా)దులొసంగి వైశాఖపూజలొనరించు సుకృతాత్ములవలనను, లతాంతకుంతమండలీకృతోద్దండపుండ్రకోదండవిముక్తపుష్పకాండప్రచండవేదనాదోధూయమానమానసంబుల నాహారంబులు వనవిహారంబులు దూరంబుసేసి మోహవికారంబులఁబొరలు రాజకుమారులవలనను, అప్పాలుగుప్పాదొర యొప్పగుట్కు చొప్పుదెప్ప కప్పగలగొప్పవిప్పకొప్పులముడుచు పువ్వులు నవ్వులు దవ్వులుచేసియుఁ బాటలాటలుమాటలుడిగియు సాటిలేనివుష్పవాటుల నందంబగుచోటులందిరుగుచుఁ గలికిరాచిలుకల పలుకులు చెవులకు ములుకులక్రియం దాకినసొలయుచు బహుభంగులంగన్పట్టు రాజన్యకన్యకాకదంబంబులవలనను అందమ్ములుగల కెందమ్ముల మరందమ్ములకై నిలుచుమిళిందమ్ములుగల పొందమ్మికొలంకుల కెలంకులఁ దావులుగుప్పు పూఁదీవపొదరిండ్ల జెన్నుగలక న్నెమావులతావులఁ జెంగలువబావులక్రేవల నొప్పుమిగిలి గొప్పలగుకురువేరుచప్పరమ్ములయిమ్ముల బహువిధసరసవిలాసకేళీపరతంత్రములై చూపట్టుమిథునంబులవలనను మనోభిరామంబగు నాసమయంబున॥ 144

—• గంగ శంతనురాక కెదురుచూచుచు విరహవేదనపడుట •—

క॥ గంగాకురంగవీక్షణ। శృంగారవతీలలామ సీతాంశుముఖుల్
పొంగుసుఁగొలువఁగ హిమవ। ద్దంగత్పరిసరవనాంతరంబున వేడ్కన్

వ॥ నిలిచి యారాజకుమారరమాకుమారురాకకై దినంబులు గడుపుచు॥ 146

క౦॥ కుసుమాకరంబు రాకయుఁ
గుసుమాయుధుఁ డస్త్రవితతిఁగురియుటయు లస

త్కుసుమాయుధనిభుఁడగుపతి
వెసరాకటుఁదడయుటయు వివేకించిమదిన్ ॥ 147

వ॥ ఇట్లువితర్కించె॥ 148

మ॥ "కలకంఠార్భటు లుల్లసిల్లె మధువిద్గంభీరఝుంకారసం
కులకోలాహలనాదముల్ చెలఁగె న్రూకుల్ పత్రపుష్పాళిచే
ఫలసంఘాతముఁ జోడనొప్పెసఁగె శుంభద్వైభవోపేతలై
చెలువల్ కాంతులఁగూడి వేళ లివె వచ్చెన్ జైత్రలీలాగతిన్ ॥ 149

కం॥ పదనిడిన పూవుటమ్ములు
చెదరనివాచవులునింపుసింగిణినిడి తా
మదనుఁడు ముదమొదవఁగ నిది
యదనని పాంథులను వేఁటలాడం జొచ్చెన్ ॥ 150

సీ॥ సరసనల్లాపసంజనితహర్షస్ఫూర్తిఁ
గీరదంపతులౌర! మీఱఁజొచ్చె
ఈనుజోడుగఁగూడి వేడుకలుప్పొంగి
పికదంపతులు (హృదు) త్సుకతనొందె
సురతసంగతులచే శోభిల్లిమదభృంగ
జాయాపతులు చాలసంభ్రమించె
నిరుపమమోహాప్తి నిండారుకౌఁగిళ్ల
రాయంచమిథునముల్ రహివహించె

ఇట్టిమధువేళనొంటినే నెట్టులుందు
నక్కటా! శంతనుండిటకరుగుదెంచు
ననుచునేనెన్నిదినములో యతనికెదురు
చూడఁజూడంగ వయసెల్లఁజూఱఁబోయె॥ 151

కం॥ సగమయ్యె ధైర్యమియ్యెడ
జగతీతలనాథతిలకు చందురుకెనయై

సొగసైన ముద్దులేనగు
మొగమైననుజూడనైతి మోహాముదీరన్ ॥ 152

ఉ॥ ఏల ప్రదీపభూపుకడ కేగితి నేగిన నన్నుఁజూచితా
నేల"సుతుండ వరిఁ పుమిట కెన్నఁగనామనివచ్చు"నంచుసం
శీలతఁబల్కె,నంతటనె చెప్పఁగరానటువంటి ప్రేమనా
కేలజనించె, వాఁడిటక దేటికివచ్చుటమానె నక్కటా! 153

చం॥ రమణ మృగవ్యతత్పరత రాజశిఖామణియైనయట్టియా
హిమకరవంశవార్ధిశశి యెన్నటికిచ్చటికేగుదెంచునో
తమకము హెచ్చఁజొచ్చె నిఁక దారుణకీరమయూరశారికా
ప్రముఖమనోజసైన్యముల బాధకు నేగతినోర్తు దైవమా! 154

ఉ॥ చెక్కిటఁజెక్కుఁ జేర్చి జిగిసిబ్బెపుగుబ్బ లురస్థలంబునన్
గ్రక్కునమోపి గాఢముగఁ గౌఁగిట బిగ్గరఁబట్టి కాంతు నుం
జక్కెరమోవి తేనియలు సారెకు నామనసారఁ గ్రోలి పెం
పెక్కెడు భాగ్యలక్ష్మియిఁక నెన్నడుగల్గునొ నాకు దైవమా! 155

కం॥ భూకాంతుఁ డెన్నిచూచిన
నేకచ్ఛత్రాధిపుండు హితమతి నాహా!
యేకరణిఁగల్గునాతని
తోఁగూటమినాకు వలపు తుందుడుకెడలన్ ॥ 156

ఉ॥ ఎన్నడు వేఁటమార్గముగ నిందుకులాగ్రణి యేగుదెంచు, న
న్నెన్నడు వైభవంబొదవ నిష్టముగాఁదగఁ బెండ్లియాడు నే
నెన్నడు భర్తతో నగుచు నింపెసలారఁగఁ గౌఁగలింతు నా
కెన్నడు సౌఖ్యవారినిధి నేర్పడఁ దేలఁగఁగల్గు నక్కటా! 157

ఉ॥ అక్కట! యేమిచేతు, విరహానలవార్ధికి మేరయేది, నే
నెక్కడనుంతు నీవలపు నీగతి దైవమదేల వ్రాసె నా
చక్కెరవింటిబోయ తనసాధన వేగమ చూపఁజొచ్చెన
మ్మక్క యిఁకెట్టుతాళుదును, హా! మది పాయదు తాప ముగ్రమై

చ॥ తరమగునమ్మ మోహపరితాపముమాన్పఁగ నమ్మచెల్ల! యే
తెఱఁగున వాఁడు వశ్యుఁడగుఁ దెల్పఁగ రానిమనోజబాధ కే
వెఱవుననోర్తు నన్నుఁ బృథివీవరుఁగూర్చెడిప్రాణబంధులె
వ్వరుగల రయ్యయో! యిఁక నవారణలీల నుపాయమెట్లొకో,,

వ॥ అనిపలికి 160

సీ॥ కలకంఠముల కుహూకారముల్ వినకుండ
నంగుష్ఠములు వీనులందుఁజొనిపి
తళుకొత్తుతేమావితలిరులుగనకుండఁ
దగఁ దర్జనుల నేత్రయుగముమూసి
బంధురసుమబృంద గంధముల్ జొరకుండ
ఘ్రాణయుగ్మ మనామికలనుబట్టి
ఘనతరస్థితిదోషఁ దనయున్న చొప్పు పెం
పొనరుచుండెడి సుఖాసనముగాఁగఁ
గలిగి తలఁపించెనప్డు దక్కాంత కాంతు
సద్గురువరోపదిష్టితసరణి ధరణి
ధవపరిబ్రహ్మసౌఖ్యానుభవముకొఱకుఁ
దారకస్థిరషణ్ముఖి దాల్చెననఁగ॥ 161

కం॥ అంతట లతాంతకుంతుం
డెంతయుసంతోష మాత్మ నిగురొత్త మహా
నంతశకుంతకులారవ
సంతతియనుగమనభేరి జరిపించెదగన్ ॥

సీ॥ మెఱుఁగైన పచ్చగన్నెరుదండ(సిగను) మీ
ఱఁగఁజుట్టి కల్వతురాయిఁబెట్టి
చాయమొల్లలమేల్కుళాయి పొం(గుచుఁదొడ్గి)
తలిరాకుజరబాబు దట్టిగట్టి
కురువేరు (పగడంపు) బిరుదుగాబిగియించి
రంగుగేదంగి నరంగమర్చి

కలుగుమం కెనపూల చెంగావిపైఁగప్పి
మీఱినసంపంగికటారిఁబూని
మెచ్చుగుల్కెడియవిసెపూముచ్చె లడుగు
లందుఁబొందుగఁదొడిగి సాహసమెలర్ప
జెలఁగుసింగిణిదొరయ న్వజీరుతాను
అబలపైనెత్తిచనఁగాఁ బ్రియాణమయ్యె॥ 162

వ॥ ఇట్లు దండయాత్రోత్సాహదుర్నివారుండై॥ 163

సీ॥ ముందరఁబాయక మొనచూపుశారికా
కాహళనాదముల్ గ్రమ్ముకొనఁగ
వెనువెంట బిరుదుమ్రోఁగనుపట్టు హిందోళ
భూరిభేరీధ్వనుల్ బోరుకలఁగ
కణఁగికోవులమీఱు కలకంఠమాగధ
కైరవరావముల్ గ్రందుకొనఁగ
వలనొప్పఁజుట్టును బలసియేతెంచిమేల్
పారువనంమంచ పౌజుగొలువ
గరుడపచ్చలఁగేరు చొక్కంపురెక్క
జీనుగల చిల్కతేజిపైఁబూనిచౌక
ళించిఘాత్కార నిర్ఘోషలీలస్మారి
వెడలెనామనిదళవాయి వేడ్కగాదె॥ 164

వ॥ అయ్యవసరంబున॥

సీ॥ నాతికి వరచూతపోత్రాగ్రకిసలయ
బృందంబు కాలాగ్నిచందమయ్యె
మృగనేత్రికిఁ బటీరనగ సమాగతగంధ
వాహంబుగరళసమూహమయ్యె
పొలఁతికి సంపూర్ణపూర్ణిమాచంద్రుని
వెన్నెలల్ నిప్పులదిన్నెలయ్యె

చిలుకలకొలికికిఁ గలికిరాచిల్కల
పలుకులు బెడిదంపుములుకులయ్యె
కామినికి మత్తకలకంఠకంఠనినద
జాతమేపాఁడి నిఘాతపాతమయ్యె
చందనామోద కిబ్బంగి సౌఖ్యకరము
అహాహా! దుఃఖకరంబులై యుతికెయిల్లొ॥ 165

తే॥ వనజలోచనకనువిచ్చి యొచటఁగనినఁ
బాణితలమునఁ బచ్చపతాణికాతు
కలువనేజాధరించి హుంకారమెసఁగ
వపుషువడఁగుబ్బిమ్మ చిమ్మినయట్లతోఁచు॥ 166

చ॥ పిలువదుకూర్మినెచ్చెలులఁ జేరిడి, పెంపుడుముద్దుచిల్కలన్
దలఁపదు, పెక్కురీతులను దన్నుమనోహరలీలఁజీరఁగా
నిలువదు పూవుపాన్పుపయి, నెమ్మదిసారెకు నుల్కిపాటుతోఁ
గలువలనేలుపోయగవుఁగన్నులకల్కి వియోగవేదనన్॥ 167

క॥ ఆడదుచెలియలతోఁ గదు।ఫీదదు లోఁజింతపంతమే సరిపసుచున్
బాడదుముద్దులపాటలు।చూడదు ముకురమునఁదనదు సుందరలీలన్॥

తే॥ వలసివల్లమిసఖులతోఁ బలుకఁబాడ
గలయుగీర్వాణ భాషలోఁ దెలుఁగుభాష
సరసరాగంబునందు లాహిరిచెలంగు
నొకటిచేయంగబోవ వేఱొకటితోఁచు॥ 169

వ॥ మఱియును॥ 170

సీ॥ రాకానిశాకర ప్రతిమానవదనకా
హారము లీలావిహారముడిగె
వికసితశతపత్ర విమలాయతేక్షణ
కాటలుసరసంపు మాటలుడిగె

స్వగాఢాగాత్రికిఁ బ్రాణసఖులతోఁ దేలంపుఁ
జేలటుగందంపుఁ బూఁతలుడిగె
నారీమణికిఁ గీరశారికాదులమీఁద
రక్తియుక్తైపద్య యుక్తియుడిగె
ఉడిగెనన్నియు నాహృదులోరుతుగాలి
కంతకంతకు సంతాపమతిశయిల్లె
కలికికన్నుల బాష్పముల్ గ్రమ్మదొణఁగె
మదనుఁ దుద్వృత్తిమైసారె మదిగలంప॥ 171

వ॥ ఇత్తెఱంగున దురంతంబగు విరహసంతాపంబునం గరఁగి కుందిన యయ్యింతిం గనుంగొని సారంగకుంతలు లత్యంతచింతాక్రాంతస్వాంతలై మెల్లమెల్లనడాయ నేతెంచి తమలో నిట్లనిరి॥ 172

తే॥ "వటికిఁ బదివుకడకేగె నిందువదన
యేగినంత నెనుతువార్త లేలచెప్పె
చెప్పినంత నెమోహంబుఁ జెందనేల
మోహమొందినయంతనె సాహసమున॥ 173

తే॥ ఇఱుకులోఁ పోఁకు మంత్రముఁ గరణి మరుఁడు
చెలియనురువడి నిట్టట్టుచేయనేల
వెలయుఁదలపోసి చూచిన విమమసంధి
కీడుతలఁచుట నీచులజాడగాదె॥ 174

ఉ॥ కోమలిగుత్తపుం గులుకుకోడెచనుంగవ పైమెఱుంగుగా
భామినులార! పొందుపడఁబయ్యెదగప్పుఁడి, చక్రదంపతి
శ్రీమహితస్థితిం జెంగఁగిశీతమయూఖుఁడుదీప్తిపూర్ణమై
కౌముదిపేరిటం దనరు గాఢపుమంటలు గుప్పఁ బైఁబయిన్॥ 175

ఉ॥ ఏగతిఁదాళునమ్మ తరళేక్షణలార! పసిండిబొమ్మయా
నాగపమానయాన మదనస్ఫుటసాయకవహ్నికీలలన్

గ్రాఁగికరంగఁజొచ్చె వడిఘుర్మకబంధ మిషంబుచేసరో!
బాగుగదీనికిందగు నుపాయమి కెట్లొకొ యాచరింపఁగన్॥ 176

తే॥ ఇఱుకుగుబ్బలనడుమ మేల్పైఱకువింటి
కఱకుపూఁటమ్ము లెక్కుడి కంతుఁడలిగి
చిత్తజల్లుగఁ గురియనేఁజెల్ల చిన్ని
బాలయోగతిఁ దాళంగఁజాలునమ్మ॥ 177

ఉ॥ పంకజగంధిపాదములు పల్లవముల్ సుమగుచ్ఛముల్ కురం
గాంక నిభాస్యచన్నులు సితాంబుజ పత్రవిశాలనేత్రి మే
ల్వొంకవు బాహులాలతలు పొల్పుఱునీసుమగంధియయ్యరో!
యింకెటులోర్చుఁదాపశిఖ కేపడి యావిరహాగ్ని హెచ్చఁగన్"॥

క॥ అని బహుభంగులఁగాంతా
మణులెంతయుఁ జింతవంతమదిఁగుందఁగనే
పుణ్యన నందొకప్రౌఢాంగన
వనజాననకిట్టులనియె వాక్యప్రౌఢిన్॥ 179

తే॥ "సారసంపూర్ణపూర్ణిమాచంద్రవదన!
చెలిమికత్తెలు నీకయుచింతనొంద
నించుకేనియుఁ బలుక వీవిట్టులున్న
దనుచుఁదెలుపవు నీకిదిన్యాయమౌనె॥ 180

చ॥ కలకలనవ్వునంతనలుకన్ జిలుకన్ జులుకంగఁజూడకో
నలినసమానచారువదనా! 'మదనామదనాభుఁజేర్పఁగాఁ
దలఁచినమస్తకార్యముదితా! ముదితా మదిఁదాపమొందఁగా
వలదిఁకనిట్టులుండ ఁదగవామగువా! నగువారిఁగానవే॥ 181

క॥ అక్కరో! వేగమెఱియ్యసి!
చక్కరతినుపించుమంచు ఁజనువున ఁగదియన్
ముక్కుమొగంబును జూడక
చెక్కిలిగొట్టెదవు ముద్దుచిలుకందగునే! 182

క॥ మొగమె త్తి చూడవింతయు
నగవకటా! రూపలలితనవమన్మథుపైఁ
దగమనముఁ జేర్చియీగతి
తగునవియోగాగ్నిఁ గొమ్మ! తాపముఁ బొందన్॥ 183

క॥ ఇన్నిదినంబులునన్నున్ మన్ననగాఁ జూతువెపుడు మాటాడవయో!
కన్నియ! నాభాగ్యంబిటులున్నది నీవేమిసేయనోపుదువమ్మా॥ 184

తే॥ పిలిచిబహుమానమునమున్ను పలుకరించి
నీవుమన్నన గాఁ జూడ నెలఁత లెల్ల
రమ్యసౌమ్యనిమిక్కిలి రాజసమునఁ
బెద్దగాఁ జూచెదరునిన్ను ముద్దుగుమ్మ॥ 185

క॥ ఇఁక నా క్రియ లేలాగున నకలంకశశాంకవదన! యారయఁగల్గున్
బ్రకటముగస్వప్నమందుననకటా! తోఁచినపదార్థమగుటలుగాదే"॥

వ॥ అని యివ్విధంబున న్యాయనిష్ఠురంబులు కొన్నిపలికి యక్కలికి కలికిపీనులు చొరమి తెలిసి మరలి బుజ్జగించి మెల్లన ప్రియవాక్యంబుల నప్పల్లవాధరీతిలకంబిట్లనియె॥ 186

ఉ॥ "కప్పురగంధి! నీచెలిమిక త్తెలు నీకుహితంబు చెప్పుచోఁ
జెప్పఁగరాని ముచ్చటలు చెప్పిరొ నీడుమనోజ్ఞభావలన్
దప్పులుపట్టిరో ప్రియము తప్పమతేమివచించిరోకొ మా
యప్పవుగా పరాఙ్ముఖతనందిన కారణమేమి చెప్ప వే॥ 187

క॥ గుఱితప్పిమించనాడిరొ మఱుమాటలువల్కిరో సమానగరిమకే
యఱమరలు లేక నాతో సరసముగాఁ దెలుపవమ్మ చక్కెరబొమ్మా॥

ఉ॥ దాఁగిలిమూతఁలాడుదమొ తప్పకవీణియఁ బట్టి సొంపుగా
రాగము లెత్తిపాడుదమొ రంగగుబంగరు బొంగరంబులన్
బాగుగఁ బట్టియాడుదమొ బంగరుకుందపుదారనంజ్ఞతన్
నాగవిలాసయాన! యిది నాకుఁ బ్రియంబని తెల్పి చెప్ప వే॥ 189

ఉ॥ వీడియుమిత్తునో కథలువీనులవిందుగ విన్నవింతునో
వేడుక మేను పట్టుదునువింతనుగంధవుఁబూఁత పూఁతునో
నీడలుగానరానెదుట నిద్దపుటద్దముపట్టినిల్తునో
యూడిగమెద్ది సేతుఁ బ్రియ యొప్పుఁగఁ దెల్పఁగ దమ్మకోమలీ"॥ 190

వ॥ అని యివ్విధంబున నవ్విధుబింబవదన పలికిన మధురాధరియగున
వ్విధువదనాతిలకం బిట్లనియె॥ 191

తే॥ "అంగనామణి! యిట్లుపొల్పంగనీకుఁ
దగునెమితిలేని విరహసంతాపవహ్ని
నుడుకఁగానయ్యయో! పిడుగడఁచినట్టి
దానిఁగొఁఅవులఁగాల్చు విధంబుదోఁప"॥ 192

వ॥ అని పలికి యెప్పటియట్ల యూరకుండిన నయ్యండజయానం
గాంచి కించిస్మధ్యలికాకాంత శంతను భూకాంతునిపై స్వాంతంబుఁ జే
ర్చి దురంతంబగు విరహసంతాపంబున నలంతంబొందుచున్నది గావున
చింతాభరంబుడుఁగఁ జేయ నివ్వనాంతరంబునఁజరియింతమని యత్యంత
వసంత సౌభాగ్యసంపద్విలసితంబై యొప్పారు నవ్వనంబునకు నవ్వ
నిందోడ్కొనిచని యందొక్క యిందీవరసుందరాలక మెల్లన హల్లక
పాణితో నిట్లనియె॥ 193

* గంగకుఁ జెలికత్తెలు విరహతాపంబుడుప వనంబున విహరించుట. *

సీ॥ నందీప్తకాంచనచ్ఛాయాచ్ఛటలతోడ
రమణీయకలకంఠరవముతోడ
ఘనతర వారణహాన నమధ్యముతోడ
నవఘనసార గంధములతోడ
కమనీయతిలకరేఖావిశేషముతోడ
నలలితపృథుల కుచములతోడ
బంధురసిత లసద్భ్రమరకంబులతోడ
విమలశృంగార పత్రములతోడ

నంబరావరణోరు లీలా ప్తితోడ
సరసనిర్మల దంతసుందరతతోడ
తనరెజవ్వనిఁబోలి యవ్వనముకంటె
చంద్రమండలసంకాశ చారువదన!॥ 194

వ॥ మఱియును.

సీ॥ ఘనశీతకర శీతకరశిలావాలభా
సురసాలసురసాల సుందరంబు
తతమహోత్పల మహోత్పల భూరిరాజీవ
రాజీవిరాజిత రమ్యసరసి
కేసరకేసరకేసర స్ఫురితంబు
తరుణకదంబ కదంబకంబు
మందారమందార కుందామ్లకలితంబు
కాంచన కాంచనాభ్యంచితంబు
దంతశఠదంతశరసుకాంతస్థలంబు
రమ్యకలకంఠ కలకంఠరావయుతము
నగుచు నారామమెంతయు నలరెఁగంటె
అబ్జవరపత్రజైత్ర కర్ణాంతనేత్ర! ॥ 195

తే॥ కాంచనస్యందన స్థితిగాంచిమాపు
తెలమినొప్పారి పున్నాగములు చెలంగి
చిత్రకరవీరతరులు ప్రసిద్ధిమెఱసి
పట్టణముఁబోలె నవ్వనిపద్మగంధి ॥ 196

మఱియును, 197

సీ॥ పన్నిటివాఁకలు బలుసూవిమోకలు
చిత్తరుబొమ్మ లీక్షింపవమ్మ
కపురంపుదీవులు కన్నె మేలోఁకువులు
సూటిముద్దులగుమ్మ చూడవమ్మ

కెందమ్మిబావులు కందవుఁమావులు
ఘనలీలనోయమ్మ కనఁగదమ్మ
కాసినపూగముల్ పూసిననాగముల్
మించి చక్కనికొమ్మ కాంచితమ్మ
కొండగోఁగులు గోఁగులుగొప్పవైన
గంగరావులు రావులుగదిసియున్న
బొండుమల్లెలు మల్లెలు పూవుబోణి
దాడినిమ్మలు నిమ్మలు చూడవమ్మ! 198

చ॥ సరవిశిఖండచిత్రకర చంద్రకళాభరణప్రశస్తిచేఁ
గరముఁదలిర్చి రాజితనగస్థితిభాసురకాళికాప్రమో
దరసనిగుంభనప్రచురతాండవలీల నెసంగెనిచ్చటన్
స్థిరమతినీలకంఠ వితతిన్ గనుఁగొంటె మరాళగామినీ! 199

క॥ లలినేత్రరాగలీలా।కలితంబై మధువిలోలగతిపంచమసం
కులరవమునఁదగె నీవిటగలకంఠవితతిచూడఁగదె కలకంఠీ! ॥ 100

మ॥ కలితక్రోధరసంబు ముక్కులనెసంగన్ బక్షపాతంబులన్
ఫలభంగంబును జేయుచున్నదిదలిపర్ణం గొమ్మలం జెంది యీ
చిలుకల్ మాధవసేవనానుకలితాక్షీణప్రభావాప్తినో
కలికీ! చూడుశుకాఖ్యగాంచె, భగవత్కైంకర్యముల్ వ్యర్థమే॥

వ॥ అని పలికి పరిహాసంబుగా మఱియు నిట్లనియె॥ 102

సీ॥ "ఓకొమ్మ! వీక్షింపుమాకొమ్మ పల్లవ
రాగజృంభణగతిరహివహించె
ఓరామ! చూచితే యారామభూమి భు
జంగసంగతయయి రంగుమీఱె
ఓశ్యామ! కనుఁగొంటె యాశ్యామబహువిట
పాయాఢ్యవైఖరి నతిశయిల్లె

ఓకలకంఠి! కస్నికలకంఠితా
సన్యపున్నాగవాంఛాప్తిగనియె
అలర నోప్రమదామణి! యామదాళిఁ
గాంచితివె చారుమధుపానకలితయయ్యొ
అనుచుఁ దగ నర్మగర్భలీలాతిచతుర
వచనరచనలఁ జెప్పె నవ్వనరుహాక్షి॥ 103

వ॥ మఱియు నొక్క మనోహరాంగి గంగాకురంగనయనాంతరంగంబునం దురంగలించు దురంతసంతాపం బుడుగఁ జేయుటకై చేయెత్తి యిట్లనియె॥ 104

సీ॥ కన్నెరో! చూచితే పొన్నగున్నలదండ
రేవమీఱిన రావి క్రోవిమావి
గరితరో! చూచితే గరుగులమరుఁగులఁ
జాలవ్రాలినపూల రేలపాల
కొమ్మరో! చూచితే గొప్పయిప్పల క్రేవ
లేగాలివడినూఁగు గోఁగు రేఁగు
చెలువ! చూచితె తేనెచెఱువులపొరువుల
నుద్దిగన్నడు కొద్దిమద్ది వద్ది
ముదితరో! చూచితే యల్ల మొల్లలెల్ల
తరుణిరో! చూచితే కోగెతాడి మేడి
చానరో! చూచితే నెమ్మిజమ్మినెమ్మి
పొలఁతిరో! చూచితే వీఁక పోకమూక॥ 105

ఉ॥ ఈ యలతేటిమొత్తములు నీ మదకీరమయూరపంక్తు లీ
కోయిలపిండు హా కుసుమకోమలి! నీ నెఱికప్పువెండ్రుకల్
నీయలరారుపల్కులును నీగమనంబును నీమెలుంగు దాఁ
బాయక మెచ్చులీల ననవాయరవంబున మీఱెఁ గంటివే॥ 106

వ॥ అని బహుప్రకారంబులఁ బొందుపడ నిందీవరాక్షు లయ్యుం

దిందిరాలకాతిలకంబున కింపుపుట్టినట్టు లయ్యారామసీమంగలుగు విశేషంబులు చతురవచనరచనాచమత్కారంబులఁ దెలుపుచు విహారణతత్పరలై వచ్చివచ్చి విశాలరసాలసాలములూ లేందుకాంతాలనాళోద్గతాభ్యర్ణ సలిలసూత్ర చిత్రజలశీకర పరంపరలం గాంచి బిత్తరంపుఁ గ్రొత్తముత్తియమ్ములని కొన్ని చిన్ని పన్నిదంబులు చఱవంజూచు ముగ్ధలగు చేడియలం గాంచి ప్రౌఢతనంబున ముకురువెనురుల మొదళ్లఁ దొరఁగిన గొప్ప సుప్పాణిముత్తియమ్ములు కెందమ్ములచఁ దమ్ములనందమ్ములుగల ప్రశస్తహస్తపుటమ్ములం దెచ్చినఁ గురువిందబృందమ్ము లందురని తెలిచేలముల వలుదచెఱంగులం గొని తెచ్చి సందేహంబు వారించుచు, కేళికాదీర్ఘికావీచికామాలికాడోలికావిలోలకలహంసబాలికాపాళికలం గాంచి వంచించిపట్టం దలంచుచు, పండ్లగుత్తుల మొత్తమ్ములు చిత్తమ్ముల కింపుసేయ ద్రాక్షపందిళ్లసందులం దూఱిమూచుచు అందంబులై సందులేక పొందుగలుగు బండిగురువిందతీఁగె చప్పరమ్ములపై ముప్పిరినల్లుకొనిన మొల్లతీఁగియలం గాంచి యురుదందుచు, పూగంబులఁ గాంచుచు, నాగంబుల నెంచుచు, వకుళంబుల డాయుచు, ముకుళమ్ములఁ గోయుచు, లుంగంబుల నెనయుచుఁ, దుంగంబులఁ దనియుచు, సాలమ్ముల మీఱుచుఁ, దాలమ్ములఁ గేలుచు బహుప్రకారంబుల విహరించి, మఱియును,

సీ॥ కన్నె మావుల ప్రేలు సన్నంపునునుదీఁగె
తూఁగుటుయ్యాలల నూఁగియూఁగి
తేటికోటుల మేటిపాటల వాటమా
పూపొదరిండ్లపై మూఁగిమూఁగి
నెలరాదోసల మంచుచిలుకు గొజ్జఁగిపొదల్
శౌగుగా తమవశి యూఁగియూఁగి
బోరున నెడలేక పాఱడివిరి తేనె
వాఁగుల చెంతల డాఁగిడాఁగి
కప్పురపనంటిచెంగట నొప్పుమీఱు
బండిగురువిందతీఁగె చప్పరములందు

నెడ తెగని చల్లనీడల కేగియేగి
కోర్కెఁ గ్రీడించి రింతులు కొంద ఱెలమి॥ 108

సీ॥ ఒకపక్వబింబోష్ఠి యొకకీరసల్లాప
నోఁగూడి రాగాప్తి నుత్సహించె
ఒక నవ్యబిసబాహ యొకహంసగామిని
నొనఁగూడి కైదండ యొగి ధరించె
ఒక మహోత్పలగంధి యొక హస్తిహస్తోరు
నోఁగూడి సామోదమునఁ జెలంగె
ఒకచక్రవక్షోజ యొకచంద్రబింబాస్య
నొనఁగూడి సరససంయుక్తిఁగాంచె

గీ॥ క్రమతరసాంకవామోదఘనఘనాఘ
నాంచితాలకబృందసింహావలగ్న
లలితఫణిరాజరోమాళిలతలవలన
సాంద్రనిర్భృతి వనకేళి సలుపునపుడు॥ 109

సీ॥ కలకంఠియొక్కర్తు కన్నె కెందలిరాకు
గుజ్జుమావులను జేకొనికడంగ
లతకూనయొక్కర్తు వితతమంజుసకుంజ
సంచయంబుల నావరించుకొనఁగఁ
బద్మినియొక్కర్తు పరువంపువలపు క్రొ
వ్విరిదుమారము సారె ధరణిరాల్ప
అలరుకొమ్మయొకర్తు బలితంపుఁదావుల
మకరందధార లుత్సుకతఁ గ్రోల

గీ॥ అపుడొకగయాళి 'రామనామాంగుళీయ
కాబ్జశయలార! స్మరచంద్రహాసనత్క
టాక్షులా రాబ్జముఖులార! దక్షిణాని
లోరునిశ్వాసలార! పై నురుకుఁ'డనియె॥ 110

తే॥ క్రొత్తచెంగల్వచిమ్మన గ్రోవినిండఁ
బూవుదేనియనింపి నేర్పుమెయి నొక్క
సకియ గుత్తంపుగుబ్బలసందు దగులఁ
జిమ్మె నొకకొమ్మ యన్యలఁ జేరనరిగి॥ 111

ఉ॥ కోరుచు నొక్కకాంత చనుగొండలు నారకుఁ జౌకళింపఁగాఁ
బేరముపాటి యన్యలను బెన్బొదఁజొచ్చి పొసంగి ముష్టిచేఁ
గోరికెఁ బచ్చకప్పురము కొంచు వడింజని "మత్కరమ్మునం
దారయ నేమియున్నయది యంబుజనేత్రలు! తెల్పుఁ"డంచనన్
వారలు వేఱె యొక్క ఘనవస్తువు తెల్ప హసించె నెంతయున్॥ 112

క॥ ఈరీతి నాసఖీజనులా రామమునందు మిగుల నభిరామముగాఁ
గోరిక లీరికలెత్తఁగ భూరిస్థితిఁ గ్రీడసల్పి పొడమిన వేడ్కన్॥ 113

వ॥ పుష్పాపచయానురక్తిం దనరి తమలోన, 114

ఉ॥ "ఓకమలాభచారుముఖి! యోమదకీరవిలాసభాషిణీ!
యోకలకంఠి! యోరమణి! యోహరినీలవినీలకుంతలా!
యోకనకాంగి! యోసుదతి! యోమధురాధర! యోవిలాసినీ!
యోకలహంసయాన" యని యొండొరుఁ జీరుచు మీఱుచుబ్బుచున్॥

తే॥ "తరుణిరో! పూలనొప్పారెఁ దరువుఁగంటె
శ్యామరో! కోమలమ్ములౌ శ్యామ లివియె
కాంచనాంగిరో! యల్లవె కాంచనములు
కుందరదనరో! కనుఁగొంటె కుందములను॥ 115

రగడ॥ పొగడ పొగడఁగఁద(గదు)ముందటఁ బూవు పూవుంబోణిపట్టకు
నగకు నగకుచ! సన్నుఁ(గనుఁగొని)నాతి! నా తిలకంబుముట్టకు
మాటిమాటికి వాదమాడుటమాని మానిని! యుండుమిచ్చట
పాట పాటలగంధి! ముద్దుగఁ బాడి పాడిగఁ దెల్పు మచ్చట
లేమ లేమఱియుండ నేటికి లేమ! లే మఱి యిచట మొల్లలు
రామ! రా మదిరాక్షి పల్కులు రామరామ! తలంపఁ గల్లలు

ఈడ నీడను గంటినే నీ వేగి వేగను నెయుకు కామిని!
వేడు వేడుకమీరఁగాఁ గురువేరు వే ఋణమిచ్చు భామిని!
కోకఁ గోకనదాంఘ్రిపట్టినఁ గోయ కోయలి వేణి జాతులు
పోకు పోకు"మనంగ నేగిరి పొదలుపొదలఁ కనంగ నాతులు॥ 117

సీ॥ శ్రీరామనామోర్మి కారమ్యసంపత్తి
కలకంఠముల హాళాహాళులు మాన్చె
కమనీయసహజ సాంకవము దామోదంబు
చిలుకపంక్తుల నళాపళియఁగాంచె
కాంచనపుష్పప్రకాశ నాసాలక్ష్మి
గంటుతుమ్మెదల యోఘాఘుళము చెఱచె
నవమందహాస కందళిచంద్రికాభూతి
స్థలపద్మముల వికాసంబు గూల్చె
సురుచిరసుగంధబంధుర సుమగుళుచ్ఛ
పిచ్ఛిలాచ్ఛాచ్ఛమకరంద బిందుబృంద
సుందరారామవీథి నస్తోకలీల
సతులు పుష్పాపచయకేళి సలుపునపుడు॥ 118

సీ॥ సరసిజానన హస్తాంగత్వమున మావి
వనితపాదస్థితి వంజుళంబు
మృగరాజనిభమధ్య నగినఁ బొన్న ప్రఫుల్ల
జలజాక్షి మోమియ్యఁ జంపకంబు
మానినీమణి (గీత) మాధుర్యమునఫల
చేడియగుబ్బలఁ జేర్పఁదరఁటె
కలికి తేనియలొల్కు పలుకుపల్కఁగ గోఁగు
చెలువ నిట్టూర్పుచే సిందుకంబు
వనజరాగోష్ఠి యుమియంగ వకుళశాఖ
తెలుపకనువిచ్చిచూచినఁ దిలకతరువ

చేతనములయ్యెఁబుష్పవిభూతిఁదగ, స
చేతనులఁ బూరుషుల నింకఁ జెప్ప నేల॥ 119

తే॥ అపుడు తత్తత్కుజంబులనలరు నలరు
లలరుబోణులు(గోయంగ నచోటుఁ)బాసి
తెలివ దరిలేని సమ్మోహపరవశమునఁ
జెలులవిడనాడి యవ్వలఁ జేరనరిగి॥ 120

సీ॥ అండజధ్వజవహ్నికుండవిభ్రాంతినిఁ
గెందమ్మికొలఁకు వీక్షించిరుక్కి
కందర్పనిష్ఠుర ఖడ్గవిభ్రాంతిని
సహకారపల్లవచ్ఛటలకులికి
పంచాస్త్రకాహళార్భటులవిభ్రాంతినిఁ
గలికిచిల్కలపల్కు లాలయనళికి
దర్పక (తీవ్ర) కోదండవిభ్రాంతిని
శితగురుత్కల సముద్ధతికిసొలసి
వినుతసంకల్పజాస్థానవిభ్రమమునఁ
గుంజపుంజస్థలుల నిల్వఁగోర కెలమి
నతులితోత్కటపరితాప మతిశయిల్లఁ
జేయునది లేక యచ్చటఁ జిన్నవోయి॥ 121

వ॥ ఒక్కరోహిణీకాంతకాంత కాంతాసనాసీనయై తదూర్ధ్వభాగావృత లవలీలతావితానానూన వినిర్గతధారాళతుషారధారాశీకరపరంపరలు శంబరాసురాంతకజ్వరనివారణంబుగఁ బైఁబైఁజల్లుపన్నీరుగఁ బ్రాంత గంధగిరిబంధు గంధవహప్రేంఖీభూత రంభానోకహానేకాస్తోక పలాశంబులు వీచుచామరంబులుగఁ గలిగి యయత్నశిశిరకృత్యంబులు తదీయస్థలంబున సమకూరఁ గొంతతడవు విశ్రమింప నంతట నక్కాంత లక్కాంతంగానక యచ్చటచ్చటన్వెదకి యొక్కయెడం గూర్చున్న యానాతింగనుంగొని డాయనేతెంచి యిట్లనిరి.

ఉ॥ "అక్కటమమ్మ నొక్క క్షణమైనను బాయనిదాన విప్పుడీ
వక్కరొ! యొంటిరాఁదగునటమ్మ, తగన్ విరి తేనెకాల్వలీ
దిక్కున లెక్కలేక మఱి తెంపున నేగతిదాటితమ్మ, హా
యెక్కుడు పుష్పధూళి పథమెల్లను నిండిన దెట్లు పాదముల్
పొక్కఁగ నోర్చితమ్మ చెలి! పోలునె సాహసమిట్లొనర్పఁగన్"॥ 123

వ॥ అనిపలికి ప్రియవాక్యంబులఁ బుజ్జగించి మించుబోఁడిం దోడ్కొని, 124

క॥ వనకేళిభవాయాసము। వనకేళిం బాయునని యువారిణమధులి
ద్వనరాజద్వనజాకర। వనశీకరమిళిత శీతవాతములోలయన్॥ 125

క॥ పాఱుచు నయ్యాటల నొ
ప్పారుచు లవలీలతాగృహాంతస్స్థలముల్
దూరుచు రానిలతాంగుల
దూఱుచు మొగములనునగవు తొలుకఁగ నంతన్॥ 126

క॥ ఆళీతతి నాళీకము। ధూళీపరిమిళితపుష్పధూళీ మదహిం
దోళీ సుమరాళీ యుత। నాళీకారము గాంచి నందితలీలన్॥ 127

తే॥ "అబ్జచక్రాభ్యలంకృతంబగు చుఁదనరి
యతులిత కువలయామోదగతి నెసంగి
భువనములు గోన నొప్పారి పొలఁతులార!
కొలనుగనరమ్మ శ్రీహరి చెలువుఁదెలిపె॥ 128

వ॥ మఱియు నిప్పుండరీకాకరంబు కాంతారంబునుంబోలి విరాజమానపుండరీకంబై పుండరీకంబుకైవడి సదాభరితకువలయంబై కువలయబాంధవువైఖరి నితాంతాంతరసమాకలితలలితశంబరంబై శంబరవైరి చెలువున ననమశిలీముఖప్రకాశమానంబై యొప్పెఁ జూడుండు॥ 129

సీ॥ త్రైలోక్యమాతయైతనరారు నమ్మహా
పద్మముఁగౌతుకపద్మములివె

తోరంపుఁదలయేటిదారవ్రాటిమేటికిఁ
బాటిల్ల జయమిచ్చు బాణములివె
పలుకుతొయ్యలి నెలి నలుమోములొప్పు శే
జేపెద్దకును జన్మసీమలివియె
నీరు(పాల్విడఁదీయు) నేరుపుగన్న హం
సవతంసములకు భోజనములివియె
ఇవియొకనుగొనుఁడీమీర లింతులార!
పచ్చగుత్తాల నెఱరాతు కిచ్చమెచ్చు
వచ్చి కమలమ్ములనుబుట్టి వరలునట్టి
కమలములు, వీనిఁ గొనియాడఁగాఁ దరంబె॥ 130

మ॥ నిజజన్మాలయమౌ సరోజములకు న్మిత్రుండు మిత్రుండటం
చజహద్భానుసహస్రమిచ్చి తగ యాతాయాత గోషోడశం
బు జతేజారికొసంగెఁ దత్పగుఁడటం చుద్యత్కళాలీలఁ బ
ద్మజభాస్వద్రచనాచమత్కృతి తలంపం బకుపాతంబుగా॥ 131

తే॥ పసిఁడితమ్ములుభుజియించి భారతీశు
తేజులై మిత్రుపేరిటఁ దేజరిల్లి
పాలునీ రేర్చఁగా నేర్పుచాలఁగలిగి
మించుహంసములివెసూడి మెలఁతలార!"॥ 132

వ॥ అని కాసారతీరంబునం జేరి కొనియాడుచుండ, 133

సీ॥ తనరారె నెఱులుగాఁ దనలోని చాదుశై
వాలముల్ మత్తహిందోళములును
స్తనములఁగతిమీఱెఁ దనలోని చక్రవా
కకులమ్ములును బద్మముకుళములును
విలసిల్లెఁ గలికికన్నులలీలఁ దనలోని
యుత్పలమ్ములును నీలోత్పలములు
త(గెను) హాసశ్రీలఁ దనలోని దరవిభా
కాండమ్ముల్ ఫేనప్రకాండములును

బళిర! యేతద్గతి నెసంగి కొలను మిగులఁ
గనఁగఁదగియుండె నొక ప్రౌఢకన్యపగిది
కచకుచ ప్రేక్షణస్మిత రుచిరలగుచుఁ
దననువీక్షింపనే తెంచు తరుణులకును॥ 134

మ॥ రమణుల్ బంగరురంగు ప్రావఁతపని చేలల్ నేర్పుమై నూడ్చి క్రొం
జిలుగుంజందురు కావిపావడ లొగిం జెల్వొందఁగాఁ గట్టి హా
గలతాభల్ సడలించి యొండొరులు దోర్వ్యస్తోరుహస్తాబ్జులై
యలరారన్ నెలరాలమెట్లుఁ బదన్యాసంబు గావింపుచున్॥ 135

వ॥ మెల్లమెల్లనడిగ్గి, 136

క॥ "విషభవభవుఁ డమృతమును
విషామృతసమాఖ్యలొసఁగె వీనిని దలఁపన్
విషమనఁగా విషమంబగు
విషమముగా దమృతమనఁగ విషముఖులారా!"॥ 137

వ॥ అని యిత్తెఱంగున నమ్మత్తకాశినులయ్యంబుల సంభ్రమాయత్తచిత్తలై కొంతతడవు కొనియాడి,॥ 138

సీ॥ "కలకంఠకంఠితోఁ జలకమాడఁగఁబోకు
పల్లవపాణివి పణఁతి! నీవు
బాలేందుఫాలతోఁ నోలలాడఁగఁబోకు
పంకజనేత్రవు భామ! నీవు
ఇభరాజగమనతో నీఁదులాడఁగఁబోకు
రంభోరుకాండవు రమణి! నీవు
చంపకనాసతో సయ్యాటలాడకు
మత్తాళివేణివి మగువ నీవు
సంకుమదగంధితో నీవు సరసమాడఁ
బోకు చిలుకలకొలికివి పొలఁతి"యనుచు
నొండొరుల కేర్పరింపుచు నొప్పుమిగిలి
రంబుజాకరనీర విహారవేళ॥ 139

శా॥ కేలం దమ్మిఁ ఘటించి యొక్క మదిరాక్షీరత్న మవ్వేళఁ దా
శ్రీలక్ష్మింబలె నంగుమీఱె, నొకరాజీవాస్య బల్కొప్పునన్
లీలం గైరవమూని చందురుని మౌళిందాల్చెన్ మీఱు మా
వాలీకేతనభంగిఁ బెంపెసఁగెఁ గాంతాలోకమధ్యస్థలిన్॥ 140

తే॥ హారుఁజూవివి మానె నదియొక్క బిరుసు దలఁప
విషము నేఁ ద్రావుసానటంచు విస్మితముగ
వెలఁదియొక్కతె కరమున విషముఁబట్టి
యచ్యుతానంతగోవింద యనుచుఁ ద్రావె॥ 141

చ॥ కువలయవేణియోర్తు మెఱుఁగుల్ తగఁగుల్కెడి గొప్పకొప్పున
న్గువలయమేర్పడన్నిలుప గొబ్బుననిల్వక నీటిలోఁబడెన్
జవమునఁ దక్కచంబు తనసాటికిరా వడిఁదోఁచియు నాత్మసం
భవమహనీయసీమఁ దనభంగముదెల్పఁగఁ బడ్డకైవడిన్॥ 142

సీ॥ దరికెక్కి మెల్లన సరసిజాకరములోఁ
దొలఁగక గుభగుభ దుమికెనొర్తు
కలువరేకులఁ(దెంపి)మెలఁకువ నొకకాంత
కలికివిసులమీఁద నిలిపెనొర్తు
కెందమ్మిపుప్పొడి కేలఁదాలిచి యొక్క
సకియగుబ్బలమీఁదఁ జల్లెనొర్తు
నడినీటిలోఁదూకి నారులెల్లముజూడ
లీల నల్లంతటఁ దేలెనొర్తు
చెలువలకునెల్ల నుపమలు గఱపెనొర్తు
పంకజాళులఁగని యబ్రపడియెనొర్తు
ముగుదఁగనుగొని లేనవ్వునగియెనొర్తు
కుటిలకుంతలపై నీరుగుప్పెనొర్తు॥ 143

చ॥ వెలఁదియొకర్తు కొండమున వెల్లకిలంబడి యీఁద నప్పుడా
జలజదళాయతాక్షి జిగిచన్నులు చూడఁగనొప్పె మన్మథుం

డల రతి పంతమాడి జలజాకరపుష్కరమధ్యమంబునం
దలరుచుఁ జిత్రవైఖరుల నాడెడి బంగరు బొంగరాలనన్॥ 144

చ॥ ఘనకుచయోర్తు శోణమణికల్పితముద్రిక నీటిలోఁబడన్
ఘనకచనోర్తుఁగాంచి కరకంకణమిచ్చెద దీనిఁదెమ్మనన్
మునిఁగిజలాంతరస్థలిని ముద్రికయుండినఁ దెచ్చియీయ వే
వనకణమిచ్చెఁ గొమ్మనుచు వారిజనేత్రి విచిత్రమాడఁగాన్॥ 145

తే॥ కలికియొకర్తె పుండరీకంబు లీలఁ
గేలఁదాల్చినఁ దత్కరకిసలయారు
ణచ్ఛవిచ్ఛట లోఁగిఁ గ్రమ్మి నవ్యహల్ల
కాకృతిని గానఁబడ వెఱగందెనోర్తు॥ 146

క॥ ఏణాక్షీకుచలోచన। శోణితవరదేహమిళిత మంజుహరిద్రా
నూనాంజనగంధాప్తిఁ ద్రి। వేణీసంగమముభంగి వెసఁగొలనమరెన్॥

క॥ తామరలయుజగంధులు। తామరలనఖరఁగాంచి దారుణతాపో
దాగతఁ గ్రాఁగుచునుండిన। నూరకమనమిట్టులుంట యొప్పదటంచున్॥

సీ॥ గుజ్జుమావులదండ గొజ్జంగిపొదరిండ్ల
విరిమంచు బోరునఁ గురియుచోట
అల్లిబిల్లిగ మొల్లలల్లుక తగనిరుల్
గుప్పెడు కురువేరుచప్పరముల
నీడచల్వలుదేరు నెలరాలదోనలకై
యేతెంచుపూఁదేనె యేటికాల్వ
దరిని జల్వగు బండిగురువింద లేతీవె
చవికెలపజ్జ ద్రాక్షులుపొసంగఁ

బైఁబెనంగిన యనఁటికంబములపొంత
కలువకొలఁకులఁ గెలకులఁ దొలుకనలరు
తమ్మిశాపుల తావులుగ్రమ్మ సఖుమఁ
జంద్రకాంతవితర్దికాస్థలమునందు॥

తే॥ సారవిస్తారఘనఘనసార గంధ
సార కల్హార నీహార నీరపూర
సౌరభోద్గార చారుమందారవార
మధురమధురసములు దెచ్చి మసలకవుడు॥ 150

తే॥ చెలిమికత్తెలు పన్నీట జలకమార్చి
కనఁగనొప్పారు చలువలు గట్టనిచ్చి
పొసఁగఁ గర్పూరనామంబు నొసటదిద్ది
కొమరుచనుగవనడుమ హారము లమర్చి॥ 151

మఱియును 152

సీ॥ కుచముల బహుళ లికుచములంచనిమాని
ఘనసారమలదంగఁగడఁగి యొకర్తు
నేత్రముల్ శతపత్రపత్రములనిమాని
శీతోదకమునిల్పఁ జేరి యొకర్తు
చికురబంధము భృంగనికరమంచనిమాని
హేమదామముఁ జుట్టఁగి యొకర్తు
సకలాంగములు శిరీషసుమములనిమాని
వీవన వీవంగ (వెడలి) యొకర్తు
చందనామోద లిభ్యంగిఁ గొంద ఱెలమిఁ
బాలఁతి కుపచారమొనరింపఁబోయినంత
నరయనపచారమాచుండె ననుచు నూర
కున్న వారలఁ గనుగొని చెన్ను మిగిలి॥ 153

సీ॥ ఖరకరోదయముగాఁ గాశ్మీరపంకంబుఁ
జనుజక్కవలమొత్తెఁ జాన యొకర్తు
ఘనతమోగతిమీఱు మినుకుకాటుక రేఖ
కనుఁదోవలనదిద్దెఁ గలికి యొకర్తు
మకరందరసమొల్కు మందారదామంబు
కచభృంగతతిఁ జుట్టెఁ గాంత యొకర్తు

చలువలు వెదఁజల్లు మలయజసారంబు
తనువల్లికనలందెఁ దరుణియొర్తు
సముచితోపాయపరలగు చంద్రముఖులు
భూరిశిశిరోపచార శృంగారవిభవ
కలిత లలితప్రకాశ మాంగల్యవిధులు
సలిపిరప్పుడుకొందఱు చంద్రకటికి॥ 154

క॥ ఘనసారైలావరచం
దన లామజ్జక లవంగ నవసుమనోగం
ధ నిమేళిత హిమజల ము
వ్వనజాక్షికిఁ ద్రావనొసఁగి వనితలు మఱియున్॥ 155

తే॥ చెలఁగిగొజ్జంగినీరు పై జిలికిచిలికి
కప్పురంపుగవల్ నిండ గుప్పిగుప్పి
కమ్మతావులుగలవిరుల్ గప్పిగప్పి
పొసఁగసురటుల గాడ్పుగా విసరివిసరి॥ 156

వ॥ ఇవ్విధంబున శైత్యోదయంబునకై ప్రాణసఖులు సముచిత
శిశిరోపచారంబు లొనరించి రప్పుడు,॥ 157

తే॥ బాల కలఁదిన మలయజపంక మతుల
విరహపరితాపశిఖిశిఖోద్వృత్తి నుడికి
వడిఁ బెటిలి మించుబొడులనడిమి యొక్క
చెలియగుబ్బలపైఁబడ్డ నులికిపడియె॥ 158

క॥ నలినాక్షిహారములు గు
బ్బలసెగ సలసలనుగ్రాగి బహుళశ్రమంబో
యు లహరిఁ దుకతుక నుడుకుచు
నలవడుము గప్పెఁ గపుర మలఁదినలీలన్॥ 159

క॥ కలికిచనుదోయిపొంగున
బలితముగాబిగిసి రవిక పక్కునఁబగిలెన్

చిలుకపటాంశిక జీరుని
తలిరా కడిదంపువిసరు దాఁకెనసంగన్॥ 160

క॥ అమ్మక్క! భూరివిరహ భారమ్మునఁ గాంఢిమమునోహాకస్థితి మేనన్
గ్రమ్మకొనినవెన్నెల కీల్బొమ్మయనఁగనవుడు పువ్వుబోఁడి చెలంగన్

వ॥ అయ్యెడఁ బువ్వుబోఁడిం బువ్వుబోఁణులు తప్పకచూచి శిశిరో
పచారంబునఁ దదీయపరితాపంబు పాయకుండుటయెఱింగి, 161

తే॥ మానవతులంతఁ గేతకీసూనగర్భ
దళమునఁ దుషారజలకణమిశ్రితలలిత
ఘనమృగీమద కర్దమమున లిఖించి
రతులనుకుమారు మారు శ్రీహరికుమారు॥ 162

* చెలికత్తెలు మన్మథునిరూపు లిఖించి పూజించి స్తుతించుట. *

సీ॥ దాపలికరమునఁ దరుణిసింగి శివిల్లు
వలపలికరమున నలరుశరము
అంకపీఠమ్మున నలరారురతిదేవి
వెనుకదిక్కునఁ బ్రభంజనకిశోర
మెసఁగఁ గోపుల వసంతసుధామయూఖుల
ముంగలఁ గలకంఠభృంగకీర
శారికారాజహంసప్రముఖోదార
బలసమూహంబుల విలసితముగ

పారసాత్తులు మన్మథస్వామి పదవి
మొగలిపూరేకున లిఖించి ముదముపొసఁగ
వరపదార్థము లొగిఁ గొనివచ్చి సమిచి
శోపచారంబులను బూజ లొప్పఁజేసి॥ 163

మత్తే॥ శ్రీను తున్నధావారాశిరాట్కన్యకా గర్భపయఃపారావార
శిరత్నంపూర్ణపూరిమ్నా శర్వరీరమణోదయాయ, రతియువతీ
మోహంగక రస్థలవిన్యస్త ప్రశస్తామోద నిస్తులకస్తూరికా కుం

కుసుమసంకుమదపంక మకరికాపత్త్రచిత్ర లక్షణలక్షిత దోర్మధ్య
మధ్యప్రదేశాయ, మధురమధుర పారణపరాయణ విభ్రమద్భ్రమ
రపుంజసింజినీటంకార ఘోషవిభూషితాఖండమండలీకృతప్రచండ
పుండ్రకోదండనిర్ముక్త ప్రఫుల్లమల్లికాశోకారవిందేందీవరమా
కందప్రసూన భల్లభగ్న హరిహరచతుర్ముఖ ముఖనిఖిలలేఖసము
దయాంతరంగాయ, శాంబరీకదంబాడంబరోజ్జృంభమాణ
శంబరాసురాఖర్వదుర్వారగర్వపర్వత గీర్వాణవల్లభాయ, పాఠీ
నధ్వజాయ, చైత్రసఖాయ, మన్మథాయ తుభ్యంనమః,, 164
వ॥ అని బహుప్రకారంబుల వినుతించుచుండి రంత. 165

## సూర్యాస్తమయవర్ణన

తే॥ అంచిత రజోరుణావరణాప్తిఁ దనరు
పద్మినీకరప్రకాశత బయలుపఱచి
రవి సహస్రంగము మొనర్చి ప్రత్యవాయ
మిగుర భృగుపాత మొందిన ట్లెనఁగఁ గ్రుంకె॥ 166

తే॥ విమలకమలాధినాథది క్కమలవదన
యినసమాగమమున రాగ మినతఁగనియె
ఇనసమాగమమున రాగఘనతఁగనుట
కమలనేత్రల కుచితంబుగాదె ధరను॥ 167

మ॥ సముయద్వేషికి నోహటించి యినుఁ డస్తక్షోణిభృన్మౌళిధా
మముఁ జేరంగని యిందిరారమణి యాత్మస్వామి తాదృగ్విధా
క్రమణోదాత్తుఁడటంచు లోఁ దెలిసి వీఁకన్ స్వాలయోద్యత్కవా
టము లొక్కుమ్మడి వేసెనాఁగ ముఖముద్రల్ దాల్చెఁబద్మావళుల్॥

చ॥ ఖరకరుఁ డస్తమింప నతిగాఢసమగ్రవిషాదయుక్తిఁ బు
ష్కరిణి వినీలభూరివిషసారకృతాంచితమాత్ర లుజ్జ్వల
స్థిరగతితోన వక్త్రములఁ జేర్చినవైఖరి డింభకాళినో
సరసిజకుట్మలాంతర నిశాంతములన్ వసియించెఁ దుమ్మెదల్॥ 169

క॥ జలజాకరసంకేత
స్థలమున మత్ప్రియుని రాజు సాంద్రకళాసం
కలితుని బొందెదనని లోఁ
గలకలనఁగెఁ గలువ చెలువు గనుపట్టఁగన్॥ 170

సీ॥ సురసుందరులు లేఖతరుపుష్పధూళిచే
గూర్చిన వెన్నెలకుప్పలనఁగ
తారాపథాతివిస్తారకేదారాంత
రంబున నొప్పు కైరవములనఁగ
సమయకుందక్షమాజాతాగ్రవిభ్రాజ
మానప్రసూనకుట్మలములనఁగ
గోత్రభిచ్ఛుండాల గురుపుష్కరోద్ధూత
గగనధునీక్షీరకణములనఁగ

అధ్వగానూనమానాపహప్రయత్న
కీరఘోటకరతిశుభాకీర్ణమౌక్తి
కములనఁగ బ్రహ్మమర్త్యులగణుతికెక్కి
తళుకుసున్నంపుబొట్లనఁ దారలలరె॥ 171

ఉ॥ రంజితలీల సాంద్రతిమిరంబు పొసంగె దిగంతరంబులన్
గుంజర చంచరీక శతకోటిధరాశ్మ ఘనాఘనార్కభూ
ఖంజన పత్త్రిపత్త్రిరథ కంధరవర్త్మ సుధామయూఖల
క్ష్మాంజన కాలకాలగళ హాలహలాభ విభాసమానమై॥ 172

తే॥ ఇక్షుకోదండధరుఁడు సమిద్ధశక్తి
విరహిజనములపై దండువెడల నెత్తు
నీలిడేరావిధంబున నిబిడకాంతి
నంధతమసంబు జగమెల్ల నాక్రమించె॥ 173

తే॥ అమరనిమ్నగ స్వర్లోకమాక్రమించె
నాత్మభూరిప్రభావత నవనిభువన
మాక్రమించెద నేనని యమున నిండు
కొనినకై వడి చీఁకటుల్ మొనసెదిశల. 174

తే॥ నిర్మలదిశానుభూతసస్నేహవిభవ
కలితభూరి తమోనిరాకరణసుప్ర
భావములఁ గులదీపముల్ పరఁగెఁజాల
నోజఁ గులదీపములకిది నైజమెకద. 175

సీ॥ ఘనపయోధరపూర్ణ కలశాంతరములకు
రమణీయ నీలహారములుగాఁగ
శకలితశశిబింబ చారుఫాలములకుఁ
గస్తూరికా తిలకములుగాఁగ
సచిరరుక్ప్రచుర సద్రుచిరాంగకములకు
లాలితాసిత నిచోళములుగాఁగ
శతపత్రవరపత్ర జైత్రాంబకములకుఁ
గజ్జలసార పంకములుగాఁగ
నీలకబరీభరముల కిందీవరప్ర
ధామములుగాఁగగాఢ సంతమసవిభవ
మభినవాలంక్రియలొసంగ నవుసుజార
కీరవాణులుచనిరి సంకేతములకు. 176

మ॥ చరణన్యాసముగూఢమైయలర రాజద్వ(ల్గు)లీలాగతు
ల్చెరయన్ మెల్లననిల్చినిల్చిరొాద లోలింబొంచియాలించుచు
న్నిరముల్ వంచుకనందులందణఁగుచున్ నిద్రారతిఁజారులే
గిరితద్వేశభుజంగసంజ్ఞతగి సంకేతస్థలుల్ చేరఁగన్. 177

సీ॥ క(రరు)హరేఖలు గనుపట్టకుండమే
ల్కొమరుచన్నులుక్రేళ్ళ నిమురుమనుచు

పలుకెంపులెలమి నేర్పడకుండసొంపుమై
సధరామృతంబును నానుమనుచు
మందాక్షరములుగా మణితముల్ మెల్లనఁ
జెలువంపువీనులఁ జేర్పుమనుచు
ఘననితంబాఘాత నినదముల్ ప్రకటంబు
గాకుండఁదిన్నగఁ గలయుమనుచు
జారిణీతతిసంకేత సదనమదన
కదనసమయ (సముత్సాహ) గాఢరూఢ
చటులసంరంభగంభీర జారకోటిఁ
బలుకుఁదమజాడపరుల కేర్పడకయుండ॥ 178

క౦॥ అంత శచీకాంతదిశా। కాంత నిశాకాంతపూర్ణగర్భాంతరమై
వింతహరువొందమోమున। తాం తేరవిభవలీలధవళిమదోఁచెన్॥ 179

వ॥ అయ్యెడ 180

ఉ॥ తమ్ములపాలిగొంగ కుసుదమ్ములచక్కిలిగింత చక్రవా
కమ్ములగుండెతల్లడము కైటభవైరిమఱంది దేవ బృం
దమ్ములపారణమ్ము హరినందనుకూరిమిమామ యచ్చకో
రమ్ములజీవనౌషధము రాజుదయించెను దూర్పుదిక్కునన్॥ 181

సీ॥ సౌగంధికానవాభోగసంపత్కారి
తోయజశ్రీపశ్యతోహరుండు
మంజుజీవంజీవ సంజీవనౌషధం
బంధకారసమిత్కబంధయోని
జారచోరచ్ఛటా సంభ్రమప్రతిపాది
మదవిహంగరథాంగ హృదయభేది
పటుమహానటజటాపటలస్ఫుటసుమంబు
స్మరశౌర్యహుతవహ సామిధేని

పాంధసంతాన మానశంబరనిధాన
మధనమంథానశిఖరి రమాహృదీశ
సత్యనేత్రాంగ ముకుళకళాజననసీమ
చందమామ వెలింగెఁ బ్రాక్శైలమందు ॥ 182

వ॥ అయ్యవసరంబున 183

తే॥ వసదమార్గంబు పెంపారె వనముభంగి
తారకంబులువిలసిల్లెఁ గోరకముల
విమలగతి రాజమానమై కమలవైరి
బింబ మొప్పారె వికచపుష్పం బనంగ. 184

సీ॥ సకలపదార్థౌఘసద్గ్రంధటీక చ
క్రశ్రీమృణాళికా రాజహంసి
నిర్ధనికక్రియా నిశ్చలదీపిక
స్మరశౌర్యహావ్యభుక్సామిధేని
జారచోరచ్ఛటాచరణవల్లిమతల్లి
పాంధదవారణ్యపరశుధార
తప్తచకోరకాధ్వన్యప్రపాసీమ
దంపతినిధువనతంత్రఘుటిక
భూరిశీతలసార కర్పూరకదళి
తోయజవికాసవిద్యాప్రదోష వేళ
భవ్యకైరవహార్దాబ్ధి పౌర్ణమాసి
పండువెన్నెల కన్నులపండువయ్యె. 185

వ॥ వెండియుఁ బుండరీకశాత్రవమండలంబున నఖండంబుగఁ బ్రభవించుపండు వెన్నెలచండ మహోద్దండాఖండలశుండాలశుండాదండోద్భూత రంగ ద్వియద్గంగాతరంగిణీ సముత్తుంగతరంగపుష్కరపూరంబు వైఖరి, మేఘద్వారఘనసారరసాజాతసంజాతరజః పటలంబుపోలువున, నంధకారజగద్బాంధవకుమారికాప్రభేదనసమయ పూర్వగీర్వాణాభి

యాత్యుగ్రజాతవిగ్రహ ప్రభాపుంజంబు చందఁబున, సుధాధామసంద ర్శనామందకౌతూహలాభ్రంక షోద్వేలాయాత పయఃపారావార వీచికాసంఘాతంబుభాతి, నాళీకప్రభూతకలాద బ్రహ్మాండకరండసాంద్రీ కృత కలధౌతమయనీరపూరంబుక్రియ, లోకంబులెల్లనిండి ప్రథమధరా ధరాధిత్యకాభాగాభోగ సుందరలతా మందిరాళింద కేళీవిహారణపరా యణ పుళిందమిళిందాలకాలోక ధమ్మిల్ల వేల్లనాతిఫుల్ల కౌత్ఫుల్లవనమల్లి కలకు నల్లిబిల్లియై వారలోకానోకకాలంబునఁదమకు నాటపట్టులగుసవిధ వివిధపర్ణకుటీరమ్ముల గండకండూభరమ్ములుదీఱ నొరసికొని కాండవి హారంబునకై గండుమెఱసి నడగొండలవడువున బారులుతీరి సెలయేరు లకేగు భద్రవేదండ వరాహప్రకాండమ్ములరాకలుఁ దదఖండపుండరీక భవాండభాండపిచండిల చండఘీంకారఘుర్ఘురనిర్ఘోషంబుల నెఱింగి యమర్షోత్కర్షమ్ముల మృదుతరకరకాండజాతమ్ములఁ గోదండమ్ము లెక్కిడి సంవర్తపుష్కలావర్తజీమూతసంఘాతస్ఫురితనిర్ఘాత చ్ఛటా ఘోరంబులగు శబ్దభేదిశరానారంబు లపారసారవిచిత్ర నిపుణతాధౌరే యంబులుకన్పడఁ దొరఁగించి వేత్రదండఖండనాపూర్వకంబుగాఁ దదీ యకుంభత్కుంభవిషాణనిర్దళనంబుగావించినఁ బెల్లుగా జల్లుజల్లునరా లు చిత్తరంపుఁ గ్రొత్తముత్తియంపురాలతోఁ బొత్తువాత్తించి గుహా కుహరముహుర్ముహురుత్సాహ నర్మనిగూహనాన్యోన్యాన్వేషణ క్రియాస్తంభనంబులుసంభవించిన బహిర్నిర్గతలై తమలోఁ బొఁచెం బు లేనిమచ్చికల నిచ్చలు రచ్చలుసేయు మెచ్చువచ్చు నచ్చ ఎచ్చరా లచ్చటచ్చటనమర్చిన మృగాంకశిలావితర్దికావిటంకంబుల నకలంకవి లాసంబుల నాసీనలై నిరంకుశఝషాంక బిరుదాంకపంకలితహృదయం గమాభంగ మాంగళ్యశృంగారరసతరంగ రంగత్సంగీతభంగులం జెలం గు నయ్యారంగులచెఱంగులు కరంగి తెలినీరు జలజలనుదొరఁగ మదీ యు హృద్యానవద్య గానవిద్యావిశేషంబుల ద్రుతంబులయ్యెనని ప్రాణ వల్లభుల నుల్లసంబులాను ముగుదలగు యతుపత్కులాత్ముల నిగనిగనివగ

జిగిబిగివెలితోఁగతెగల మిగులనగునగవ్రులీను కటాక్షవీక్షాప్రకాశధాళధళ్యప్రభాఘట్టంబునకుఁ జుట్టంబై నిర్నిరోధంబగుతారాపథఘంటాపథంబున నష్టాపదప్రభాభాసమానంబులగు విమానంబులెక్కి యక్షుల్లకోల్లోలకల్లోలహల్లీసకసల్లలిత వియత్కల్లోలినీమతల్లికోత్ఫుల్లహల్లకవనీసదనంబుల మదనకదనంబుల సదమదంబులై ముదము లేదలఁబోదల విహరించు వళక్షుపక్షమిథున పక్షవిక్షేపణసముద్భూత శీతవాతపోతమ్ముల బడలికలెడల వేడుకకాండ్రిఁగూడిక్రీడించు ప్రోడలగు తెరగంటితెలిగంటిమిన్నల చెన్నుగల కడవన్నెగుబ్బలియబ్బగెబ్బగబ్బిసిబ్బెంపు నిబ్బరంపుగుబ్బల నందందఁ దనరు వెలయెక్కుడుమగరాలసరులసిరులతోఁ బోరలులేనిమరులున ననంగిపెనంగి క్షీరనీరనిధానాంతర నిరంతరానంత కాంతిదంతురానూన ఫేనసాంద్రచంద్రశిలాచంద్రశాలాప్రదేశఖేలా విహారలీలాలోలకీలాలబాలాజాలాంగకమ్ములకు సొమ్ములై చూపట్టు లేతమ్మితూఁడులకు సైదోడై, యేలాచామంతికా వాసంతికా మల్లికా వల్లికా మతల్లికా కేళికాడోలికామాలికలఁ గిన్నరబాలికాపాళికలతో జోడులుకూడి వేడుకల నూఁగియూఁగి చిత్తంబులఁ దృప్తింజెంది కంటివింటిదంట దిట్టతనంబునఁ గట్టాయితంబై తుంటవింట వెన్నంటు కంటకంబున నేయువిరిశరములెఱకలఁ జఱుకుచుఱుక్కునునాట నటనిలువనోపక సమీపమ్ములనిమ్ములై నిండారవిరిసిన బొండుమల్లియలఁ దండోపతండంబులుగా మెండుకొనిన గండుతుమ్మెదల గరుజ్జాతమరుజ్జాతమ్ముల సించుకకదలు పూవుపొదల నతాంతలతాంతకల్పితా నల్పతల్పభాగంబులనుల్లసిల్లు ప్రాణవల్లభుల నుల్లంబులఁ జల్లవింపంజేసి యా భోగానురాగంబులెచ్చు వాతెఱజుంటితేనియసంట మొనపంట సగంబుకొఱికి సొంపుమెఱయు నొసంగు కింపురుషచంపకామోదల చేతి తెలినాకుమడుపులవడువున బెడంగుగాంచి కేళీసౌధచంద్రశాలాంతర హంసతూలికాతల్పంబులం గూర్చుండి మధురమధురసమ్ములు తమకన్న నామ్రేడితంబులుగా

నొసంగి మదజృంభణంబులు రెట్టింప జంటముత్తియంపుఁ గుట్టుపనికంచు కంబులముల్లు సల్లించి ప్రతిమాలిన బయలుపడంజేయని యుబ్బురంపు గుబ్బచన్నులు చిసికివాడు కొనగోళ్ల గ్రుచ్చియు నివాఁడనని వేఁడుకొనిన మొనపంటనంటనీయని చక్కెరకెమ్మోవులు గంటులుగావించియుఁ బ్రార్థించిన నాదరంబునవినని శ్రవణపుటంబుల నిచ్చవచ్చినట్లు సచ్చెంబుగాఁ బచ్చిదేరుపలుకులు సొనిపియు నడుగులపయింబడి మ్రొక్కిన నించుకంతయు మెత్తపడినచిత్తంబులఁ బోఁకముడియొసంగని జిలుఁగు తెలిచల్వపైఠిణీవలువలు సడలించి యతిగాఢపాణిసధ్వజాయోధనమ్ములఁ గలంచియు మద్యంబాత్మప్రాణత్రాణపరాయణత్వంబు భజించె నాసవనామంబు దీనికిఁజెల్లు నని యుల్లంబుల సంతసిల్లు భుజంగులతో నెట్టకేలకు సొక్కుతక్క యలుకవొడమినచిత్తమ్ముల మొగమ్ములుత్రిప్పిమాటాడక యీతప్పుసైరింపుమని మందమందభాషణంబులుగాఁబలికి మ్రొక్కినఁ గరలి తాడనంబుగావించు లేఁబ్రాయంపు వెలమించుబోడుల చరణనఖరకాంతులపై దొంతరలుగొని దంభోళిధరకుంభినిశిఖరపయోధరీపయోధరరుచిరుచిరకచభరాబద్ధస్నిగ్ధసుందరమందారవికచప్రసూనమాలికలకుఁ బోలికలువాటించి వీతిహోత్రశతపత్రనేత్రీకర్ణపత్రవిచిత్రహీరగోపలచ్ఛవిచ్ఛటాప్రకాశంబులకుఁ బ్రతీకాశంబై కృతాంతశుద్ధాంతసీమంతినీకాంతసీమంతముక్తామణీరామణీయకంబులతో వియ్యంబుగైకొని రక్షోధ్యక్షుపక్ష్మలేక్షణాతిలకాళికఫలకఘనసారతిలకంబుతోఁ జెలువంబుఁబూని సింధునాయకనాయికావతంసకర్ణావతంసకైరవప్రభాళులతో మేలంబువాటించి గంధవహగంధసింధురగామినీగంధసారచర్చావిలాసంబుతో సౌమనస్యంబుప్రకటించి రాజరాజానరోధరాజముఖీకరాంభోజరాజన్మణిముకురబింబంబునకుఁ బ్రతిబింబంబై యంతకాంతకాంతఃపురకాంతామణికుచోపరిఘటిత ధవళచేలాంచల కంచుకంబులతోఁదుల దూఁగిసర్వసర్వంసహాధరంబులకు శర్వాసర్వంసహాధర విభవంబు భసంబునొందించి

సర్వద్వీపంబులకు శ్వేతద్వీపత్వంబు ఘటించి సర్వయోషాజనంబులకు భాషాయోషా విశేషంబుఁ జెందించి యొప్పారె, అప్పు డప్పేను రేయొం డతాఁకున కోర్వక బెంకుపడి గుండియ చెదరియున్న యయ్యండజపరి వృషధ్వజకుమారిం గనుంగొని మెఱుఁగుబోడుల కలకలంబు వారించి యొక్క ప్రోడయగు కురంగనయన సారంగాంకు దిక్కు మొగంబై విన యవినయవాక్యంబుల నిట్లనియె, 186

— * చంద్రదూషణ * —

సీ॥ "ద్విజరాజవయ్యు నందీప్తశుచిస్ఫూర్తి
సరసకళావిలాసంబుగంటి
గురులీల సర్వజ్ఞవరశిఖామణివయ్యు
విగతతమోగుణవిఖ్యాతిగంటి
అనుపమభవ్యలక్షణలక్షితుఁడవయ్యుఁ
బంకజాతవిదూరపదవిగంటి
సన్మార్గసంచారచారుశీలుఁడవయ్యుఁ
గువలయాకలితవైభవముగంటి
అహహా! యిటువంటిఘనుఁడవై యనపరాధి
నబల దుఃఖింపఁజేయుట న్యాయమటర
నయతఁ "బాపాయ పరపీడనం" బటన్న
సరసవచనంబు మఱచితే చందమామ! 187

సీ॥ విలసితశ్రీవత్స కలితాభ్యుదయమొంది
యరిధరకరలీల నందగించి
సారంగరక్షణోజ్జ్వలవిభూతివహించి
బుధగురువైభవస్ఫూర్తిగాంచి
అతులితలక్షణాంచితవిశేషముఁ బూని
నీలాంబరవిహారనియతిదాల్చి

అర్జునవరవిగ్రహస్థితి నెసఁగి స
ద్బృందావనమనోజ్ఞవృత్తిఁ జెలఁగి
విధుఁడవై యించుకయును సాత్త్వికము లేక
అకట! దాక్షాయణీప్రియువ్యాప్తిఁ బూని
సోమవిఖ్యాతిఁ జెంది తమోమయాత్మ
కుఁడవుగా నేలచంద్ర! సద్గుణమెపూను. 188

తే॥ మకరకేతనుపైఁ గృప మరలకుండు
టల్లుఁడని కాదె, మాచెలి యరసిచూడ
ననుఁగుకోడలు నీకగు, నకట! యింత
నిర్దయత నేచఁ బాడియే నీరజారి! 189

క॥ హరిణాంక! ముగుద నయ్యో!
హరిహరి! హింసింపఁజూచు టదిధర్మము గా
దెఱుఁగవె యాత్మ "నహింసా
పరమోధర్మ"యనుపలుకు ప్రాజ్ఞులుపలుకన్॥ 190

వ॥ అనిపలికి కలికికలువలచెలి కానివలన లలనవలవంత యావం
తయు శాంతిగాకుండుటయెఱింగి యంతరంగంబునం దురంగలించు
రోషావేశంబున నుపాలంభంబుగా నిట్లనియె॥ 191

ఉ॥ వల్లదమాడెనే భువనబాంధవుఁ జోక నెసంగియున్న నీ
కల్లవియోగులందు జలజారి! విరోధము వీడలేదు మేల్
తొల్లిఁటినీదునై జమది దూరముగాఁ జన నెట్టునేర్చు, హా!
పుల్లలతోడఁగాక తగఁ బుట్టిననాఁటిగుణంబుపోవునే॥ 192

మ॥ స్ఫుటపాదైకగతిన్ మహానటజటాజూటాటవీవాటిలోఁ
బటుఫాలానలభీమధూమపటలీ పానంబుగావింపు చు
త్కటగంగాతటినీసమీపమునఁ జంద్రా! బాల్యమందే తపం
బటుగావింపవె కామినీహననకార్యాకాంక్షివై ధీరతన్॥ 193

తే॥ చంద్ర! జైవాతృకౌషధీశ్వరసుధాక
రప్రముఖనామములు నీకు బ్రహ్మ పొసఁగ
నొసఁగె నొసఁగెఁ దదర్థంబు లుర్వియందు
రసికు లెన్నిన నేతిబీరపసరుగాదె॥ 194

తే॥ అమృతకరుఁడనిజగతి ని న్నాదికవులు
సరసచతురతఁ బల్కిరి చందమామ!
ఆదివర్ణవిహీనమై యలరు నేసి
అదియ పాంథులపాలిటి కర్థమాను॥ 195

ఉ॥ శాపమొగిన్ గురుండిడినఁ జండభుజంగము పట్టి మ్రింగినన్
దాపసనాథపాంథవనితా జనతావినతాక్షి వారివా
హాపతితోర్ధ్వశోష్ణ సలిలాశని పాతమునన్ శశాంక! నీ
రూపమణంగకున్న యది రోహిణి మంగళసూత్ర మెట్టిదో॥ 196

ఉ॥ హాహరిణాంక! నిన్ హాలహలాభుని మ్రింగి హరింపలేక యా
రాహువు క్రమ్మఱన్ వెడలి రా వడిఁ గ్రక్కె, ననారతంబుగా
నాహరుఁ డెట్టు పొందుపడ నోఁదలఁ దాల్చెనొ తుంగభంగసం
దోహసమగ్రశైత్యగతి ద్యోధుని జూటమునందు నుంటనో॥ 197

తే॥ పద్మినీమిత్రుఁడుండఁగఁ బద్మవైరి
నిను గురుద్రోహిఁ గుటిలాత్ము నీచవర్తు
నుని ననాథాంగనాహింసకుని ధరించె
భూతపతి శీర్షమునఁ దనబుద్ధిపోనె॥ 198

సీ॥ బల్గప్పు నెమ్మేన శాయక యెసఁగుట
సాంకృతితోడ మిన్నంటియుంట
సరవి మధుప్రియసంగతిగాంచుట
పాంథజనమ్ముల బాధలిడుట
పగలైన దెల్వి గోల్పడి కానఁబడకుంట
నుగ్రశేఖరలీల నొప్పుగనుట

రాత్రి మహాహాద్వృత్తి రంజిల్లి మొలఁగుట
శంబరవర్ధనోజ్వలతగనుట
యెఱిఁగియుండియు నిన్న యో! పరను లెల్లఁ
గల్పిఁకో క్తినిమరుగిడి ఘనత నేమొ
పచ్చిబోయ నిజంబని పలుకకిలను
రాజటందురు తెలియంగరాను చంద్ర॥ 199

తే॥ ద్విజనయనజాత! ద్విజరాజ! ద్విజవిభూతి
యణఁచినందునఁబో పర్వదినములందు
ద్విజము ద్విజపాళిఁ బట్టి నీ తేజమణఁచు
కెంతచేసినవారికి నంతగాదె 200

తే॥ కలశవారాశి త్రిజగముల్ కాల్చునట్టి
కాలకూటంబుగనిక నెఁగ్రమ్మఱంగ
హాలహాలతుల్యుఁగామినీ హననునిన్ను
నీరజారాతి! తననిల్వునీరుగాను 121

తే॥ కలసి క్రీడించు జక్కవకవలను నెడఁ
బాపి తోఁబుట్టువుగృహంబు రూపుమాపి
మెలఁగ దోషాకరుండని పలుకఁదగదె
సభ్యవర్తననీకేడ చందమామ! 202

తే॥ లోనహరిణాఖ్యచే విషంబూనియుండి
పైఁబయిని జిల్గువెన్నెలఁ బర్వఁజేసె
దవు మృగాంక! గళంబునఁ దనరువిషము
రసన బెల్లంబుగాదె దుర్జనుల కెందు" 203

వ॥ అని పొంపుపడ నిందించిరవేణి చందమామను నిందించి,

—:మన్మథదూషణ:—

చ॥ చిగురుకటారు రాకొదమచిల్కలతేరు వియోగకోటికిఁ
దిగులొనరించుపేరు తగఁ దెల్లనివేలుపుతోడిపోరు మేల్

వగగలతీరు పుల్గులదళంబులసారు పొసంగఁగల్గు న
య్యగణితశౌర్యసారుఁ గమలాలయ గన్నకుమారు మారునిన్. 205

వ॥ ఉద్దేశించి గంభీరమమకార చమత్కారంబులు గనంబడు
వాక్యంబుల నిట్లనియె, 206

ఉ॥ "మార! రమావధూప్రియకుమార! లసత్సుకుమార! కీరతు
ఖార! నిశాతపంచశరకంపితపన్నగహార! భూరిదో
స్సార! వివేకహార! ఘనశౌర్యవిశోషితపాంథలోకవి
స్తార! యిటు ల్మహోగ్రగతి సారసనేత్రఁ గలంపఁ బాడియే॥ 207

ఉ॥ భీమపరాక్రమస్ఫురణ భీముని గెల్చినవాఁడవయ్యు నీ
కోమలి ముద్దరాలబల ఘోరలతాంతశిలీముఖంబు లా
హా! మదిగాడ నేయుటది న్యాయమె ధారుణి, రామరామ! యో
కాముఁడ! దోసపం డినుపకట్టులకోర్చునె యెన్నిచూచినన్॥ 208

ఆ॥ బాపుమదన! నీవు వాసిమై స్త్రీ బాల
గోల లీలఁ బూలకోల లేయఁ
బేర్మిఁబూనుటెల్ల బిచ్చుకమీఁద బ్ర
హ్మాస్త్రమేయఁబూను నట్లుకాదె॥ 209

తే॥ అన్నవై యుండి యయ్యయో! యాఁగుపడుచుఁ
దోడఁబుట్టువు నిబ్భంగి దుఃఖపఱచి
తిట్టుగుడుతురె మన్మథ! దీన నీకు
భూరికల్యాణవై భవస్ఫూర్తిగలదె॥ 210

చ॥ జలరుహబాణ! తావకనిశాతలతాంతశిలీముఖోజ్వల
జ్జ్వలనశిఖాప్రతాపమున జాహ్నవి నొంఁదలఁదాల్చి బూది మై
నలఁది పరేతభూమిగతుఁడై యటు తాళఁగఁజాల కాహలా
హలవిషమానె శంకరుఁడు హా! యిఁకనీదుప్రతాప మేమనన్"॥

వ॥ అని శశాంకముఖ మకరాంకు వేఁడుకొనిన నతండు ప్రస

న్నుండు కాకుండుటయెఱింగి యత్యంతరోష కషాయితనేత్రయై యిట్లనియె.॥ 112

మ॥ "జలధిశ్రాత్రిపత్రిప్రతులకు సంజాతిత్వముంగాంచుటన్
బలుబీజుండన నొప్పుచందురునితో బాంధవ్యముంగన్న నీ
కలుషుశ్రీగుణ మెట్లుకల్గు, నతఁ డాహా! కాల్చెఁ దోఁబుట్టువి
ల్లు, లయంబుం బొసఁగింపఁజూచితివిగా లోలాక్షి నీసోదరీ ॥ 213

సీ॥ మధుపగుణంబుచే మానునీకు జాతిఁబా
సినవానితోఁదగఁ జెలిమిగలిగె
తృణధర్మవృత్తిచేఁ బెనుపొందునీకు దో
షాకరసామనస్యంబుగలిగె
అసదృగున్నతవిగ్రహాస్థితిగలనీకు
గురువసప్రియబలస్ఫురణగలిగె
పాంథవిద్వేషివై పరఁగిననీకుఁ బ్ర
భంజనుండు బలాధిభర్తగలిగె
అకటకట శంబరారి! నిన్నాత్మనెఱిఁగి
వేదజడుఁడౌటఁ గాలినవృత్తికోర్చి
ధాత దుస్సహవాసంబు తగులుపఱచె
విరహిణీలోకదుర్దశాభరముగాదె॥ 214

చ॥ లలితనిజాత్మజారతికళాకలితాత్ముఁడు నీదుపూర్వజుం
డలజడవృత్తివాఁడు భవదంబనుగన్నగురుండు, బాపురే
తలఁపననాథయోషిదతిదారుణవిక్రమశాలివీవు, నీ
యిలువరు సేమిచెప్పనగు, నించుక హ్రీవలదేమనోభవా!॥ 215

క॥ కట్టడివగునీ వంగజ!! యెట్టుజనించితివొ కరుణనెసఁగెడు శశితోఁ
బుట్టినచెలువకు హారికిని! గట్టా! విష మబ్ధిభవముగాంచినలీలన్ ॥

తే॥ విరహిణీమారణోపాయవృత్తినీవు
మెలఁగఁ గాంచి చతుర్ముఖుం డెలమి సార్థ

కము గనిడె మారుఁడనునామ మమరనీకు
మదన! కాకున్న నిన్నేల మారుఁడండ్రు॥ 217

సీ॥ హరివాహనుఁడనంచు నలుగఁబోకుము కరి
యానపైఁ జిల్కహులుమాయిగాదె
అండజధ్వజుఁడనే నంచహెంకోమాళి
బాధింప కది మీనుపడగగాదె
సారంగబలసముజ్వలిసంచురంభోరు
నళికింప కది తేఁటిదళముగాదె
అబ్జాంబకధరుండనంచుఁ దమోవేణి
దొరయకు మదితమ్మితూపుగాదె
మదన! యిది సంకుమదగంధి మదరథాంగ
ఘనపయోధర కోమలకనకపుష్ప
క్రమనాసిక కలహంసగమన దీనిఁ
జెనకితేనియు నీదుసాధనము లణఁగు॥ 218

ఉ॥ హేమకరాంక! నీ శరశరాసనముల్ విరులంచు భూరివా
చామహితప్రభావమున సారెకుఁ బ్రాజ్ఞులు పల్కుచుందు ర
య్యో! మహిళాళి నేఁచుకొఱకుర్వి సుమాఖ్యల ధాత చేయఁబెం
పై మదియించు బల్విగులంచువచింప రదేమి పాపమో॥ 219

చ॥ పిడుగుల కోర్వవచ్చు, పటుభీమలలాటకృపీటయోనికిఁ
వడి నెదుటం దగఁ నిలువవచ్చు, ప్రచండకృతాంతదండమే
ర్పడ నొడియంగవచ్చు, బడబాజ్వాలనం బొగి నంటవచ్చు, నీ
బెడిదఁపుఁబూవుటమ్ములకు భీతిలకే నిలరాదుమన్మథా!॥ 220

సీ॥ ఈచంద్రబింబాస్య నేఁచంగఁబూనకు
మోహోరినీశర మాఱుపూర!

ఈవనప్రియకంఠి నేఁచంగఁబూనకు
మోరోరి నీధర్మ మాఱు మార!
ఈకాంచనసునాన నేఁచంగఁబూనకు
మోరోరినీగుణ మాఱు మార!
ఈఘనాఘనవేణి నేఁచంగఁబూనకు
మోరోరినీబల మాఱు మార!
నెలతలనుబోలె మిక్కిలి చలముఁబూని
నెలతలనుదాల్చుకొన్నసామి లలినేఁచి
చేసికంటఁగనుంగొనఁ జేరణంగి
యవనిఁగూలవె నీరూప మాఱు మార!" ॥ 221

వ॥ అనియానారి శంబరారిం దూఱి తరళలోచనకు గరళంబు చందంబునం గనుపట్టు మందగంధవహున కిట్లనియె॥ 222

గంధవహుని దూషించుట.

కం॥ పవనా! మలయమహీధరభవనా! భువనాద్భుతాదిబంధురభాస్వ
జ్జవనా! వర్తితసర్వోపవనా! యబలార్తి మదిని భావింపవనా!॥ 223

సీ॥ ధాత్రిఁ జిత్రతమీఱి రాత్రితోఁచినయంత
శ్రీఖండకుధరాగ్రసీమడిగ్గి
దక్షిణకామినీస్తనలిప్తఘనసార
సారసౌరభలక్ష్మి సంగ్రహించి
మంజులఫలపుష్ప మంజరీనవలతా
సంజాతఘనవనస్థలుల డాఁగి
అఖిలధరాధీశ్వరాంతఃపురగవాక్ష
సముదయంబులను కన్నముల దూరి
మానవులకించుకంతయుఁ గానఁబడక
దొంగభంగి నెసంగి తిన్నంగికిచటఁ

జారధర్మము తెలుపుచు సారిదినేఁచ .
మలయుటిదినీకుఁ దగున యోమలయపవన! 224

మ॥ పరభూభృచ్ఛలనంబొనర్చితివొ శుంభత్ఖ్యాతిమైమిత్రునిన్
శరభృత్సంఘముచేత బాధపడకున్నం జేసితో చిక్కవో
యిరవొందన్ గతిలేకయుండెడి మహాహీనుండు లోఁగొన్నచో
వరజోవృత్తియకా మహాబలసమాఖ్యం జెంద నీ కౌశుగా॥ 225

ఆ॥ మూలఁబడియు హితునితో లోకమేఁచంగఁ
బూనునిను హరింపఁ బుట్టుగుడ్డు
పాపజేనిచేతఁ బరఁగఁగాదని విధి
సన్నగాలిచేసె నన్న! గాలి!॥ 226

తే॥ ఘనభయంకర కాలకింకరకఠోర
ఘోరచేష్టితములుగాంచి క్రూరబుద్ధి
చెలఁగిపరతెంచునీకు దాక్షిణ్యమేల
కలుగనేర్చుఁ బ్రభంజన! లలనమీఁద॥ 227

తే॥ నీదుతూర్ణంబుచాలక నిష్ఠురముగ
రంగుమీఱుఁ గురంగ తురంగమెక్కి
పొంగుచుఁ దరంగవళి నేఁచఁబూనివచ్చి
తేమిపాపంబుచేసెనీ కింత పవన! 228

క॥ సరసులసంగతిమెలఁగిన।సరవిన్ వడిసుళ్ళొనర్చు చపలతమానన్
సరసులసంగతిమెలఁగియు।నిరవుగ వడిసుళ్లుమాన వీవుసమీరా!॥ 229

తే॥ కోటి వాటంబుగాఁ బిన్ననాఁటినుండి
యకట! మీయాజ్ఞ తగ శిరసావహించి
మెలఁగఁ గాంచియు నూరక చలముఁబూని
యేలయుపుడేఁచమీకుఁ జండాలులార!॥

తే॥ ద్విజత చెన్నొంది మధుపానవృత్తి విడువఁ
జాలకయు మలినాంగులై చపలబుద్ధి
పనుల నేప్రొద్దుఁ దిరుగుచుఁ దనరుమీఁకు
భృంగతతి! యెట్లురాఁ గల్గుఁ బెద్దబుద్ధి" 231

వ॥ అని మధుకరంబుల నిందించి మధుకరచికురయగు చిలుకల కొలికి చెవులకు ములుకులై తాఁకు పలుకులం జెలువుమీఱు చిలుక లంగనుంగొని యిట్లనియె, 232

—♦ చిలుకల దూషించుట ♦—

తే॥ "శుకసమాఖ్యవహించి యస్తోకగతుల
శౌరి సారెకుఁ బేర్కొంచు సరసవృత్తి
మెలఁగుచుండెడివీ కదో చిలుకలార!
కొమ్మపై నేల తగఁ బండ్లుగొఱుక నిటుల 233

క॥ చక్కెర లప్ప లొసంగిన
మెక్కి తగఁ బ్రబికి పెంపుమీఱియు విషముల్
గ్రక్కుచుఁ గీరసమూహము!
యక్కట! యిపు డబలఁ గలఁచుటర్హంబగునే 234

తే॥ మొకము లెఱ్ఱఁగఁ జేసుక సెకలుచల్లి
బోటికడ మాటిమాటికి నూటి నోటఁ
గాయ వేయక కూయుచుఁ గాల్వ నేల
చిట్లుకొఱవులుకదమీరు చిలుకలార!" 235

వ॥ అని నారి మీఱి కీరంబుల నిస్సారవ్యాహారంబులం దూఱి ప్రకటనికట రసాలసాల సరసకిసలయవిసరగ్రాస కషాయకంఠనిష్ఠ్యూత పంచమకుహూకారకూజితమ్ములఁ గలకంఠకంఠికిఁ గర్ణకఠోరంబౌనట్టు కలకంఠంబులంగనుంగొని యిట్లనియె॥ 236

## కలకంఠముల దూషించుట

కం॥ ఏకగ్రీవంబుగ మా। రాకాచంద్రాస్యఁ గూడి రహిఁ సిన్నాఁ శ్లో
స్తోకతనలరియునిప్పుడు। పైకమ! నీకౌనె గోల బాధింపంగన్॥ 237

తే॥ కన్ను లెఱ్ఱగఁ జేసుక కనలి విసపుఁ
గూఁత చెవులందుఁ జిలుకుచుఁ గొమ్మపైని
బఱు మింతైన లేక తాపంబొనర్ప
నకటకట! మీకుఁ దప్పునె యోపికకులంబ!" 238

వ॥ అని వనప్రియంబుల నప్రియవచనంబుల నిందించి యిందిందిరవిసిలచికురదిక్కుమొగంబై నెచ్చెలి ప్రియవాక్యంబుల ధైర్యంబు దెలుపుచు నిట్లనియె, 239

సీ॥ "ఒకకుతుకయి కూడియుండితిగాక నీ
పేరుచెప్పినఁ బాఱుఁ బికచయంబు
కన్నులఁగప్పక గారవించితిగాక
ముక్కుచిట్లించినఁ జొక్కుఁదేంట్లు
ప్రాణపదంబుగాఁ బరఁగిచూచితిగాక
లోనెట్టుగాఁడు గంధానిలుండు
మోవమాటమునిశంబుఁ బూసితిగాక నీ
త్రోవరాఁగలఁడె యాతోఁగలఱేఁడు
కాన భయమేల చెలి! కలకంఠములకు
గొమ్మ! తలఁగంగనేల యీతుమ్మెదలకు
బాల! లోఁగంగనేల ప్రభంజనునకు
(సకియ! భయమందనేల యాశశధరునకు). 240

వ॥ అదియునుంగాక 241

సీ॥ ఉరమందుసతతంబు గురులింగధారియై
హరశిరస్సులఁ బాయఁ డంబుజారి

రాజతాగారోహారమణీయధృతిగాంచి
పలకరఖ్యాతి నెగడెనమ్మ
గళమున బిసమూల లలి భద్రగతులచే
నలరారెనేత్రప్రౌఢ హంసకులము
మొనసి మహాకాలమూర్తియై మధుకర
వృత్తిఁ జేనొప్పార మత్తభృంగి
గరిమ బహిరంతరవ్యాప్తిఁ బరఁగి చాల
మహితసారంగధరలీల మసలెగాలి
యిట్టిపిరలువడిఁ జుట్టుముట్టుకొనిన
నతనుధాటికిభయమందకమ్మ కొమ్మ!" 242

వ॥ అనుపలికె నయ్యెడ, 243

ఉ॥ ఆలలనాలలామ నలినాహితమండలసాంద్రచంద్రికా
జాలదవాగ్నికోర్వక నిశామణితో బురుడించు మోమునన్
జేలచెఱంగుహస్తమును జేర్చి ఘనంబుగ నేడ్చెఁ బ్రోజ్వల
ద్బాలరసాలసాలనవపల్లవఖాదనకోకిలార్భటిన్. 244

క॥ అప్పుడుసఖియలుకన్నియఁ దప్పక కౌఁగిటను జేర్చి ధైర్యోక్తులు పెం
పొప్పగఁ జెప్పుచునిట్లనిరి "చప్పా! ఇటుదఃఖమొంద నర్హంబగునే. 245

సీ॥ నిబ్బరంబగుగబ్బిగుబ్బజక్కవలూన
వదనాబ్జబింబంబు వాడ్పకమ్మ!
అలరారుకెమ్మోవితలిరాకుపై నుష్ణ
నిశ్వాసపవనంబు నింపకమ్మ!
జిగిఁగుల్కు నిద్దంపుఁజెక్కుటద్దములపై
రహిసారెఁ గన్నీరురాల్పకమ్మ!
పొలుపొందు నేత్రాబ్జములమీఁదఁ జికురంపుఁ
జీఁకటుల్ చేరంగఁ జేయకమ్మ!

వనజదళనేత్రి! ఘనతనుస్వర్ణమునకు
నలఘుపరితాపశిఖిని బైఁగొలుపకమ్మ!
అమ్మ! నీవిట్లుధృతిచెసి యలమటింప
నిచటధైర్యంబుదెలుపంగ నెవ్వరమ్మ! 246

ఉ॥ ఏటికినింతవంత తరుణీ! దరణీధవరత్న మెల్లి ని
చ్చోటికినేగుదెంచి నిను సుస్థిరతందగగారవించు, నీ
వాటములేక మేల్నిరులనుందెద వేటికిఁగుందెదమ్మ! యీ
మాటయె వేదవాక్యముగ మానక నమ్ముఁగదమ్మ!నెమ్మదిన్". 247

—• విష్ణుమూర్తివర్ణన •—

వ॥ అని బహువిధంబుల నూరడింపుచుండి రప్పు డత్యద్భుతంబును ననంతకల్యాణంబు నపారకౌతూహలంబు నస్తోకాభిరామవిభవంబును గనంబడశంఖచక్రచంద్రధ్వజశతపత్రకలశప్రముఖనానావిధభాగ్యలక్షణలక్షితామ్నాయమణిమంజుమంజీరపుంజసింజానినాద విలసచ్చరణకమలయుగళంబును దశదిశానవకాశనిస్తంద్రసాంద్రచంద్రికాపాండిమప్రబంధురధవళచ్ఛవిచ్ఛటాధురంధరతారకోదారకోమలపదనఖరుంబును బంచబాణాంచత్తూణీరశరంగాకరజంఘాద్వయంబును గటిస్థలసంఘటితహాటకవసనశోభాప్రచ్ఛన్నశుంభచ్ఛాతకుంభరంభాస్తంభసంరంభవిస్రంభత్రిభువనోద్దండచండబిరుదాంకమకరాంకవిభ్రమకళాసంపాదకాభంగరంగన్మోహనాంగశృంగార సారవారవధూయూథనాయికాలోపచితోర్వశీనామపర్వశర్వరీనాయకముఖీజనస్మస్థోరుయుగళంబును బ్రవేష్టితపద్మరాగాద్యనర్ఘవినూత్నరత్నస్థగితకార్తస్వరమేఖలాగుణఘంటికాఘణఘణధ్వానవిరాజమానకటిస్థలంబును జతుర్దశభువననిర్మాణవిచక్షణాక్షీణపవిత్రచరిత్ర దాత్మజనభాగధేయసమాశ్రయశతపత్రమిత్రామిత్రనేత్రయుగయుగ పద్వికచావికచసంపద్రుచిరప్రచురరుచినిచయసమీచీనకంబుబింబోకలలితబంధురసుగంధ పరిలుబ్ధహార్దోత్కృష్టదరంగద్భృంగీసంగీతభంగీమాంగళ్యధురంధరధవళారవిందసుందరావర్తాయు

తోద్గంభీరనాభీవివరుండును రంగదభంగతరంగవిభంగకృత్త్రివళీప్యాలీ ఢకంకరవోత్కంఠాలుంఠనావలగ్నుండును నగనగరఖగమృగీభుజగవన వదనదీనదీనలానలానిలదనుజ మనుజమార్తాండకాండ జద్విపన్మండలా ఖండలకుండలికుండలపుండరీకభవాద్యనంతకోటిబ్రహ్మాండభాండపిచండి లుండును సౌధసాధోధిరాజన్యకన్యకాపయోధరధరస్థలపరిలిప్తఘుమ ఘుమాయమానసారఘనసార గంధసారకుంకుమసంకుమదపంకిలశ్రీవ త్సలాంఛనాంచదచ్ఛచ్ఛవిచ్ఛటా పటలజటిలపటుతరోద్యన్ముక్తాహారవి డంబమానవిశాలవక్షుండును వినీలనీలమణిఖచితకంకణవలయముద్రి కాభరణోల్లసన్మయూఖపుంజసమంజసనిజభజనానురాగ జనాభయప్ర దానప్రశస్తహస్తకమలుండును సమస్తవసుంధరాధురంధరోద్దండవే దండశుండాదండదీర్ఘతరాజానుబాహార్గళచతుష్టయుండును సింధురా డ్బాలికాకేళికాందోలికారాజద్వనమాలికా సంయోగగాఢభాస్వత్తేజోవి రాజమానకౌస్తుభరత్నాలంబిత్రిరేఖాయుక్తకంబుకంధరుండును రాజ కీరచంచూపుటప్రణీతపరిపక్వబింబఫలప్రతిబింబారుణాధరోష్ఠుండును జం చత్కాంచనస్రజీప్రసూనప్రతిమాననాసాపుటుండును నఖండలమణికుం డలఘృణిమండలమండితగండస్థలుండును శ్రీకారవర్ణధిక్కరణనిపుణ శ్రోత్రయుగళుండును భక్తజనసంరక్షణాక్షీణకరుణాకటాక్షవీక్షణాం చత్ప్రబాతసమయసము న్నిద్రసహస్రపత్రపత్రజైత్రాకర్ణాంతాయత నే త్రుండును గుసుమశరాసనప్రహసనసుందరభ్రూలతాద్వితయుండును బంధురపరిమిళితలలితమృగమదతిలకరేఖాలంకృతఫాలఫలకుండును ని స్తంద్రసాంద్రచంద్రికాప్రకాశమానశరద్రాకానిశాకరమండలోపమాన మందహాసకందళితసుందరవదనారవిందుండును నుభయపార్శ్వసమా యత్తవైమానికచామరగ్రాహిణీమణికంకణక్రేంకారసంకులారావసంక లితపాణిధవళచామరానిలవిలోలబలభిన్నీలాలకజాలకుండును ప్రచండ రుచిపిచండిలమార్తాండమండలమండితపూర్వపర్వతసార్వభౌమ రామణీ యకవిచిత్రపద్మరాగప్రభాభాసమానకోటీరవిలసన్మూర్ధభాగుండును స

...ణరత్నకౌస్తుభాదిభూషావిభూషితుండును శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గాయుధోపేతుం డును విద్యుద్వల్లికావేల్లితప్రావృషేణ్యపయోవాహ సాధ్యజాంబూనదాం బరడంబరాంచద్దివ్యమంగళ విగ్రహుండును ననంతానంతమణితేజోవి రాజమానుండును ననంతకోటికందర్పసౌందర్యరేఖావిమోహనుండు ను దిక్కామినీకుచస్తబకకారహారకలాపాయమానయశోవిహారుండు ను జయవిజయనందసునందాదిసేవితుండును నగుచు లక్ష్మీకాం తాసహితుండై, 248

సీ॥ శ్రీమద్రమామనఃక్షీరవారాశిసు
ధాకరుం డసురేంద్రభీకరుండు
సంతతాశ్రితమానిసంతానచిత్తాబ్జ
రంజనుం డంహోవిభంజనుండు
బహుబలాగ్రగ్రాహజలగ్రహావిగ్రహాంభోద్ర
పోషణుం డతులవిభవాఢ్యుండు
నిరుపమవరదానవివహాలయాగణ
కల్పకుం డురగరాట్తల్పకుండు
కమలసంభవభవముఖాద్యమరలోక
నాయకుఁడు భుక్తిముక్తిప్రదాయకుండు
ప్రకటభువనత్రయత్రాణభవ్యగుణప
రాయణుండైన యాదినారాయణుండు 249

వ॥ కట్టెదుటం బొడగట్టిన, 250

గంగ విష్ణుమూర్తిని స్తుతించుట

క॥ చెలియలపింగును దానును
జలజేక్షణు భక్తివినయసంభ్రమముల ని
పలగార మ్రొక్కి ముందట
నిలిచి తగం గేలుమోడ్చి నిశ్చలమతియై 251

వ॥ దేవాదిదేవుండైన యమ్మహాదేవు నిట్లనిస్తుతించె, 252

క॥ తనరారుసివ్వనస్థలి
కనుపమవిభవాభిరాముఁ డౌనృపచూడా
మణి యేఁగుడెంచునిచ్చట
నినుఁగనుఁగొనితాళిగట్టు నిజము కుమారీ!॥ 258

ఉ॥ కన్నియ! నీవు నానృపశిఖామణితో సతమైనకూరిమిన్
వెన్నెల చంద్రుడుంగలిసి విశ్రుతలీలఁ జెలంగుచాడ్పునన్
జెన్నలరంగఁ దాపి విరిఁజెంది తగం గొలువొందుచెల్వునన్
వన్నియ కెక్కఁగల్గెడి నవశ్యము నమ్ముఁగదమ్మ! నెమ్మదిన్॥" 259

వ॥ అని బొజ్జలో ముజ్జగంబులుగల యింటితెరువరియొజ్జ ముద్దు పట్టిం బుజ్జగించి యంతర్ధానంబునొందె"ననినవిని తదనంతరకథావిధానం బెఱిఁగింపుమనుటయు, 260

క॥ శ్రీలక్ష్మీధరాసిళా! [illegible] భవ్యసుశీలా!
నీలవిశాలవిసిల [illegible]భ [illegible]! శై[illegible]శైలా[illegible]!॥ 261

సీ॥ అవిరాజకా[illegible]
[illegible]జక[illegible]డాసనా[illegible]!
అవిపక్షభేదిసం[illegible]
[illegible]పి[illegible]శుభ నరహరి!
అవిరాజదివ్యాంబ[illegible]
[illegible]కాలం[illegible]!
అవిజయాపహారధా గాంచద్భుజాగ్ర! జ
యవిజయసహితభద్రైకనిలయ!
అవిబుధాబోధకావ్యయాత్మానుభావ!
అవికలజ్ఞానయోగి మనోబ్జభృంగ!
అఖిలళానంద నిత్యసౌఖ్యానుభూత!
అవితథాభోగసంకల్ప! అహీం[illegible]తల్ప! 262

పంచచామరము॥ మురాసురాద్యమృత్యు దోగ్రభూరిదోరసిద్వయా!
ధరాధరాధిరాడ్విరాట్సుధారధైర్యబంధురా!
దరాజరార్వరాజభృత్సుధాయశోధురంధరా!
చరాచరాకరోదరప్రశస్తసంస్తులాద్భుతా! 263

ఇది శ్రీమద్వేంకటేశ్వరకరుణాకటాక్షసంప్రాప్తకవిత్వ విద్యావిచిత్రా
పస్తంబసూత్ర హారితసగోత్రపవిత్ర వెంకటనరసయామాత్యపు
త్రాన్నమరాజాన్వయపయఃపారావారసంపూర్ణపూర్ణి
మాసుధాకర సకలగుణరత్నరత్నాకర విద్వజ్జన
విధేయ రమణయనామధేయప్రణీతంబయినశం
తనురాజచరిత్రంబను మహాప్రబంధంబు
నందుఁ దృతీయాశ్వాసము.



# శంతనురాజచరిత్ర.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీరమణీమణి వదనాం
భోరుహమద చంచరీక! భూకాంతావ
క్షోరుహ గతకర ! కరధృత
హారాంగద వలయ ! వేంకటాచల నిలయా!॥ 1

తే॥ అవధరింపుము జనమేజయక్షితీశ
వరునకిట్లని నమ్మాంనివంశకరుఁడు
ముద్దుకూఁతును నీగతి బుజ్జగించి
యాదినారాయణస్వామి యరుగునంత ॥ 2

తే॥ చెలువ కౌతూహలాయత్తచిత్తయగుచుఁ
బద్మమిత్రోదయముఁగోరు పద్మినిగతి
శంతనునిరాకగోరుచు సఖులుదాను
నాత్మసుస్థలమునకేగి యలరియుండ ॥ 3

* సూర్యోదయవర్ణన *

సీ॥ పొలయుల్కలెడలి యిమ్ములఁ బిన్నవయసుదం
పతులు ర (తిలోలు) గతులఁజిక్క
సంకేతములనుండి జారిణీజారు లొం
డొరులఁ బాయుటకునై యుబ్బుదక్క
సందుగొందులఁ బోవఁజాలక యున్నత
స్కరులు పేరెములెత్తి కరము స్రుక్క
ప్రస్థానసముచిత పాథేయములుగొని
చనుపాంథులకు మహోత్సాహమెక్క
అంబరస్థలిఁగన్పట్టె నపుడె సమయ
ఫణిఫణా భోగభాగ భాస్వన్మణిసమగ్ర
జాగ్రదకలంక రత్నరాజంబనంగ
వింతయొరవుల కిక్కయ వ్వేగుచుక్క॥ 4

తే॥ అరుణశేఖరతయుఁ జరణాయుధత్వ
మరయఁ గాలజ్ఞతయును మాయందె కలదు
సరిగనంచుఁ ద్విశుద్ధిగఁ జాటుకరణిఁ
గొక్కొరోకోయటంచని కోడిగూసె॥ 5

స్రగ్విణి॥ తెల్లనయ్యెన్ దగన్ దీపికాసంతతుల్
చల్లనయ్యెన్ నవస్త్రైణహారావళుల్
నల్లనయ్యెన్ మిళిందస్థితిం బద్మముల్
మెల్లనయ్యెన్ స్మరామేయమౌర్వీధ్వనుల్॥ 6

చం॥ జనితవియోగదుఃఖపటుసత్వర విభ్రమ (ఘూక)దంపతీ
ఘృణులకలంకలీల నుడిఁగెన్ (మడిఁగెన్)గుహాలందుఁ జీఁకటుల్
మనసిజుఁ డధ్వగప్రకరమర్మవిభేదనమాచరించి తాఁ
గినుకఁ దొలంగఁ గత్తి కడిఁగెన్ ముడిఁగెన్ నవకైరవావళుల్॥ 7

వ॥ అంత 8

సీ॥ కరమునఁ బూర్వదిక్కమలాక్షి కేళిమైఁ
బట్టిన పికిలిపూఁబంతియనఁగ
సమయవసుంధరాజాని పైఁగనుఁట్టు
బటువు మీఱిన సూర్యపటమనంగ
ఉదయభూభృచ్ఛిఖరోపరిస్థలియందుఁ
గొమరారు జేగురుకుప్పయనఁగ
గగనలక్ష్మీనాథ కనదురోంతరమున
రాజిల్లు కౌస్తుభరత్నమనఁగ
నాకసరిదుదకేళికాఢౌకమాన
ఖేటకరివరకరసముత్క్షిప్తదీప్త
చటులవిస్ఫుటహాటకాబ్జంబనంగ
భానుఁ డుదయించె ఘనతీవ్రభానుఁడగుచు 9

వ॥ అప్పుడు, శంతనుఁడు కొలువుకూటమునకువచ్చుట.

సీ॥ తన కీర్తివల్లీమతల్లికి దశదిశాం
తరములు కాయమానములుగాఁగ
తన దయానవమాకారవనవాటి కఖిలమా
ర్గణకోటి కలకంఠగణముగాఁగ
తన శౌర్యపద్మబాంధవునకు గర్వాంధ
పాంథతతి తమఃపటలిగాఁగ
తన విలాసజ్యోత్స్నకు నవవయస్స్త్రీహృ
దయములు చంద్రకాంతములుగాఁగ
తనభుజాభూరిసుత్రామయస్తంభమునకు
శుంభదంభోధివలయితక్షోణిరమణి
సాలభంజికగాఁగ నిస్తంద్రవిభవ
సాంద్రుఁడై రాజ్యమేలుచు శంతనుండు 11

వ॥ కఱిమబ్బులుగుబ్బతిలు బలు పులుదిండి రాబారిదూలమ్ముల దెసమసలక మెసవుకొను నను తలంపున మిసమిసలనెసఁగు మేటికిరీటి పంచరాయిరంగులఁ దురంగలించు నచ్చాపు జిగిపచ్చికలకు వచ్చి గ్రచ్చర మూరుకొను కేళికాకురంగబాలికాపాళికలకుసద్మపద్మవహించిన చికిలిమెఱుంగునగవు సెజ్జగున నెసంగు సిగనిగనిగుగరాల మగరాల తెలిచాయలను సోయగంపుఁబంగుపెన్నెలల నిండారనిరసించు చందువాచెందొవపు మొగడలవెడలి కడలికొను సాంద్రసౌరభ్యలహరికి మందుకొని తండోపతండంబులై చనుదెంచు గండుతుమ్మెదమొత్తమ్ములచెన్నున మిన్నలముకొన్న కాలాగురుగురు ధూపధూమస్తోమంబులం గనుంగొని యదభ్రశుభ్రేతరాభ్ర విభ్రమంబుల ససంభ్రమంబుగ నఖండతాండవంబులుసలుపు నీలమయూరవారమ్ముల విప్పుగల పింఛంబులఁ చొప్పుచెప్పు గొప్పకప్పు కీలుకొప్పులుగల వెలయొప్పుల కుప్పల బెడంగున నెమ్మొగులును పటికంపుగోడల సొంపారు మానికంపుబొమ్మల ప్రతిబింబమ్ముల డంబుమీఱు ముకురబింబంబుల విడం

బించు చంద్రకాంతపుజగతుల నారజంపుఁబలుకుల చలువలుగ్రమ్మఁ జేయు బకదారులు పొంకంబుగాఁ గనుపట్టు మణివిటంకమ్ములవ్రేలు జీవదంతపుఁబంజరమ్ములఁ గరమ్ము భరమ్ములేక తమతమపోతమ్ముల కాయతమ్ముగా భవ్యకావ్యనాటకాలంకారంబు లుపదేశించు ప్రౌఢకీరకాశారికాసంచయమ్ములకు భయావహమ్ములుగా మార్జాలనేత్రమ్ములఁబోలు వైడూర్యమ్ములఁజూపట్టుకవాటమ్ములుగల కొలువుకూటమ్మునకేతెంచి పొడువుకెంవుసొంపుసంపాదింపంజాలు ప్రాగెంపురాచెక్కడంపుసింహాసనంబున నాసీనుండై యఖండచండరుచిపిచండిలమార్తాండమండలమధ్యంబున నిండుకొలువున్న కుండలిప్రకాండశయను తెఱంగున రంగుమిగిలి చింతామణిభద్రపీఠంబున నున్నతిగన్న వెన్నునన్న చెన్నువహించి రాజచంద్రుండుగనుక మవ్వంపు నవ్వువెన్నెలల నశేషవిద్వజ్జననేత్రోత్పలంబులకు నుత్సవంబుగల్పింపుచుఁ బ్రభుమార్తాండుండుగనుక మాళిభాగభాగబ్జరాగప్రభాబాలాతపంబుల నిఖిలబంధుజనహృదయపద్మంబులు వికసింపంజేయుచు నేవంక సరసులు నావంక రాజహంసంబులు నేదిక్కు విబుధులు నాదిక్కు గురుజనంబులు నివసించియుండ నంగ వంగ కళింగ బంగాళ కరహాట లాట సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదర్భవిదేహ నేపాళ వత్స మత్స్య కురు కుకురు సింధు గాంధార కొంకణ ప్రముఖ నిఖిల దేశాధినాథులుగొనితెచ్చిన మణి హాటక పీటికా పేటికా ధాటికా ఘోటికా శాటికా చేటికా కోటికాదులు కానుకలొసంగి నిటలతటఘటితకరపుటులై కొలిచియుండఁ బులినంబులఁబోలు శ్రోణులు నలినంబులనేలు పాణులు మధుర్యురంబులగేరు వాణులు మధుకరమ్ములమీఱు వేణులు గల కొందఱు మందగమనలు వెలిచామరంబులు వైవఁ జలుపావడలు వాలుగన్నులు గుబ్బచన్నులు గల కొందఱు సుందరాంగులు కర్పూరవీటికాపేటికాదులు ధరియించి తత్తద్వినియోగంబులకై వేళలరయుచుండఁ జక్కెరమోవులు కవురంపుఁ గమ్మతావులు గల కొంద ఱిందిందిరాలకలు కరాంబుజంబులఁ దంబురంబు

లెత్తి తత్తదుచితలయస్వరతాళమేళనంబుల సవిస్తరంబులుగా గీతప్రబంధంబులు విన్నపించి సభారంజనంబొనర్ప నరవిందములఁబోలు పదములు కురువిందములనేలు రదములు గల కొంద ఱకలంకశశాంకముఖు లర్ధచంద్రారాళశిఖరకపిత్థకటకాముఖశుకతుండపల్లవపద్మకోశప్రముఖ భరతాభినయనంబు తెలిఁగింపఁ "చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రోదయ! యవార్యగాంభీర్యచాతుర్యధైర్యశౌర్యవీర్యస్థైర్యసద్గుణగణవిశేష! శేష భాషా జిగీషామనీషాధురంధర! ధరారమణీమణీరమణీయతపనీయమణిఘృణికమనీయకేయూరశృంగార శుంభద్భుజార్గళవిహార! హారహీరనీహారకర్పూరపటీరమందారకుందారవిందారిభూరికీర్తిచ్ఛటాచ్ఛాచ్ఛచ్ఛాయాచ్ఛాదితదశదిశాంతరాళ! శంతనుక్షమాపాల! జయ విజయీభవ" యనివందిమాగధబృందంబులు హృద్యానవద్యగద్యపద్యంబులఁ గైవారంబులు సేయ నిండుకొలువున్న యవసరంబున, 12

శంతనుమహారాజుదగ్గఱకుఁ గోయదొరలు వచ్చుట.

సీ॥ ముక్కులపై నామములు నీలిచల్లడ
ములు బాహులందు డేగలును గఱకు
కోఱమీసంబులు కురువంకసిగలును
బిగువైన కాసెలు పెద్దబొమలు
మొలలలోఁ దీరైన నెలవంకకత్తులు
దీర్ఘముఖా నీలదేహములును
వెడవెడనవ్వులు తడఁబడుమాటలు
నెఱ్ఱనికాంతిఁ జెన్నుసఁగుగుడ్లు

గీ॥ భుజములను వింటు లమ్ములపొదులు గలిగి
పెంపుమీఱుచు దిక్కువీక్షింపు చలర
నుర్వీపాలకదేవేంద్రుఁడున్న పెద్ద
కొలువుకేతెంచి రప్పుడు కోయదొరలు 13

తే॥ ఏగుదెంచి మహీపాలు నెదుటనిలిచి
నయముతో వంకవంకదణ్డములొనర్చి
మంజుమృగమదగజకుంభమౌక్తికాదు
లందముగఁ గాన్కలిడి యిట్టులనిరి పెలుచ 14

తే॥ సామి! దేవర తండ్రి! శ్రీ రామువంటి
దొడ్డదొరవయ్య మామాట నడ్డచేసి
బవుపరాకున నైన నేర్పడఁగ వేగఁ
జిత్తగింపుమి యివుడు విసిత్రముగను 15

మ॥ పులులుం దుప్పులు జింక లిఱ్ఱులును మన్బోతుల్ (సివంగుల్ నెఱా)
యెలుగుల్ సింబము లేదు లేనుఁగులు నెంతే గుంపులై వాల్మెకం
బులుతో ర్తర్ బలువేటకాండ్ర పనిసేర్పుల్ గట్టిపెట్టించి యే
మలగన్గొన్నను దామెయై మలయుదుర్గ మత్తిల్లి కన్పట్టెడిన్ 16

తే॥ అయ్యా! వాక్కేల మామనసైనయవుడు
మలలఁ దగసూసుసుందుము, మందుకైన
మెకముగనుపడ దెచ్చుట నొకటి ముందు
మందలై యున్న విప్పు డమందగతుల 17

సీ॥ సింగముల్ కనుపడ్డ భంగంబులై పాఱఁ
దగఁజంపకున్న మాతల్లితోడు
ఏనుఁగుల్ గనుపడ్డఁ బీనుఁగులం జేసి
ధరఁగూల్పకున్న మాతండ్రితోడు
పందులుగనుపడ్డ మందుకు లేకుండ
హరియింపకున్న మాయన్నతోడు
ఇఱ్ఱులుగనుపడ్డ నఱ్ఱులు తెగవేసి
పొటివుచ్చకున్న మాగురువుతోడు
సిన్న మెకములు మాకింక సెప్పనేల
అయ్యా! సలిసీములనుబట్టినట్టు పట్టి

తుల్లఁజేయకయున్న మాకేటిపేరు
మలలకేతెంచి మావేఁటకలయఁగనుఁడి 18

కం॥ అనిపల్కెడియాటవికులఁ
గనుగొని మందస్మితంబు కనుఁగవఁదొలుకన్
ఘనుఁడా రాజశిఖామణి
ధనవస్త్రవిభూషణములు తగనొసఁగి వెసన్ 19

వ॥ వారలం బోవంబనిచి యున్నయెడ 20

తే॥ గొరక లురిగోలలును దుపాకులు జిగురులు
వలలు బోనులు వాగురుల్ వాటమైన
చాటుతడకలు మొదలగు సాధనములు
వేడ్కఁ గొంచేగుదెంచిరి వేఁటకాండ్రు 21

సీ॥ కాలారిమోహాన మాలపెద్దఫిరంగు
బెబ్బులిబల్లుండు పెద్దతునక
బంగారుతీఁగె తుపాకిభైరవమాల
సింగిణిమణిరేఖ చిత్రరేఖ
చీఁకటిదొంగ కార్చిచ్చుమాలయదారి
మందులకొండఁడు మాలబంతి
మాటివెన్నెలకుప్ప నేరెడుబండు దొం
గలమిండఁడను నామములఁజెలంగి

గీ॥ వైశ్యయుగ్మముకలహించుభాతి సారె
భాంకృతులొసర్చుచును దుర్నృపతులరీతి
బెట్టిదంబుగఁ జూచుచు వేఁటకాండ్రు
కుందనపుఁబట్టెడలఁ బట్టుకొనుచురాఁగ
కదలె భైరవకంఖాణగణము లవుడు 22

—శంతనుఁడు వేఁటమార్గము వెడలుట—

వ॥ అయ్యవసరంబున 23

సీ॥ కులుకుగాఁ గస్తూరితిలకంబు నుదుటిపైఁ
దగదిద్ది సిగను సంపెఁగలమర్చి
వన్నెజాళ్వాపాగ తిన్నగాఁజుట్టిపై
మల్లెపూసిస్తు రుమాలగట్టి
కళ్కునుప్పాణిచౌకట్లు చెవిగఁబెట్టి
యొనఁగ సందిటను దాయెతులువెట్టి
బలికెంపురవకెంపుఁ బతకంబు మెడవేసి
బంగారువ్రాఁత కబాయిదొడిగి
గీ॥ తళుకులీనెడిజరబాజుదట్టి మొల బి
గించి చొక్కపుబాకు ధరించిమించి
నిలువుటద్దంబులోపల నీడగాంచి
కంతువింతఁజెలంగె నాశంతనుండు॥ 24

వ॥ అప్పుడు. 25

ఉ॥ రంగుమెఱుంగువజ్రములరాజిలు పల్లము మేలిజాళువా
బంగరుసత్ఖలీనమును బచ్చ లమర్చిన మోముపట్టయు
ప్పొంగనుపట్టఁ బాదరసముంబలెఁదిమ్మరు నొక్క తేజిఁ జే
రం గొనఁ దెచ్చి సాహిణి పురస్స్థలినిల్పిన నిచ్చమెచ్చుచున్॥ 26

క॥ నరపతి సమ్మదమొదవఁగ
సురపతి వారివతిపయిం బ్రశోభితుఁడైన
ట్టిరవృంద దొరలు సచివులు
గురుతరముగఁగొల్వఁ దూర్యఘోషము లడరన్॥ 27

తే॥ హత్తి ముత్తములగుచు రాహుత్తు లెదుటఁ
గడఁగిచనుదేర వెలిజల్లిగడలమూకఁ
జేరి యిరుగడ లరిగెలవారు రాఁగ 28
వెల్లగొడుగులనీడ భూవిభుఁడుగదలె॥

వ॥ ఇట్లు కదలి చనిచని యాభూమండలాఖండలుండఖండోద్దండ గండభేరుండ వేదండ రిపుపుండరీకశుండాలగండక కాండద్వీపిత్వ(?)కాండ మండల ప్రచండ భైరవారావవినిర్భేదితపుండరీకభవాండ భాండంబును గీచకనిచయకర్షణజనితదవహుతవహజ్వాలికామాలికా దర్శనప్రశస్తఖవిస్థల లంఘనజంఘాలగంధవహ వాహ వ్యాఘ్రాదినిగ్రహవ్యగ్రభిల్లపల్లవాధరీ కంకర్షణశరాసనవినిర్ముక్త వారుణశరాసారసమాసాదితకాండవర్గాగమంబును నధోభువనశరణనిజకుల పరివృఢసముద్ధరణకరణోదీర్ణతా కర్ణేజపనిశిత ఖనిత్రసదృశపోత్రోద్ఘాతవాహినీ సైకతాంతరోద్వాంతఘన లుబ్ధలబ్ధామోద మేదుర స్తబ్ధరోమస్తోమ భీమభూమఘుర్ఘురనిర్ఘోషప్రతిఘోషితాసన్న హిమవన్మహీధరగుహాకుహరంబును నరుణకిరణప్రవేశకలనానంవర్ధమాననిరంతరసబిడాంధకారనిర్గంధనధురంధరవిద్యోతమానజ్యోతిర్లతావితానసమంజ సకుంజపుంజాభ్యంతరంబును నానావిహంగమిథునశరణ్యంబును నగు నరణ్యంబునందు సముచితప్రదేశంబులలోవల లెసంగించియు బోను లొడ్డించియు నుఱులు పఱంగించియుఁ జోపుడుగోలలఁ జోపు వెట్టించియుఁ జెలంగునప్పుడు, 29

కం॥ దిసమొలవేలుపుగట్టము
లసమానప్రౌఢిలుబ్ధకావళి పఱపెఁ
గసిమసఁగి వాల్మీకంబుల
వెసమసలక గీటణంచె విలయస్ఫూర్తిన్ 30

• శంతనుమహారాజు సైన్యము మృగములవధించుట •

కం॥ వేఁపులుకోపాటోపతభూపునియుందటనుమృగసమూహముత్రుంపన్
చూపులుతీవులుగొనఁగా వేపునఁగని వేఁటకాండ్రుపీసరచేతన్ 31

వ॥ మృగంబులపయిం గవిసి 32

తే॥ "బైసుమాలకపొడువుమీా బావ! నీవు
పిటికెఁబాఱకవఱకుమీా మఱఁది! నీవు

కదకుజరుగక చీఱుమీ కౌశిక! నీవు
తలఁగిపోవక చెంగుమీ తాత! నీవు 33

తే॥ ఏలయిన్నాళ్లు పెంచెమా నృపతి మిమ్ము
నేఁడుగా కెన్నటికిఁక మీనేర్పులెల్ల”
అనుచుఁ దమలోనఁ బంతంబు లాడుకొనుచు
వసుధఁ గూల్చిరి మృగముల వట్టుగాను 34

చ॥ పులిపులి నేతునంచు నొకపోటరి యామృగయుండు గొబ్బునన్
బులిపయి కేఁగఁగా నదియు బోరున మీఁదికిఁ జౌకళింప న
త్యలఘురయంబునం దనకుహాస్తమునందలి దొడ్డబాకు త
ద్గళమునఁ గ్రుచ్చి చీల్చె నెసకంబున, వాఁ డెటువంటి శూరుఁడో 35

చ॥ ఉరుజవమొప్ప నొక్కమృగయుండు మహోగ్రత నేగుదెంచు నూ
కరము నదల్చి బల్లెమున గర్భము వ్రేసినఁ గజ్జవెంట స
త్వరముగ దంష్ట్రి రా భువికి వామకరంబున బల్లెమూఁది చె
చ్చెర వలకేలి వాఁకిణిచి జీల్చెఁ గళంబు నృపుండు మెచ్చఁగన్ 36

వ॥ అయ్యవసరంబున నయ్యవనీపాలకుండు, 37

క॥ ఖడ్గమ్ములఁ బడనడిచెను ఖడ్గమ్మున భూరిచిత్రకౌశలమున వి
ద్విడ్గహనదహనుఁ డహహా! రాడ్గణములు చుట్టునిల్చి సంస్తుతిసేయన్

క॥ తల్లడమందఁగఁ బార్థివ
తల్లజుఁ డత్యంతరోషతామ్రాక్షుండై
భల్లముల భూరి (బాహాభ
ల్లమ్ములఁ గసిమసంగి బలమేర్పడఁగన్)

వ॥ ఇత్తెఱంగున మృగయాలోలాత్ముండై యమ్మహాత్ముం డత్యంతోత్సాహంబు వొడమ యంతటం దనివితీఱక మఱియునుం గడంగి, 40

మ॥ ధరణిం బంచముఖత్వమొందె శ్రుతివిస్తారాప్తి సామోదని
ర్భరదానోన్నతిఁ గన్న సామజగతిన్ భంజించునంచున్ మహా

శరభాక్రాంతదిగంతరాళుఁడగుచున్ సంరంభశుంభద్భుజా
త్యురుశౌర్యోద్ధతిమీఱఁ జంపె నృపసింహుం డుగ్రసింహంబులన్ 41

తే॥ ఎన్నఁ జండాలులకు దానమిడు చవంత
కుంభినిసంభరణకేళిఁ గొమరుమిగిలి
నట్టి నిజగతి తగఁ బూని ననుచుఁ గెరలి
మత్తమాతంగములఁ గూల్చె మహిపమౌళి 42

తే॥ మనుపరిస్థలసంస్థితామాంసితాబ్జ
పత్రనామాప్తి గాంచి గోప్రాణహరణ
వృత్తి నేప్రొద్దు నలరె దుర్వృత్తులను మఁ
బుండరీకాళి ఖండించె భూవిభుండు॥ 43

కం॥ హరివిద్వేషసమాశ్రయ
గురుచేతోవృత్తిఁ బూనెఁ గొసరక దీర్ఘ
ధరణికి బలి సేసెదనని
శరభంబులఁ ద్రుంచె నృపతి సరభసలీలన్॥ 44

కం॥ భూదయితుఁ డనేకవియును
భూదారము లదియుఁ గాక భువిఘనవృత్తుల్
నాదపుతెఱఁగున వీనిన్
ఛేదించెద ననుచు విభుఁడు చెండెఁ గిరులన్॥ 45

తే॥ ఆత్మవంశాధిపతియైన యబ్జునకును
హృత్కళంకంబు పుట్టించి యిలనెసంగె
కాన వీనిని వేకూల్ప నౌనటంచు
హరిణశశములఁ గూల్చె మహామహుండు 46

కం॥ హరిగతుల మెఱయుచున్ శం
బరభంజన విలసనమునఁ బరఁగుచు నతను
స్ఫురణ నలరంపఁ గురియుచు
గరిమ నెసఁగె నవుడు రాజకందర్పుఁ డొగిన్॥ 47

వ॥ అంత 48

కం॥ పురహారకరసారంగము
హరిణాంకహృదంతరాళ హరిణముదక్కన్
ధరనెన్న మృగము వచ్చెక
పురమయ్యెన్ రాజతిలకు పొలుపగు వేటన్॥ 49

వ॥ ఇత్తెఱంగున నారాజపుంగవుండు నిరాఘాటవనంబున మేటిమృగంబులగీటణంగించి వేటకాండ్రు కొనితెచ్చిన వ్యాఘ్రనఖంబులు చమరీవాలంబులు దంతావళదంతంబులు కిటిదంష్ట్రలు కస్తురిపిండియలు గైకొని వారికి బహుధనంబులొసంగి పంది కుందేలు దుప్పి జింక మొదలగు మృగంబుల సరసత రసవిసరంబులు పాల్పడి యటఁ జనిచని ముందట, 50

—• శంతనుఁడు హిమవత్పర్వతమును వర్ణించుట •—

సీ॥ మదజాల పదజాల పదకూల మృదు బాల
పవననిర్గతతుంగ భంగసరసి
తతదరీ గత ఝరీ హితపరిస్థితహరి
ప్రకరసదూత్కృత చకితభిల్లి
గురు తుంగ తర శృంగ వరసంగత రథాంగ
శాత్రవ మిత్ర నక్షత్రపాళి
స్ఫుటదంత పటుదంత పుటకాంత తట నంత
త విహారకలితగంధర్వయుగళి

గీ॥ లలితపికమధుకరశుకకలరవముఖ
విహగకులకలకలరవమహితసరస
మృదులకిసలయకుసుమఫలదళవిలసి
తధరణిరుహాళి యత్తుహినధరమాళి॥ 51

వ॥ కట్టెదురం గన్పట్ట నత్యంతసంతోషస్వాంతుండై కనుంగొని యగ్గిరికి నమస్కరించి, 52

చం॥ హరునకుఁ గూర్మిమామ తుహినాళికి సంభవసీమ మేనకా
గురుకుచపాళిసామ్ము మఱికోటులకెల్లను దావలమ్ము భూ
ధరవరుఁ డంబికాసతి సుదారతఁ గన్నగురుండు బావురే
సరసనమ స్తసద్గుణనిశాంతము నీహిమవంతమం చొగిన్॥ 53

వ॥ తత్ప్రభావంబు వక్కాణింపుచు నటఁ బోవంబోవ, 54

శా॥ రంగద్రూపవినిర్జితాంగజునిపై రాజద్గతిన్ వీచె స
ద్గంగాతుంగతరంగలోల మధులిడ్గాభీగ ఘోషస్ఫుర
ద్గాంగేయాంబుజఫుల్లహల్లక లసద్గంధానుబాధా ప్తి (స్తో
మ్ము)న్ గొంపోయినరీతి గంధవహ మామోదానుసంధాయియై॥

వ॥ అంత ముందట॥ 56

## ఉద్యానవనవర్ణన

సీ॥ కాంచనకాంచన కాంచనావాసంబు
పున్నాగపున్నాగ భూషితంబు
శ్రీఫలశ్రీఫలశ్రీఫలాగారంబు
మందారమందారమంజులంబు
సురసాలసురసాలసురసాల నిలయంబు
కేసరకేసరభాసురంబు
వంజులవంజులవంజులాస్థానంబు
చందనచందనబృందయుతము
మదనమదన సమూహ రమ్యస్థలంబు
దంతశఠదంత శఠసముదాయసదన
మగుచుఁగన్నులపండువై యలరునట్టి
వనముగనుగొనె మేదినీవల్లభుండు॥ 57

వ॥ కనుంగొని యవ్వనంబు చేరంజని యచ్చట నొక్క రమ్య
ప్రదేశంబున సైన్యంబుల విడియ నియమించి మృదుల తరపదకమలశ్రీలి

తరత్నపాదుకాయుగళుండై తన కత్యంతప్రియమిత్రుండగు విశారదుం
డను మంత్రినందనుకరంబు కరంబునఁ గీలించి యయ్యారామాభ్యంతర
స్థలంబున సంతసంబున విహరించు కంతువసంతుల వింతదనర్చుచుఁ జని
చని హిందోళసుందరీసందోహాగరుత్సంఘాతసంభూతవాతపోతోద్ధూత
బాలరసాలమూలేందుకాంతాలవాలసన్నిహితప్రసవరససరిత్కూలసంవ
ర్ధమానకాంతార వారశీర్యన్ముక్తాఫల రంగవల్లికాయమానాంగణరం
జితనికుంజపుంజ జ్యోద్యచ్ఛీతచ్ఛాయాప్రవేష్టిత కాసారసంజాతకంజాత
మంజుకింజల్కపుంజ సమంజసరథాంగచక్రాంగ విహంగకులకోలాహ
లప్రతిఘోషితానంత మణికాంతమణికుట్టిమప్రదేశంబుల నిలుచుచు
వలితెమ్మెరలు గ్రమ్మఁగొనఁ గమ్మతావులు కుమ్మరిలు నిరంతర
నీరంధ్రవాసంతికాలతానిశాంతమ్ముల యిమ్ముల దొమ్మిగొని
ఝుమ్మని నాదమ్ముల మోదమ్ములొసంగు మొకరితుమ్మెదల మొత్త
మ్ముల చిత్తమ్ములకుఁ దత్తరమ్ములం గ్రమ్మఁజేయు తదుపరిభాగాచ్ఛా
దితాచ్ఛకుసుమగుళుచ్ఛాభిరామ హేమాభ్రంకషశాఖోపశాఖాశి
ఖాంతర కులాయసమేధమాన రాజద్రాజకీర శారికానికరమధుర వ
చోవిశేషంబు లాలకించుచు గొప్పలై విప్పగలిగి యొప్పమీఱు కురు
వేరుచప్పరమ్ముల క్రేవల నెత్తావులదీవులై రేవమీఱు పూవులంజూ
పట్టుకోవులం బెనఁగొన్న కన్నమావులపై మిన్నుముట్టి చెన్నుగలసుర
పొన్నగున్నలచాయఁ జల్లదనంబుల కెల్ల నెల్లయగు మల్లియలనెనసి
యల్లిబిల్లిగనల్లుకొనిన మొల్లతీవపొదరిండ్లపజ్జనీబుకొనిన గొజ్జంగిమావు
లపొదల బోరునం జిలుకు నీహారవారిపూరంబులు నిండి మెచ్చువచ్చు
నచ్చపచ్చరాకట్టు దొనలచెంగట మాటిమాటికిఁ జెంగలువయాకుటెనూ
టినీటిపోటుచూపు కీరఘోటకుని మేటిథాటిగలిగి నిగనిగని తొగపేని
రాలంగట్టిన నిద్దంపు ముద్దుటరంగుల చెఱంగులఁ దురంగలించు మోహం
బుల నిధువనంబులఁ జెలంగు మయూరమిధునంబులం గాంచి హర్షింపు
చునా రాజన్యనందనుండు విశారదుతో నిట్లనియె. 58

కం॥ ధరపురభిత్సురవనతరు
లరుదుగ నిచ్చినను గన్న యవియాఁగాదే
యురుగతిఁ జెందఁగ నటికి
సరవిఁ నందనకుమారసంతానాఖ్యల్॥ 59

కం॥ శ్యామసదాళుల్ చెలఁగఁగఁ
గోమలపురుషతిలకాప్తి గొనకొనియెనిటఁ
శ్యామ సదాళుల్ చెలఁగఁగఁ
గోమలపురుషతిలకాప్తి గొనకొనుటరుదే॥ 60

సీ॥ ఘనసారములఁబోలు ఘనసారములచాలు
బహుళితగారూఢపటిమఁగాంచి
సురసాలములఁబోలు సురసాలములచాలు
నిష్టఫలావాప్తి నేర్పుచూపి
స్యందనమ్ములఁబోలు స్యందనమ్ములచాలు
సుందరచక్రాప్తి నందగించి
పున్నాగములఁబోలుఁ బున్నాగములచాలు
స్థిరమహాభోగసంస్థితిరహించి
గీ॥ కంటివే నీవు నర్మసఖా! మదీయ
సద్వచోగతి నాయాయిసాలములను
చిత్రశృంగార(చేష్టితా)శేషలీల
నలలితంబైన యువ్వనస్థలమునందు॥ 61

కం॥ అని పనిఁగని చతురోక్తులు
మనములరఁగఁబల్కు నృపకుమారమహేంద్రుఁ
గనుఁగొని యిష్టసఖుండును
ఘనవాగ్వైభవవిలాసగతి తేటపడఁ॥ 62

సీ॥ చిగురుటాకులపేరఁ జెంగావితగఁగట్టి
ఫలములపేర భూషలుధరించి
విరులగుత్తులపేర మెఱుఁగునవ్వువహించి
పైకనాదముపేరఁ బాటఁబాడి
గురుపరాగముపేర సిరిగంధమలఁది భృం
గావళిపేరఁ గొ ప్పలవరించి
పూఁదేనెపేర సంమోదాశ్రుగతినొప్పి
కలహంసములపేర గతులనొంది
వనరమాదేవి దేవ! భవత్సమాగ
మోత్సవంబున నెంతయు నుల్లసిల్లె
ఘనులు మీరేగుదెంచుటకంటె నెక్కు
డైన సంతోషభోగభాగ్యములుకలవె 63

చం॥ లలితవబిందుబాలక విలాసగతిఁ సుమకోటిగన్వడఁ
గలితమదాంబుబిందువులకై వడిఁ బుష్పరసంబుజారఁగాఁ
జెలఁగుచుఁ జైత్రుఁ డంచితవిశేషరమం దగుమీకుఁ గానుకగా
నిలిపిన కుంజరమ్ములన నిర్మలకుంజములొప్పె నచ్చటన్ 64

మ॥ వనజాతాంబకరూపు లీ రిటకురా వాంఛన్ లతాసుందరుల్
వనజాతారిశిలాప్రకల్పితమహా వారావళీశొష్య భా
జనసంఘంబుల (మల్లికాప్రసవ)గుచ్ఛస్వచ్ఛముక్తాళి పెం
పెసయన్ నించి విచిత్రభూతిని నివాళింపించినట్లొప్పెడిన్ " 65

వ॥ అనిపలుకుమంత్రినందను వచోవిలాసమకరందబిందుబృంద మ్ములు కర్ణంబున కమందానందంబు పొందుపఱుప నారాజనంక్రందన నందనుండచ్చ టచ్చట నంచరింపుచు,

సీ॥ చెలులు చంద్రాస్యకు శిశిరకృత్యములు గా
వించిన శశికాంతవేదిఁజూచి
సకియలు కురువేరుచప్పరమ్ములనీడ
సయ్యాటలాడిన జాడఁజూచి
వనితలు మన్మథస్వామివై భవలీల
వ్రాసిపూజించిన క్రమముఁజూచి
మగువలూఁగిన గుజ్జుమావుల వ్రేలాడు
నల తీఁగె తూఁగుటుయ్యాలలఁజూచి
తోయజాక్షులు పటికంపుదొనలునిండ
పచ్చరాకట్టుపణఁకుల నిచ్చలలరు
నలరుతేనియకాల్వల కడ్డమేయఁ
బొలుచుపుప్పొడికట్ట లింపొలయఁజూచి. 67

ఉ॥ ఇచ్చట నెవ్వరో సకియ లిందునిభాస్యకు శైత్యకృత్యముల్
మెచ్చఁగఁజేసినా, రిచట మీనపతాకుని పూజచేసినా
రిచ్చటనిచ్చటన్ బహువిధేష్ట వినోదము లన్నెలంగినా
రిచ్చటివారొ నెచ్చెలులు నెవ్వతొ యవ్వనజాక్షి యెన్నఁగన్ 68

కం॥ కురువేరు చప్పరములఁ గ
పుర మొగి నెడలేక నిండి పొలుపగు భాస్వ
త్సరణులఁ జేర్చినయలనల
చరణాంకములొరు! మాయఁజన వించుకయున్ ॥ 69

కం॥ పుప్పొడివ్రాసిన వెన్నల
కుప్పలు చెడ, పుర్వినిండ గుప్పినసుమముల్
విప్పుగనించుక వాడవు
మెప్పుగనిటమున్నె యిచట మెలఁగినవారల్ 70

తే॥ వారలిటనుండి యెచటికిఁ జేరఁజనిరొ
ఇష్టసఖ! చూచితే"? యన, హితుఁడుపల్కె

“విరహపరితాపశాంతికై వెలఁదిఁగూడి
సకియలిచ్చటవనకేళి సలిపిచనిరి. 71

కం॥ ఈనికటక్షోణీస్థలి, మానినులుండుదు రనూన మానవియుతిచే
భూనాయక! మెల్లన “ఁజని, మానుగనీక్షణము చేతమా?” యనునంతః

సీ॥ వదరెడు రాయంచ కొదమలనదలించి
యలసయానముదీర్చునట్టిస్వనము
పెద్దగాఁదనరారు ముద్దుకీరములకు
నేర్పుగాఁబలుకులు నేర్పురుతము
గంధాంధభుజగభుగ్గణము వంకలుదీర్చి
నిద్దంపునటనలుదిద్దునినద
మెచ్చికోయిలపిండు మచ్చికతోఁజేరి
కలికిపాటలు చెప్పు కలరవంబు
క్రమకాంచన కాచకంకణవినూత్న
పాదకటకఝుణంఝుణార్భటులు పెలుచ
నొక్కబలుమ్రోఁతగా జెల్వలున్న కుంజ
వివరముననుండి బోరున వినఁగబడియె. 73

మ॥ విని భూపాలకమౌళిమంత్రిమణి పృథ్వీనాథుతోఁ బల్కె “నో
యనఘా! వింటివె? యొక్క మ్రోఁత వినఁగానయ్యెన్ లసత్కుంజసం
జనితంబై, యట మానినీమణులు స్వేచ్ఛన్ నిల్వఁగాఁబోలు, త
త్స్వన మామానవతీకృతోల్లసితనాదంబౌ వితర్కింపఁగన్” 74

చం॥ అనవుడు భూమిపాలమణి యాత్మసఖుంగని యిట్లుపల్కె “సీ
నినదముఁజూడ నేగఁ దరుణీమణులున్న లతాగృహంబు వే
కననగుఁగాన మానగతిగాఁజని మెల్లన యాలతాంగులన్
గనుగొనివత్తమే? మన మఖండకుతూహలమొప్ప నెచ్చెలీ!” 75

కం॥ నావుడు సఖుఁడను “మెల్లన
భూవర! యేనేగి చెలులఁబొడగాం చిటకున్

వేవేగవత్తు నంతకు
నీవిటనుండుము హితప్రవృత్తి సెలంగన్" 76

మ॥ అని రాజాజ్ఞవహించి నెచ్చెలిప్రమోదాయత్తచిత్తంబునన్
జనఁగా వీచెను సానుకూలగతిఁ జంచచ్ఛీతవాతూల మా
వినతానందనదుగ్ధపత్త్రరథముల్ విఖ్యాతిమై వానుభా
గనిరూఢోద్గతిచేమెలంగె నతిమాంగల్యస్థితుల్ దెల్పుచున్ 77
వ॥ చని చని తరుగణంబులోనం జొచ్చి 78

మ॥ కలితాహ్లాదమునన్ గనుంగొనియె భూకాంతాప్రియుం డచ్చటన్
గలకంఠిన్ గనకాంగిఁ గాంచనకుభృత్కారిన్యవక్షోరుహన్
గలహంసోత్తమయానఁ గంధరకచన్ గంజాతపత్త్రేక్షణన్
గలికిన్ గన్నియ నొక్కకామినిఁ గనత్కర్పూరమందస్మితన్ 79

ఉ॥ కాంచి దృగంచలంబులు వికస్వరభాస్వరలీలనొంద న
భ్యంచితహర్షబాష్పతతు లాననవిస్ఫుటహాటకాబ్జని
శ్చంచలసాంద్రసీమ విలసద్గతిఁబూనినభంగసంపద
న్మించినకౌతుకం బెసఁగ నెమ్మదినెన్నగణంగె నంతయున్ 80

ఉ॥ "ఎవ్వతెొ యీవిలాసవతి యెవ్వతెొ యీకలకంఠకంఠితా
మవ్వపుఁబువ్వుఁదీవియల మంజులకుంజములన్ మనోజ్ఞమా
నివ్వనవాటిలో విలసితేష్టవినోదవిహారలీలచే
జవ్వనిపింఛు లూడిగము నల్పుచుఁ జుట్లనెసంగ మీాఱెడిన్ 81

కం॥ మణిహారములో నాయక
మణిభాతిని దారకానమాజమున నిశా
మణిరేఖగతి వయస్యా
మణికోటులలోన నీరమణిమణి యలరెన్ 82

సీ॥ అలరారుకళలూరు నెలగేరుచునుమీాఱు
జిగిదేరు నీకన్నె మొగముతీరు

అలకప్పులలిగుప్పు చెలువొప్పుఘనుదెప్పు
మెప్పైనయాకొమ్మ కొప్పుదొప్పు
సిరిఁజూపువిరితూపుదొరతూపు గురియేపుఁ
బాపునీకోమలిచూపుకోపు
చెలువంపుబలుసొంపుగలకెంపువగఁజంపు
మురిపెంపునీయింతి మోవిపెంపు
గీ॥ నిక్కునువుబువ్వుదొక్కు నీనెలఁతముక్కు
మెఱుపుగమినేలు నీకాంతమేనిడాలు
కప్పురపుఁబల్కులొల్కు నీకలికిపల్కు
దీనినుతియింపవశమె వాగ్దేవికైన॥ 83

తే॥ కమలదళనేత్రి లేఁగౌను కరయుగంబు
కలికితొడలును బుష్కరగతివహించె
సుందరీమణికీల్కొప్పు సొలపుచూపు
మందయానంబు సారంగమహిమగాంచె॥ 84

తే॥ అబ్జపున్నాగవిఖ్యాతినతిశయిల్లె
సబ్జపున్నాగవిఖ్యాతినతిశయిల్లె
నబ్జపున్నాగవిఖ్యాతినతిశయిల్లె
నబలగళవేణిముఖనాభిహస్తగతులు॥ 85

ఉ॥ కన్నులతీరు మోవిజిగి కౌనుబెడంగు మొంగబుడంబుబల్
చన్నులరీవి కంధరవిలాసము పల్కులతీవు చూపు మేల్
వన్నియకొప్పుచొప్పు కరవైభవ మంఘ్రులయొప్పయారయా
కన్నకెకాక లోకములఁగల్గినకాంతలయందుఁగల్గు నే॥ 86

ఉ॥ కన్నులు పుండరీకగతిగాంచె, మృదూక్తి శుకాప్తిచెందె,బల్
చన్నులు పర్వతస్థితి ప్రశస్తిగనెన్, ఘనవేణి నారదా
భ్యున్నతివిూఱె, నట్లగు టహాహా తగ నీయొలనాఁగ గన్గొనన్
జెన్నసలారఁగల్గవె యశేషవిశేషరసప్రకాశముల్"॥ 87

మ॥ అని యశోకమాలి రూపవిభ్రమవిలాసౌన్నత్యముల్ మంత్రిసం
దనుఁ డానందరసాబ్ధిమగ్నవిలసత్స్వాంతాబ్జుఁడై వేడుకన్
వినుతుల్ చేసి తదీయవార్త క్షితిభృద్వీరావతంసంబు శ్రో
త్రనవాకల్పముగా వినన్ దెలిపి చేరన్ దెత్తునంచున్ జనన్॥ 88

మ॥ చని గోత్రాతలనాథుఁ గాంచి బలభిత్సంకాశసద్వైభవా
భినవాడంబర! నీవు పంప విలసద్విఖ్యాతసమ్మోదనం
జనితప్రాభవలాలసుండనయి స్వేచ్ఛన్ బోయి యేనిమ్మహా
వని నానావిధచిత్రముల్ గనుచు రేవన్ మీఱుచున్ ముందరన్॥ 89

సీ॥ బాలానిలవిలోలదేలాలతావాల
కూలాంచితరసాలకోటిఁ గడచి
సారసారివిహారసారసాకరతీర
సారవర్ధనసారసమితి దాటి
చందనకృతమాల కుందనాగతమాల
చందనవరసాల చయము మీఱి
లలితసౌరభసారకలితసత్సహకార
ఫలితోరుఖర్జూరపటలిఁ జూచి
లుంగములను లసన్మాతులుంగములను
పూగములను బ్రకాశపున్నాగములను
తాలముల భూరిరుచిరహింతాలములను
జాజులను విరజాజుల నరసిఁ గాంచి॥ 90

సీ॥ మావుల మకరాంకుమావులఁ జెన్నారు
కోవుల లవలీనికుంజములను
రేగులఁ బూఁదేనెవాఁగుల నలకొండ
గోఁగుల సురపొన్నకూటములను
గురుగులఁ బనసలమరువులఁ బొన్నల
పొరుగులఁ గల పోకమ్రాకలందు

తావులు వెదఁజల్లు పూవులుగల మొల్ల
తీవెలల్లిన గంగరావులందు
స్వచ్ఛతరజాయమానాతిసాంద్రశిశిర
గోస్తనీకాయమానప్రశస్తనిస్తు
లైందవోపలవేదికాబృందములను
వికచపద్మదళాక్షుల వెదకి వెదకి॥ 91

ఉ॥ అంత నతాంతభాస్వరలతాంతనితాంతసమగ్రసౌరభా
క్రాంతదిగంతరాగతనిరంతరహంసల భృంగమంగళా
త్యంతవిలాసగీతనినదాకలితంబగు నొక్క కుంజగే
హాంతరసీమఁ గాంతతరహైమకరోపలవేదికాస్థలిన్॥ 92

మ॥ ఘనవిద్యుల్లతికాభగాత్రిల వలత్కంజోల్లసన్నేత్రలన్
ఘననీలోపలనీలవేణులను వీణామాధురీవాణులన్
ఘనసారోజ్జ్వలహాసలన్ దిలసుమాకారస్ఫురన్నాసలన్
గనదంభోరుహరాగపాణుల రథాంగశ్రీపృథుశ్రోణులన్

వ॥ అత్యంతవినయవివేకలక్షణవిచక్షణలగు మృగేక్షణాసహస్రం
బులం గనుంగొని తత్సభామధ్యంబున॥ 94

సీ॥ సంపూర్ణచంద్రుని సరసమాడఁగఁజాలు
మొలకలేనగవొల్కు మోముదాని
క్రొక్కారుమెఱుఁగుల గుంపుపెంపెలయింపఁ
జాలిన నెమ్మేనిడాలుదాని
జాతినీలమ్ముల నీతిగాదనిదెప్పు
గొప్పమేల్కొప్పుక ప్పొప్పుదాని
కలువరేకులఁగేరు కన్నులుగలదాని
చివిగుల్కెడి కావిమోవిదాని
చికిలిబంగరుచెఱఁగుల చేలదాని
ముద్దుటంచలకాటలు దిద్దుదాని

చిలుకలకుఁ గల్కి పలుకులు దెలుపుదాని
కంతురతివంటి యొక కల్యకంటిఁ గంటి॥ 95

ఉ॥ ఆరమణీలలామ కహహా! నవతంచననచ్చునే సురాం
భోరుహపాణులన్ మనుజపుష్పసుగంధుల యక్షకన్యలన్
చారణకామినీమణుల సాధ్యమృగేంద్రవిలాసమధ్యలన్
గారుడపాటలాధరుల నాగలతాంగుల రాజశేఖరా!॥ 96

ఉ॥ అంగజుపూవుముల్కి, రతియాడెడిముద్దులచిల్క, జాళువా
బంగరునక్కు, లేచిగురుబంతి, మెఱుంగులకుప్ప, ముత్తెపున్
రంగుజగ్గునిగ్గు, వగ గాజిలుబోదపసిండి యుంచగా
కంగన నెన్ని చూడ నహహా! సతిమాత్రమె రాజశేఖరా!॥ 97

చ॥ కపురము నన్మృగీమదము కమ్మసితాపులుకల్మి దేవపా
దపవికచప్రసూనరసధారల సమ్మిళితంబుఁ జేసి య
చ్చపు నును క్రొమ్మెఱుంగులు నిశామణివెన్నెలలందుఁ గూర్చి తా
సృజనతఁ జేయఁగావలయు సీరజజుం డల కన్యకామణిన్॥ 98

ఉ॥ భంబులుగా నఖాళి, కరభంబులుగా తొడ, లక్షులంబుజా
భంబులుగా, సుధారసనిభంబులుగా పలుకుల్, కురుల్ ద్విరే
ఫంబులుగా, జితోల్లసదిభంబులుగా నడ, లొప్పు, భద్రకుం
భంబులుగా స్తనంబులు నృపాలక! ఎంకజపత్రనేత్రికిన్॥ 99

ఉ॥ కంబుగళంబు, కనకంబుగదే నునుమేను, కౌను నా
కంబుగదే, సునాస కనకంబుగదే, చనుదోయి మత్తకో
కంబుగదే, శశాంకపృథుకంబుగదే నిటలంబు, మేలు, లో
కంబున దానిఁబోలు నవకంపుసతీతిలకంబు గల్గునే॥ 100

సీ॥ సారంగమద మదసారంగములమీఱుఁ
గలకంఠిమైతావి కనులకివి
అంబుజరాగ రాగాంబుజమ్ములమీఱు
నకిమోవి కెంపుహస్తములసొంపు

పున్నాగవర వరపున్నాగములమీఱు
నలినాక్షినూగారు నాభితీరు
పుష్కరఘన ఘనపుష్కరంబులమీఱు
తొయ్యలికీల్గొప్పు తొడలచొప్పు
వేదిగంభీర గంభీర వేదిగతుల
నరవిమీఱుశరత్పూర్ణచంద్రవదన
కటితటముహేల విలసితగమనలీల
నబలఁగొనియాడఁదరమె బ్రహ్మాదులకును॥ 101

ఉ॥ కన్నులుచేరఁజేసి, జిగికౌను బళీ! పిడికెండ, గుత్తపుఁ
జన్నులుపట్టెఁడా బెడఁగుజగ్గులు గుల్కెడువేణిబారెఁడా
పున్నమచందమామవగ బూనినమోము కొణిందెఁడారయఁ
గన్నియఁ గాఁగిటంబొదువఁగల్గిన మేటికె స్వర్గమేటికిఁ॥ 102

తే॥ కలికిరదనాళి మొల్లమొగ్గలనుమీఱు,
పణఁతిమీఁగాళ్ళు తాఁబేళ్లఁబట్టిపోరు,
బాలనూగారు చీమలబారుగేరు,
కాంతఁగనుగొన్నఁ గన్నులకఁ బ్బుదీఱు॥ 103

ఉ॥ దానిబెడంగుగుబ్బలును దానిచొకాటపుఁ దేటచెక్కులుఁ
దానియొయారపుంబిరుదు దానిమెఱుంగుసోగవెంద్రుకల్
దానిమిటారిచూపులును దథ్యము కన్నులఁజూడ బాపురే!
మానవులేమిచెప్ప నలమన్మథుఁడైనను భ్రాంతిఁబొందఁడే॥ 104

సీ॥ చికిలికెంపుల నీడుసేయంగవచ్చునే
కారిన్యగుణ మందుఁ గలిగియుంట
చిగురుటాకుల సాటిచెప్ప నేగతివచ్చు
నానాడు మార్దవం బూనకుంట
కెందమ్ములను సామ్యమొందింపనెట్లొప్పుఁ
బ్రొద్దువెన్నెలచేతఁ బొలుపుగనుట

పగడంబు లెనయంచుఁ బలుక నెట్టులఁజెల్లుఁ
గనుక నేమేళఁ జేకట్లఁబనుట

గీ॥ అహహా! మృదుతరసంపత్తి నతిశయిల్లి
సతతతారుణ్యయుక్తమై సహజసరస
లీలనెసఁగి విశృంఖలోద్వేలగతుల
నొప్పు నా చంద్రముఖి పాదయుగళమునకు॥ 105

తే॥ వేడ్క ముఖచంద్రు గనిలవిషధరంబు
పైకొనినఁ దన్మహామిత్రభావ మొంది
నట్టిగమనాండజముఁ జేరి యధిపుఁగాచు
కొను భయములగతిఁ జెలి కాళ్లగోళ్లుతనరు॥ 106

క॥ అజుఁడు గజగమన గమనము
గజసంపదగాంచు టెఱిఁగి కచ్ఛపములుగా
సృజియించెం బ్రమదంబున
గజకచ్ఛపలీల తొంటిగతి యేర్పడఁగన్॥ 107

తే॥ పంకమునఁబుట్టి బహువిధప్రాప్తి వృద్ధి
బరఁగియుండిన కమలగర్భంబు లీడె
యతుకులై బ్రమోయు స్వర్ణకాహళులు సరియె
చంద్రవదన విసర్మలజంఘికలకు॥ 108

చ॥ నిరతము విభ్రమాప్తిగని నిష్ఠురకర్కశలీలఁజెంది బం
ధురరుచి లేకమీఁటు కరితుండము లోవివరంబెఱుంగ కే
సరసిజనేత్రియూరువుల సాటికివచ్చి ముశింగి దీటురా
నరటులువూని వన్యముల నాకులపాటు వహింపదే ధరన్॥ 109

మ॥ కులగోత్రాగ్రముల న్వసించి విలసత్కూర్మాసనాసీనయై
బలిమిన్ మారుతిభుక్సముద్ధరణ శుంభల్లీలఁ బెంపొంది ని
శ్చలతన్ ధాత్రి తపంబొనర్చి మహిళాంచచ్ఛ్రోణియై నిల్చెఁగా
కల రత్నాకరమేఖలాప్తి గననేలా కాకయున్నం దగన్॥ 110

క॥ ఆవనజనేత్రినాభికి । భావింపఁగఁ బొన్నపూవు పరఁగసరి యౌకా।
దావర్తము (సమమనియ)నఁ । గావచ్చునె వరదఁ బోవఁగాఁగను
గొనుచున్॥

తే॥ భామినీమణి లేఁగౌను బయలుచెంద
నుపరిసీమకు నాహార్యయుగళినిలిచె
అతనుచేసినట్లు విపరీతమయ్యెనేమొ
కమలసంభవు నిర్మాణకౌశలంబు॥ 112

తే॥ లలితనాభీబిలాంతరస్థలము వెడలి
గురుపయోధరభూధరకూటములకుఁ
బరఁగ నెగఁబ్రాకు మేచకఫణియనంగ
భామకెంతయుఁ గనుపట్టె రోమరాజి॥ 113

తే॥ వనజదళనేత్రివళులంతో వైరమెత్తి
భంగసంపదఁ జెందెఁ దరంగసమితి
అదియె కారణముగను దానాశ్రయించె
భంగనామంబు వాని నభంగగతిని॥ 114

సీ॥ అశ్రాంతఘనవిభ్రమాయాసమునఁగుందు
రంగుబంగరుబొంగరంబులీడు
కమనీయమార్దవకలితమ్ములై మించు
సరసప్రసూనగుచ్ఛములుసమమె
తృణకాష్ఠపాషాణధృతిఁ గర్కశతఁబూను
కులధారుణీధరకోటిజోడు
పొద్దువఁ గొలఁకులఁ బొలుపుగా జతఁజెందు
మదగథాంగవిహంగమంబులెనయె
గీ॥ బహుళసుస్థిరలక్ష్మిచేఁ బరిఢవిల్లి
వినుతకాఠిన్యయుక్తమై నునుపుగలిగి

యనిశమును జోడుఁబాయక యలరుచున్న
చంద్రముఖి నిబ్బరపు గుబ్బచన్నుగవకు॥ 115

తే॥ హంసవితతికి భోజనంబాటకతన
నవమృణాళంబులను బోల్పఁదవును గాక
లలితమధుజృంభణాతిమీఱు లతలఁబోల్పఁ
బాటిగానేర్చునే కొమ్మబాహువులకు॥

క॥ వలముఱి దరాప్తిగని వె 116
ల్వాలఁబాఱియు మొరసి ముడిఁగి బిసరుహనేత్రీ
గళలక్ష్మికిఁ బ్రదక్షిణ
మొలమిం గావించఁబోలు నిద్ధస్ఫూర్తిన్ 117

చ॥ భువనచతుర్దశప్రకటమోహనచారుకళాఢ్యమైన త
త్కువలయనీలవేణి నవకోమలకమ్రరదాంశుకంబుతోఁ
బవడముసాటిరాదెకద పక్వదళందనరారు దొండపం
డవసీపడంగఁజూచియును హా!తగ సామ్యమనంగఁ జెల్లునే॥ 118

క॥ అతిపృథుతను గఠినతనున్
నితంబమధ్యస్తనముల నిర్మించి తగన్
జతురాస్యుఁడు కిలికించిత
వతి మధురోక్తులను మార్దవంబును నిల్పెన్॥ 119

తే॥ అమలకురువిందముల నీరసముగఁ జేసి
దాడిమీబీజములఁ జప్పదనముచేసి
మొల్లమొగ్గల వెస ముచ్చుమునుగఁ జేసి
జలజపత్రాక్షిరదనముల్ చెలువుమీఱె॥ 120

క॥ ఛాయాచోరకరుచితోఁ। బాయనిముకురములఁ దెగడి పంకేజపలా
శాయతవిలోలలోచన। సోయగపుంజెక్కు లలరు సుస్మేరములై॥

తే॥ మంజుతరవజ్రపుష్పహేమప్రసూన
విజయబిరుదాంక మొగిఁబూసి వెలసెననఁగ

క్రొత్తముత్తెంపుముంగర కొమరుమిగుల
సుందరీమణి నాసిక చూడనలరె॥ 122

క॥ తొమ్మనుల లెక్కసేయక । మొమ్మొగులుకు కొమ్మవీను లెన్నఁగ
శ్రీకారమ్ములు నిజమ్ముసుమీ । కమ్మలసంగతిని మిగులఁగనుపట్టు
టచే॥ 123

సీ॥ తమ్ముల సరియంచుఁ దగఁజెప్పవచ్చునే
తమ్ములు పంకజాతమ్ములగుట
కైరవమ్ముల సాటిగా నెన్నఁబోలునే
కైరవమ్ములు దివాభీరులగుట
క్రొమ్మెఱుంగుల దీటుగూర్పఁగఁబాడునె
క్రొమ్మెఱుగులు క్షణభంగురములగుట
గండుమీల సమంబుగాఁ బోల్పఁజెల్లునే
గండుమీ లరభాగగరిమగనుట
రాజితాదభ్రశుభ్రవిభ్రాజమాన
రుచిరశుచిమతిశ్రీకర్ణకాంతక్రాంతకలిత
చారుదీర్ఘకటాక్షవిక్షేపవిలాస
గౌరవములైన పూఁబోఁడి కన్నులకును॥ 124

క॥ అగణితదృఢశౌర్యంబుల
జగములుమూఁడొక్కమాఱుసాధింప మనో
జ్ఞగతుల రతిమకరాంకు లె
సఁగనెత్తినవిండ్లనంగ సతిబొమ లమరెన్॥ 125

మ॥ కమలాక్షీముఖకాంతిలక్ష్మికి శరత్కాలంబునన్ నిండుపు
న్నమ రేయిన్ ద్వితీయయామమున జీర్ణక్షీరభృన్మాలికా
రమణీయంబగు వ్యోమమండలమునన్ రాజత్కళంకాప్తిన
ప్రమతంబాసి చెలంగు పూర్ణశశియా సైదోడు భావింపఁగన్ ॥ 126

సీ॥ తరళాక్షి కురులవిస్ఫురణగాంచితలంకి
ఘనసీలములు తృణాగ్రాహులయ్యె
పణంతి పెన్నెరులసంపదగాంచిభయమునుంది
ఘనము ధరాధరాగ్రములఁ జేరె
బాలక కుంతలప్రతిభగాంచిచలించి
సముదాళితతి విపినములదాఁగె
లలన కేశప్రబాలక్ష్మిఁగాంచికలంగి
శైవాలలతి జలస్థలులఁ జెందె

గీ॥ అహాహా! తథ్యంబుసుమ్మిది, యటులఁ గాక
యున్న ధరలోన భంగపాటొందువార
లకొగివాటిల్లుగతులు దీనికిఁదనర్చు
టకును గారణమెన్న సించుకయుఁగలదె॥ 127

ఉ॥ గోచరమానె యక్కుసుమకోమలి సుందరరేఖ శేషభా
షాచపలేక్షణాపివులచాగుమనంబులకైన లేశముఁ
వాచఃశుద్ధిఁ మిగుల వర్ణనసేయఁగడంగిరేని హా!
చూచినఁ గాక యూనలవుసోయగి మెన్నఁగవచ్చు నేరికిఁ॥ 128

చ॥ అతులవిలాసభాగ్యమహిమాన్వితయైతెనరారుచున్న త
త్సతిఁ గనుగొన్న పూరుపకదంబములఁ పిజశాంబరీప్రభా
వత భ్రమియించి మించి యసవారణదారుణకొసుమాశుగ
ప్రితతుల మర్మభేదనము పంచశరుం డొనరింపఁడే నృపా!॥ 129

తే॥ దాని పరిరంభసంభ్రమోదారచతుర
గతులచే నుల్లసిలువాని బ్రతుకు బ్రతుకు
దాని రతిసౌఖ్యకలననే తనరుచున్న
వానిజన్మంబు జన్మంబు వసుమతీశ! ॥ 130

సీ॥ తుహినమహీధరోత్తుంగశృంగస్వర్ణ
కందరమణిసానుకటకములను

సమదభృంగీలసత్సంగీతనిస్స్వాన
రంజిత లవలీ నికుంజములను
శీకరఖండసానుమ చ్ఛీతవాతాలోల
బాలరసాలాలవాలములను
కైరవకల్హార కంజాతసంజాత
సౌరభోద్గార కాసారములను
గీ॥ విమలశీతలశశిశిలా వేదికలను
సారమకరందనిమ్నగా తీరములను
మంజుతర గోస్తనీకాయమానములను
చాన విహరించుఁ జెలులతో సంతతంబు॥ 131

మ॥ లలనాకోమలపంచబాణ! మదిఁ బోలంజూడ నాశ్యామ యా
జలజాతాంబకహేతి యాచెలువ యాసౌభాగ్యపుంబ్రోవు నా
జిలుఁగుల్ వెన్నెలసిగ్గు నాతరుణి యాసింగారపుందీవి యా
తలిరుంబ్రాయపుమోహినీరమణి యాతన్వంగి నీకేతగుల్” 132

కం॥ అని సఖుఁడు నృపతిచంద్రున
కనురాగాద్భుతకుతూహలాతిశయంబుల్
జనియింప నతివిలాసము
ఘనసరసమనోజ్ఞనాట్యకాశతఁ దెలిపెన్॥ 133

వ॥ ఇత్తెఱంగున నక్కురంగనయన సౌందర్యప్రసంగంబు విన్నవించిన

ఉ॥ ఆ చతురబ్ధిభూమిపతి శాసతివార్తలు విన్నయంతనుం
డాచనుగుబ్బ లాకరము లామొగ మాకటి యారదాంశుకం
బాచరణంబు లాకచము లన్నియుఁ బల్మరుఁ గాంచినట్టుగా
దోఁచుచుఁ బెగాని యన్యమిఁకఁ దోఁచద యాతని మోహమెట్టిదో॥

ఉ॥ ఆరమణీలలామ నవయౌవనకోమలసుందరాన్వితా
కారము రాజచంద్రునకుఁ గన్నులఁగట్టినలీలఁదోఁప నం

భోరుహ గేహినీసుతుఁడు పుండ్రధనుఃప్రవిముక్త చండశా
తోరుసుమాంబకంబులఁ మహోగ్రతఁ జూపి కలంచె మర్మముల్॥

తే॥ చండకాండౌఘముల రాట్ప్రకాండ మదవి
ఖండన మొనర్చు రాజశేఖరుని గదిసి
చికిలివాటమ్ము లేనింటఁ జిలుకతేజి
పాగుశాహ బళీ! భంగపఱుపఁ జొచ్చె॥ 137

వ॥ అయ్యెడ, 138

సీ॥ ఖండకోదండ ప్రచండకాండౌఘముల్
మైనాటఁ దన కూర్మిమిత్రిఁ జూచు
చూచి లతాంగి భాసురవిలాసస్ఫూర్తి
పలుమాఱు వాంఛమైఁ దెలియనడుగు
అడిగి తదీయ మోహనమూర్తి సారెకు
మదిలోన భావించి కుదురుపఱచు
పఱచి తా నాత్మలోపల వెన్నవలెఁ గరం
గుచు నుస్సురని మోము గొంతవంచు

గీ॥ వంచి కనుమూసి తనరఁ జిత్రించినట్టి
ప్రతిమవై ఖరిదాల్చు, తాల్చి తనలీల
శిరము కదలించు, కదలించి నెరపు నగవు
రాజచంద్రుఁగాంచు మోహవిభ్రాంతుఁడగుచు॥ 139

సీ॥ భద్రగజశ్రేణులఁ బరఁగుచుండెడి రాజు
కెంత ప్రియంబయ్యెఁ గాంతగమన
మాచక్రవాళాచలాచక్రమేల్భూమి
వరున కెంతరుదయ్యెఁ దరుణిపిరుఁగు
ధనరాశి యర్థార్థితతికిచ్చుదొర కెంత
బంగారమయ్యె స్వర్ణాంగికాంతి

హేమాద్రిధైర్యాభిరాముఁడౌ పతి కెంత
కొండయ్యెఁ బూఁబోణి గుబ్బదోయి
గీ॥ విమలసన్మార్గవర్తనావిభున కెంత
గగనమయ్యె వధూమణి కలికి కౌను
అకట యిట్టివంటిఘనులకు జలజముఖుల
వినుతసౌందర్యరేఖ మోహనముగాదె॥ 140

వ॥ అప్పుడు పురుహూతసన్నిభుండు దెప్పరంబగు మోహంబు ద్రిప్ప
లేక కుప్పవై యొప్పుమిగులు ప్రియసఖుంగని యిట్లనియె॥ 141

చ॥ "వరసఖ! నీ మనోజ్ఞతరవాగ్రచనావిభవంబు భారతీ
సరసిజపత్రనేత్రియును జాలదు వర్ణనసేయ నాత్మ, నే
నరయఁగనేర్తునే పొగడ, నత్తరళాక్షి విలాసలక్ష్మి సు
స్థిరగతి విస్మయాదిగను జిత్తము విభ్రమమందె నేమనన్॥ 142

చ॥ అతనుఁడు చండపుండ్ర విశిఖాసనమం దళిమౌర్వి గూర్చి మా
రుతరథ మగ్రిమం దఱిమి క్రూరమహాశనిసారఘోర తీ
వ్రతర సుమాస్త్రసంతతుల రాయిడిచేసె మదీయమానసం
బతులితలీల నిచ్చలకు హా! దయగల్గునె యింతకేనియున్॥ 143

సీ॥ తనువు నేఁ జేఁదోడఁగ నెనసి గంధవుఁగొండ
గాలి గాదిది దావకీలిగాని
చండతాపమొనర్పఁ జాఁగెఁ బుష్పాంధయ
కులము గాదిది హాలహాలముగాని
ఘనదుస్సహవ్యథాకరమయ్యె స్మరహాయో
త్కరము గాదిది తీవ్రశరముగాని
గాఁఢచేతోభయంకరవృత్తిగదె హంస
గణము గాదిది మృత్యుగణముగాని
గీ॥ అకట యిపిపాంథజనముల నధికహింస
పఱుప మకరాంకునకుఁ దోడుపడి మనోజ్ఞ

సౌమ్యసద్వృత్తిపదవి దౌర్జన్యగతిని
జెలఁగె,హీనుల కౌన సుస్థిరగుణంబు! 144

—◆ చంద్రదూషణ. ◆—

సీ॥ ప్రబలార్జునోరు విగ్రహాజాతబహుళార్తి
ఖేదంబుచేఁ దగఁ గృశతఁగనుట
హరివిరోధావాప్తి నలరారియుంట శ్రీ
రామాహితానూనధాముఁడగుట
దాక్షాయణీప్రియ తాత్పర్యగుణిఁ గూట
చటులదోషాకరోజ్వలతఁగనుట
పద్మినీవైధవ ప్రతికూలుఁడై యుంట
కౌటిల్యహృదయ విఖ్యాతియగుట
గీ॥ పొసఁగ దశకంగునకు సరిపోల్పవచ్చు
అయయో! యిటువంటిచంద్రున కరయ దయయు
సత్యశౌచంబులును గల్గఁజాల వెపుడు
పాంధు లేగతి వీనిచే బ్రదుకువారు॥ 145

సీ॥ బంధురకార్శ్య సంబాధంబె తెల్పు స
ర్వౌషధీశ్వరుఁడను టనృతముగుట
ప్రాచుర్యగతిఁ గృష్ణపక్షంబె(బోధి)ంచు
ఘనకళానిధియను టనృతమగుట
పాంథతనూజాత పాటవంబే(చెప్పు)
హైమకరుఁడను టనృతముగుట
కడఁగి కళంకంపుఁ గప్పునిరూపించు
నమృతధాముఁడను టనృతమగుట
గీ॥ అకట! యాథార్థ్యమై కానవచ్చుచుండ
చతురవాగ్ధోరణీ విలసత్ప్రశస్త

నిపుణత్వవిశేషమహిమ నన్నీరజారి
యందు బుధులెంతు రది యేమియలఘుమతము॥ 146

సీ॥ పటుకాయమానాగ్ర జటిలోల్లసిత ఫుల్ల
మల్లికాసుమగళ న్మధురసంబు
మల్లికాసుమగళ న్మకరందపారణ
ప్రీతభృంగాంగనా గీతరవము
ప్రీతభృంగాంగనా గీతసముద్భూత
సహకారకిసలయ సంచయంబు
సహకారకిసలయ సంచయగ్రసన స
త్కలకంఠవర కుహూకారరుతము
గీ॥ తలఁప నేతత్స్థలంబున నిలువకుండ
పరిసరావని నత్యంతబంధురోగ్ర
వేదనాపాదనానూన విలసనము ల
నదరుపుట్టింపఁజొచ్చె నేమనఁగవచ్చు॥ 147

వ॥ అని యుత్తలంగున మోహావిభ్రాంతచేతస్కుండై పలుకు
చున్న యన్నరవరకుమారశేఖరుం గనుంగొని మృదుమధుర సరసవచ
నరచనా ప్రాచుర్యతిరస్కృతవాచస్పతియగు మంత్రికుమారశేఖరుం
డిట్లనియె, 148

చ॥ “విరహభరోగ్రతాపమున వ్రేఁగఁగనేల నృపాలచంద్ర! నీ
వరయఁగఁ గామినీజన నవాంబురుహాస్త్రీడ వట్లుగాన(వి
న్గరమనురక్తి) గన్న లలనామణి మన్మథచండకాండ ఝ
ర్ఝరితశరీరయై మరుని సొక్కెడె నీకు దక్కదే. 149

మ॥ స్థిరచింతాభర మొందనేటి కిఁక వాగ్దేవీమనోభర్త త
త్సరసీజేక్షణ నంబుజాలయను దైత్యధ్వంసికింబోలె భా
సురలీలన్ ఘటియించెనీకు నిజ మోక్షోణీశ! వెయ్యేటికీ
సరసప్రాభవులెన్న మీర లహహా! సంకల్పసిద్ధుల్ కదా”. 150

క. అని తత్కన్యావందా ర్యనలాల స(చిత్తుఁ శత్రుజైత్రుని శశ్వ
ద్వినతాతిశయములొప్పఁ గొనిచనఁగా నంత నెదుటఁ గుతరలీలన్.

సీ. అనుకూలగతివీచెఁ దనర శీతలగంధ
బంధురోన్నతులొప్ప గంధవహము
కుడిభాగమునుండి యెడమదిక్కున కేగె
పత్త్రిశేఖర దుగ్ధపత్త్రరథము
లల్లనల్లనఁ ద్రోవ కడ్డంబుగా వచ్చి
గోమాయువులు చూచె మోము లెత్తి
వీణ రథస్త్రైణమాణిక్యమయపాణి
వీణాకలధ్వనుల్ వినఁగనయ్యె

గీ. కలయఁ బల్కెను దగఁ బైడికంటిజోడు
ఇట్టిశుభశకునంబుల కెలమి నతుల
హర్షసంభరణప్రాంచ దంతరంగుఁ
డగుచు నవ్వనిఁ గొంత దవ్వరిగియరిగి. 152

వ. అయ్యెడ నయ్యవనీశ్వరవరనందనులు వన్నె మిగిలి మిన్ను దన్ని చెన్నుగల కన్నెపొన్నగున్నలదండ నెన్నిక కెక్కు చిన్ని సన్న హొన్న గన్నేరులపై మొల్లంబుగా నల్లిబిల్లిగా నల్లుకొనిన మొల్ల మల్లెవిరిదుమారంపుఁదిప్పల నొప్పుగల పొరుగుల నొప్పు గరుగులమరు గులకరిగి ముప్పిరిపెనంగిన యేలకతీఁగెలు గప్పుకొని మెప్పుగుల్కుచు గుప్పుగుప్పునఁ దావులుగుప్పు గొప్ప కప్పురపనంటుల దాటఁ బాయని గెంటెనలపజ్జ గుజ్జుగొజ్జంగి పొదరిండ్లనుండి దుమికి జోరునం బాఱు తెలిమంచునీటికాలువలదరుల విరుల సిగుల నలరుచుఁ జాలుదప్పని బొంగు మల్లియలదండ నండగొని యెడతెగని నీడలు సేయు దాడిమిమ్మలంగూడి పోడిమిగల కోడెనిమ్మల యిమ్ములఁ గమ్మవాసనలు గుమ్మరిలుచుఁ గొందమతుమ్మెదల సొమ్మసిలం జేయు సంపెంగలచెంగట రంగుమీఱిన గేదంగులం బెనంగిన లవంగపుఁదీఁగియల నల్లికొని సొగసై సాగిన

తీఁగెమల్లియలకుఁ బట్టులై కన్పట్టు కలిగొట్టుచెట్టులపై మట్టుమీఱి దట్టంబుగాఁ బ్రాఁకిన బండిగురువిందసందులంబుట్టి పొందుగలిగి పందిరుల కందిన ద్రాక్షలఁ గలయంబెనచుకొన్న గుద్రాక్షతీఁగెల కెలననలరు క్రొవ్వులక్కేవల రివిమీఱు పూవుతేనియబావుల దీవుల మావుల మావులకుద్దియై పెద్దగాఁ బెరిఁగిన గంగరావులతావులకుఁ దావలంబు కలంకుగొలంకుల పోకబ్రాకుల నల్లి ద్రవేలు మిరియాంపునునుతీఁగె తూఁగుటుయ్యేలల నొయ్యనొయ్యన రేయుంబగలనక తూఁగు రాయంచమగల మగనాండ్రై నిగనిగని చికిలిరంగు మెఱుంగుబ గరుత్రెక్కలతుదలం బొడమి తురంగలించు సన్నంపు గాఁడు పుకుట్టుల సాగి పోసిక యీశిగిలంబడఁ జేయు కుకువేరుచప్పరమ్ములమూంగిళులఁ గుప్పలుగా గొప్పనుప్పొనముత్తియమ్ములుదొరఁగు ముగురువెనురు పొత్తిగొని తేటల తేటలగు పాటల పాటమ్ములైన సుగపొన్నకూటమ్ముల సమీపమ్ములమీఱు పారిజాతమ్ములకు జోడులై యున్న నారేడులకు నీడలై చూపడునల్ల నేరేడుల మొదళ్లనలరారు జగా నెలరాలతిన్నెలకనసలదాపునఁ బసల నెనసిన విరజాజులపాదుల ప్రోవులై పెరిఁగిన నూదిమల్లియల చేరువ గుమురులైన జాజులనీడల మెల్లనఁజనుచు నా రాజన్యనందనుండు తన చిత్తంబున 15[illegible]

సీ॥ వరశుకాంగనఁ జేరి సరససల్లాపముల్
చేయు రాజకీరంబుఁ జూచి
అంచకామినిఁ గౌఁగలించి మించినవేడ్క
హర్షంబునొందు రాయంచఁ జూచి
కలనాద మొనరించి కలికి కెమ్మోవి
చుంబించు పారావతంబుఁ జూచి
ఘననీలచక్రవాకినిఁగూడి రతికేళి
గావించు మదరథాంగంబుఁ జూచి

గీ॥ చానకడకేగి సంపదభావములు వచించి
బిగువు కౌఁగిటఁ గదియించి పెదవి నొక్కి
రతులఁ జెందుటకై చాలమతిఁ జెలంగు
రాజచంద్రుండు మోహవిభ్రాంతుఁ డగుచు. 154

సీ॥ కాసారములయందుఁ గలువ రేకులఁ జూచి
యంతరంగంబునఁ జింతినొందు
సొగసైన పువ్వు పున్నాగతీఁగెలఁ జూచి
మానసాబ్జమునందు మగ్నమందు
నును చాయలఁ దలిర్చు ననఁటిబోదెలఁ జూచి
చిత్తమం దెంతయుఁ దత్తరించు
పోలుపారు గుత్తంపుఁ బూవుగుత్తులఁ జూచి
స్వాంతంబునందు విభ్రాంతినొందు

తే॥ గీ॥ సుదతి నిడువాలుకన్నులు చూడఁదలఁచి
సింహమధ్యమ బాహువు వీక్షింపఁదలఁచి
కంబుకంధర యూరువుల్ కనఁగఁదలఁచి
చెలువ వలిగుబ్బదోయి దర్శింపఁదలఁచి॥ 155

వ॥ అప్పుడు రాజచంద్రునకు మంత్రిచంద్రుం డిట్లనియె, 156

సీ॥ అప్పాలంతి మెఱుంగు గొప్పకీల్కొప్పుక
ప్పంధకారము నొనర్చె నంతరిక్ష
మక్కాంత నవమందహాసాంకురచ్ఛాయ
దిశలందు సాంద్రచంద్రికలనీనె
అబ్బాల పదహల్లకారుణద్యుతి పద్మ
రాగకుట్టిమముఁ జేసె రత్నగర్భ
అక్కన్య రుచిరదేహప్రభ నికటల
తాదుల భర్మమయంబొనర్చె

తే॥ గీ॥ అదియకనుగొంటె నిఖిలధరాధినాథ
హితవయస్యశిరోమణుల్ చతురగతుల
నూడిగంబులుసేయంగ నుచితలీల
శోకకుచయున్న లవలీ నికుంజగృహము॥ 157

వ॥ అని తెల్పిచూపుచు సవిధసరోజాతాకరసంజాత కబంధజాతసౌగంధికబంధుర సుగంధానుబంధి గంధవహపరంపరాపరికంపమాన విశాలప్రవాళజాల లాలితంబును, నుపరిప్రదేశ పరస్పరజటిల మల్లికాప్రసూనమంజరీ పుంజనిర్గతానర్గళమధురమధురస వారణపరాయణ విభ్రమద్భ్రమరాంగనాసంగీత కలధ్వానద్రవమాణశోణాంకదృషద్వితర్ది కాంచలాంచన్నిర్ఝర ధారాధారికుల్యా ఘుమంఘుమ నిర్ఘోషానుకారికీరభాషావిశేష యోషామణిజాలవాచాల చిరత్నరత్నమేఖలాలంకృత ఘంటికాతులాకోటి కంకణకింకిణీ కేంకార కోలాహలబహుళంబును, కాంతాశ్రాంతపరిశ్రాంతి విశ్రాంతికరాత్యంత కాంతస్వచ్ఛతరశీతలచ్ఛాయానికాయ్యనికాయంబును, నామిషాప్యభాగసమావృత చందన కుచందన కృతమాల తమాల మందార మాకంద మధూకాశోకానోకహానీకవ్యాకోచ కుసుమవిస్మమర సారసౌరభవిస్తారంబును, అత్యంతరమణీయంబును నగు నక్కుంజ సమీపంబున నిలిచిన, 158

ఉ॥ స్వాంతమువల్లవింప నృపచంద్రుఁడు గన్గొనఁ బొంచి తన్నికుం
జాంతరిజాలమార్గముల నల్లనఁ గంధరనిలవేఁడి గ
న్గాంతవిలాసనేత్రిఁ గనకాంగిని గంజనిభాస్యఁ గాంచనా
త్యంతమనోజ్ఞనాసఁ గరియానఁ గసత్కఠిన స్తనద్వయన్
గాంతను గంబుకంఠఁ గలకంఠకలస్వనఁ గామినీమణిన్. 159

క॥ కనుగొనినంతనె మనసిజుఁ
డనుపమపికకీరశారికార్భటులొలయన్

నునువాఁడి చికిలికోలల
జననాథవతంసుఁడుండె జల్లన్ గలఁచెన్. 160

వ॥ అప్పుడు 161

శా॥ రివ్విన్ వెల్వడు పంక్తిసంతమసకోటిం జిక్కి సీమంతరే
ఖావీథిన్ స్తనదుర్గవర్త్రియయి వేడ్కన్ హారస్రక్శ్రేణులన్
వేవే డిగ్గు గభీరనాభిసరసీ నిర్మగ్నయై సన్నుతం
బావక్రోత్పలినంబుఁ జేరు పతిచూపజ్జాతిపైఁ బర్వుచోన్. 162

తే॥ కన్యకామణి సకలాంగకములయందు
తిరుగు నృపుచూడ్కి నరికట్టె వరుసనిలుపు
చెఱకుసింగిణిమన్నఁగు, యిఱుకుబిగువు
గబ్బిచన్గట్లనడిత్రోవ గనుమగట్టు. 163

తే॥ మహిళ నెమ్మేన నాపాదమస్తకముగ
నడరి యారోహణావరోహణలఁదిరిగి
యచలమాస్థితి ననిమిషంబైనదృష్టి
యలవడె మహీంద్రునకు నంత నద్భుతముగ. 164

వ॥ అయ్యెడ నయ్యవనికాంతుం డంతరంగంబున నక్కురంగన
యాన నిట్లని వర్ణింపందొడంగె, 165

క॥ "నరఖగ విద్యాధర కి
న్నర సుర గంధర్వ యక్ష నాగాంగనలీ
సరసిజపత్రవిలోచన
చరణనఖాంకురముతోడ సరిపోలుదురే. 166

శా॥ మారుం డద్భుతలీల దీని నజుపై మాఱొడ్డి కల్పించెఁగా
కౌరా! యీ వలిగుబ్బదోయిబిగు వీయందంపుఁగీల్కొప్పుచొ
ప్పీరోమావళిపొంక మీనడబెడం గీతళ్కువాల్కన్నులో
య్యారం బిద్ధఁ గాకయున్నఁ గలదే యబ్జాక్షులం దెన్నఁగన్॥ 167

సీ॥ కలకంఠరవ మబ్జకంఠి కంఠముగాఁగ
పల్లవమ్ములు బాల పాదములుగ
కలహంస నిభ రాజగమన యానముగాఁగ
బలుతూండ్ల ననబోణి బాహువులుగ
ఘనఘనాఘనము చందనగంధి కొప్పుగ
నక్షత్రములఁ గొమ్మ నఖరములుగ
కరికరంబుల హేమగాత్రి యూరులుగాఁగ
నీరజంబులఁ గాంత నేత్రములుగ
గీ॥ సర్గమొనరించి సహజవైషమ్యగతుల
తలఁచి యన్యోన్యదర్శన స్తంభనముగ
కఠిన కుచశైలముల మధ్యగతముఁ జేసె
చిత్రమాఁగద చతురాస్య శిల్పమహిమ॥ 168

తే॥ అతివ నెమ్మోము పూర్ణసుధాంశుబింబ
మాటఁ దెలిపెడుఁ బక్వబింబాధరోష్ఠ
ఘనసుధాసారసరహాసకౌముదీవి
రాజితేక్షణ మృగసమాశ్రియుతఁ జేసి॥ 169

ఉ॥ రాజమరాళిపై నెటుల రమ్యతఁ గాంచెనొ తన్మృదోయి, రం
భాజగతీరుహద్వయముపై నెటులొందెనొ ధాత్రి, మింటిపై
నోజదలిర్ప నెట్లణఁగియుండెనొ కొండలు, పూర్ణతారకా
రాజుపయిన్ ఘనం బెటులరంజిలెనో కచనక్రజంబుగన్. 170

క॥ మృగశాబాయతలోచన
జిగినిబ్బర పుబ్బుగబ్బి సిబ్బెపుగుబ్బల్
పొగరణఁచఁబోలు నిత్యం
బగణితముగఁ జెండ్ల గిండ్ల నరులన్ గిరులన్. 171

ఉ॥ కరముగా మృదూక్తి, నును కెంపుజిగిం దగు మోవి సత్సుధా
సారముగా, మనోజ్ఞ ఘనసారముగా తెలిలేఁతనవ్వు, పా

టీరముగా తనూసురభి శీవిదనర్పెడికొప్పు, బంభరీ
వారముగా లతాంగిపరివారముగా పురుషాళి గన్గొనన్. 172

క॥ తాళముచనుగవ మత్తము। రాళము యానంబు రోమరాజి వినీల
వ్యాళము బాహుయుగంబు మృ।ణాళము హా సిద్ధమెన్న నారీమణికిన్

చ॥ అరుణమణిప్రవాళసురపాళ్మ సుమా క్షికవజ్రరత్నముల్
బరువడిఁగూర్చి చిత్రముగఁ బాదరవాంశుక కేశదంతసు
దరనఖముల్ రచించి తగఁ దత్క్రియఁ జేయఁడుగా విరించి యా
సరసిజనేత్రిచిత్తము విచారమొనర్చి మదిం దలంచినన్ 174

సీ॥ కమ్మపూఁదేనియకాల్వలై పాఱదే
కల్కితియ్యనిపల్కు పల్కె నేని
చెలువారు పంచువెన్నెల తేట నిండదే
జవ్వని లేనవ్వు నవ్వెనేని
వెలిదమ్మివిరివాన వెలయకురియదే
సుందరి కన్నెత్తిచూచె నేని
డాలైన నునుకెంపురాలు రాసులు గావె
పడఁతి రెండడుగులు నడచెనేని
చాగుతరసార ఘనసారసౌరభంబు
పొలయదే కొమ్మ యూరుపుపుచ్చెనేని
వితతముగదీని నతులితగతులంతులఁ
గలయఁగలుగుట బహుజన్మఫలము గాదె 175

ఉ॥ ఈరమణీలలాము నను నెంతయుఁగూరిమి పిక్కటిల్లఁగాఁ
దోరపుగబ్బిగుబ్బచనుదోయి యెదం గదియంగఁ గౌఁగిటన్
జేరిచి తేటతేనియలు చిప్పిలఁ దీయనిమోవివిందు పెం
పారఁగఁ జేసి నవ్యమాధురాంచిత భాషలగారవించి వి
స్ఫారమనోజకేళికిని బాల్పడఁ జేసిన సౌఖ్యమెట్టిదో,, 176

కం॥ అని యువ్విళ్ళూరెడి నృప

తినిగనుగొని హితుఁడుపల్కు, ""దేవర! యేఁజె
ప్పినవార్త నిజముగాదే
నను నచటికి నింకఁ బంపు నయ ముప్పొంగన్ 177

కం॥ కామినినత్కులనామము । లేమునివాసస్థలంబదెచ్చటనోతా ।
నేమినిమిత్తంబివ్వన । భూమిన్ వసియించినదియొపొలఁతులుగొల్వన్

వ॥ అత్యంత నిగూఢక్రీడాప్రవర్తితోదారలగు రాజన్యశుద్ధాంతకాంతాజనంబులకడకు మిముబోటిమహానుభావు లపరియత్నంబునం జనుదెంచుట గౌరవశ్రీప్రాతికూల్యంబుగావున వారలవృత్తాంతంబెఱింగి వచ్చెద, 178

చం॥ అనవుడు భూమిపాలకశశాంకుఁడు మిత్రునితోడఁబల్కు "మజ్జనకుఁడు తొల్లి నీ తుహినశైలసమీపవనాంతరంబునన్
వనజముఖీసహస్రము లవారణవై భవలీలఁగొల్వఁగా
వనధరనీలవేణి వరవర్ణిని యోర్తుక వసించి ప్రేమచేన్ 179

వ॥ భవత్సంబంధంబునకై యపారమోహాతిరేకంబున దినంబులుగడపుచున్నది, మృగవ్యసనవ్యాఖేలనవ్యాయామంబునంజని వసంతదినాంతరంబుల నవ్వరారోహంగని వివాహంబుగమ్మనిపల్కెఁ గావున నిక్కరంగనయనమదీయజనకుండెఱింగించినకన్యకామణియగుటఁబోలు నీహిమవన్మహీధరప్రాంతోద్యానాంతరంబునఁ గాంతాజనసమేతయై వసంతదినంబుల మత్సమాగమంబునకెదురుచూచుచున్నదిగావలయు, నీవు చనితద్వృత్తాంతం బెఱింగిర"మ్మనిపనిచిన, 180

క॥ నగుమొగముతోడ నచ్చెలి
ముగుదలువసియించు కుంజమునకేగి యటన్
నిగనిగనికలువరారా
జగతిపయిం గూరుచున్న జవ్వనిఁగాంచెన్ 181

వ॥ కాంచి కించిన్మధ్యలు చంచత్కౌతూహలాద్భుతరసాక్రాంతలగుచునాదరించిపం నచ్చట నాసీనుండై యత్యంతగంభీరమృదుమధుర

చతురవచనరచనల నయ్యాచిరరుచిరుచికిట్లనియె, 182
ఉ॥ "నీలావణ్యకళావిలాసములు వర్ణింపంగరాదేరికో
బాలా! యెవ్వరిదానవీవు, దివిషత్పద్మాస్యవో భోగభృ
న్నాళీకేక్షణవో ఖగాంగనవొ గన్ధర్వాబ్జరాగోష్ఠవో
యేలా యివ్వనభూములందిరుగఁ జేరే మేర్పడంజెప్పుమా 183
మ॥ తెలియంజెప్పెదసావధానముగ మద్వృత్తాంతమాలింపు మో
జలజాతాక్షి సముద్రముద్రిత ధరాచక్రావనోద్యద్విలా
స లసద్రాజశిరఃకిరీటఘటితాంచద్రత్న చిత్రప్రభా
కలితోదారపదుండు శంతనుమహాకాంతుం డెసంగున్ భువిన్ 184
చం॥ జనకుఁ డహో ప్రదీపుఁడఁట, చారుకళాసిధి సారిసారి త
ద్ఘనతరవంశకర్తయఁట, కంధిచతుష్టయవేష్టితాఖిలా
వనితలపాలనోజ్జ్వల నృపల్లభరత్నచయంబు సత్సుహృ
జ్జనఁమట, భోగభాగ్యముల శంతనుఁబోలుదురెవ్వ రంగనా! 186
తే॥ అమ్మహారాజు నన్ను సత్యాదరమున
తనదు మంత్రులలోపల ఘనతఁబ్రోచు
అతనితోడుత సఖ్యసౌఖ్యానుభూతి
నిచ్ఛయించిన నొందింతు నేరికైన 186
క॥ పేరు విశారదుఁడందురు। సారసదళనేత్రి! రాజచంద్రుఁడు మృగయో
దారమతివనికి రాఁగా। వారక నేనతని వెంటవచ్చితిఁ బేర్మిన్"॥ 187
వ॥ అని తెల్పిన, 188
తే॥ మానసముజల్లుమనియె, నెమ్మేనఁబులక
పాళి మొనచూపెఁ, గోర్కులు ప్రబలమయ్యె
గాఢకౌతూహలానురాగమ్ము లొదవె
శంతనునివార్త చెవిసోఁకినంత సతికి 189
• మంత్రితోడఁ జెలికత్తె గంగవృత్తాంతము దెలుపుట •
తే॥ అట్లు బద్ధానురాగయై యంబుజాక్షి

హాసమందాక్షయుత హీక్షణాంచలమునఁ
దనసఖీమణిఁజూచి దద్భావమెఱిఁగి
సరసలీలల నాప్రౌఢసకియు పలికె 190

సీ॥ శ్రీరమాపతియైన నారాయణస్వామి
పదపద్మసీమ సంభవముగాంచె
సకలమంగళదివ్యసౌభాగ్యములలీల
త్రైలోక్యములయందుఁ దగ వసించె
యమునాసరస్వతీప్రముఖతరంగిణీ
తతులలోపలఁ బెద్దతనముగాంచె
వర్ణనీయ ప్రాణివర్గపావనభవ్య
సరసకళా మహోజ్వలత గాంచె
గంగయనుపేరఁబరఁగుని కమలవదన
పరఁగ నేమెల్ల సకిగ న్న ప్రాణసఖుల
మొకమహాకారణముగల్గియుండవలసె
సింధువునకిట్లు లివ్వనసీమయందు 191

చ॥ కువలయపాలమిత్ర! విను గోప్యము సేయఁగ నేల సజ్జనో
త్సవవిలసచ్చరిత్రుఁడగు శంతనురాణ్మణి సద్గుణప్రభా
నివహము తద్గురుండు నయసిన్మలభావలఁదెల్ప నీగతిఁ
శ్రవణరసాయనంబుగ ససంభ్రమతఁ విని మోహితాత్మయై 192

సీ॥ అశ్రాంతసురపకాశ గతాంభశ్చర
ధ్వజకాండవర్షసంతతులఁ దడిసి
అకలంకసాంద్రచంద్రాతపద్యోతమా
నాతపాసర్గళవ్యాప్తినుంది
గంధగోత్రాధరాగమ సుశీతలగంధ
వాహంబుచల్లు బల్వడలఁ గంది
విస్ఫూర్జితాత్మదవిరహసంభూత సు
స్థిరపరితాపంబుచేఁ గృశించి

తపము సేయుచున్నది నృపతిఁగూర్చి
శంతనునిరాక దెల్పితి సరవి వీరి
కిరువురకుఁగూర్ప నీకన్న నెవ్వరింక
మంజువాగ్దేవతాచార్య! మంత్రివర్య!” 193

క॥ నావుడుమంత్రిసుతుండను “దైవాజ్ఞను రాజమణికిఁదరుణీమణికిన్
భావింపఁగననుకూలము శ్రీవిభవము గల్గు వేదసిద్ధాంతముగన్ 194

వ॥ కావున, 195

క॥ శంతనుభూకాంతునకున్ గాంతామణివార్త దెలిపి కౌతూహలసం
క్రాంతాత్మునిఁగాఁ జేసిట కెంతయుఁ దూర్ణమునఁ దెత్తునీక్షింపుఁడొగిన్

వ॥ పోయివచ్చెద” నని పలికి వారిచేత ననుజ్ఞవడసి శంతనుభూకాంతుకడకుంజని కాంతావృత్తాంతంబంతయు విన్నవించిన, 197

తే॥ పులకితతి మేనఁ బొడమెఁ, గపోలయుగళి
చికిలియొనరిచె. లేనవ్వుసిరివహించె
వదన, మనురాగసంపూర్తిఁ బొదలె హృదయ
మతివవృత్తాంత మాలించినంతఁ బతికి 198

వ॥ ఇట్లద్భుతానురాగజలధినిర్మగ్నమానసుండైన మానవేంద్రుసింగనుంగొని, 199

క॥ మానసరసపానభృంగి
గానధ్యానము లనూనగతులందనరం బో
పూనినపొదరింటికిఁజన
మానినివీక్షణము చేసె మానవతిలకున్ 200

సీ॥ అకలంకలావణ్య సుకుమారలలితాంగ
లతికకు మిగులఁ జల్లదనమబ్బె
భువనైకమోహనాద్భుతవిలోలేక్షణ
కైరవంబులకు వైకాస్య మొదవె
స్వచ్ఛతరాఖండసాంద్రీభవత్కౌతు
కోల్లోలజలరాశి వెల్లివిరిసె

సతతప్రతీతగుణజాయమానప్రచిం
తానమవాయాంథతమముదొలఁగ
గీ॥ సురుతరాంతఃపరిపూర్ణ వియోగజనిత
తతపరిశ్రమభూరిసంతాపమణఁగ
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రరాజ
చంద్రసందర్శనంబునఁ జారుముఖికి॥ 201

క॥ తరుణీమణిచూపు మహీ
శ్వరుచూ పన్యోన్యధైర్యసంపద లహహా!
హరియించెఁ జికిలియొనరిచు
సరసీజాంబకుఁ జుఱుకుపు సరిగోలలకున్॥ 202

వ॥ అయ్యెడ, 203

చ॥ కలికిమిటారి వాల్కలుకుకన్నులఁ గమ్మదుసిగ్గు పెంపునన్
లలనమొగంబు వాంచి పదలగ్నమణీకటకోదయర్ఝళం
ర్ఝళమధురాయతార్భటుల సంచల దంచితమధ్యకీలితో
జ్జ్వలరశనోరుకంకణభవ స్ఫుటరావము లైక్యమై తగన్॥ 204

తే॥ లేచి కుచకుంభభరమున లేఁతకౌను
వడఁక శశికాంతవేది నింపడరఁ గదలి
సఖులతోడ సకుంజము చాటుకరిగె
మేఘతతిమాటుకరిగెడి మెఱుపనంగ 205

సీ॥ నిలంపురాకప్పు మీలుమేలననొప్పు
విప్పైన గొప్ప కీల్కొప్పుచొప్పు
కొదమసింగముఁ దీరు నదలింపఁగాఁ జోరు
కలికి లేఁతమెఱుంగు కౌనుసౌరు
ఇసుకతిప్పలఁ గ్రిందు వేసిచేసి రహించు
సుందరంబైన పిఱుందుపొందు
పసిడియంచలఁ జిక్కుపఱుపఁగాఁ దగ నిక్కు
డంబైన మందయానంబుటెక్కు

మానినీమణిసోదరింటిమాటుకరుగ
నరసిజాక్షులతో నట మరలునప్పు
డవనిపాలేంద్రు మానసాబ్జాంత గాఢ
మతులమోహాతిశయమున నలరఁజేసె॥ 206

వ॥ ఇట్లు నికుంజంబుమాటున నిల్చి తదీయరంధ్రంబుల రాజకుమారమన్మథుం గనుంగొని యొక్క ప్రౌఢయగు ననుఁగుచెలితో నిట్లనియె, 207

క॥ "కంతునిజోడము రజనీ
కాంతు వసంతుని జయంతుఁ గనుగొనమో యో
కాంతామణి! యీవసుధా
కాంతునిబోలుదురె రూపగౌరవలీలన్॥ 208

చ॥ సకియరొ! యీనృపోత్తముని చక్కదనంబు విలాసవైభవం
బకుటిలలీలఁ గన్న లలితాంగుల నిబ్బరపుబ్బుగబ్బిగు
బ్బకవలమధ్యరంగముల బంగరుగేదఁగిపువ్వుతేకు మేల్
చికిలికటారిచేగుదిఁ గచిక్కనగ్రుమ్మఁగ మారుఁ డుగ్రుఁడై॥ 209

తే॥ ఇతనిఁ గౌఁగిటఁ జేర్చి పెంపెసఁగఁ గ్రోవి
విందుగాఁగొని రతికేళి నొందనట్టి
వనిత తారుణ్యలావణ్యవైభవములు
అడవిఁగాసినవెన్నెల లౌటగాదె 210

సీ॥ పికవాణులకుఁ జాలఁ బ్రియముపుట్టింపదే
యతివ! యీతని పల్లవాధరంబు
కువలయాక్షుల కెదఁ గోర్కెనొందింపదే
సుందరి! యితని పూర్ణేందువదన
మబ్జాతముఖులకు నాసగల్పింపదే
తెలివ! యీతని సూర్యదీప్తిమహిమ
సారంగకచల నోరూరంగఁజేయదే
వనిత! యీతని మధువాక్యరచన

సుదతి! యీతనిచైత్రభానురవిలాస
మెట్టిలతికూనలకునైన నెలమిపుట్టఁ
జేయదే"యని యాశ్చర్యసింధుమగ్న
మానసాంబుజయై పల్కె మఱియు సఖికి 211

మ॥ చిరకాలంబుననుండి యీతని మదిం జింతించి చింతించి స
ద్విరహ ప్రాకట వేదనాభరమునన్ గ్రాఁగంగ విన్నాళికే
ధరణీనాథకులావతంసు నిటకున్ సల్లీలఁ దోడ్తెచ్చె నీ
శ్వరుఁ డత్యంతదృఢానురాగమగు మత్సంకల్ప మీడేర్పఁగన్ 212

వ॥ అనివర్ణించుచుండ నప్పుడు, 213

శంతనుమహారాజునకు నారాయణమూర్తి ప్రత్యక్షమగుట

సీ॥ కమలాద్యలంకారకలితంబులై భుజాం
తరనేత్రములు మనోహరత మెఱయ
ఘనసువర్ణాంచత్ప్రకాశమానంబులై
నేత్రగాత్రములు నెస్సియఁజెలంగ
ప్రస్ఫురద్ద్విజరాజరాజమానంబులై
ధ్వజవదనంబులు తనరుచుండ
మంజులతరానంతమణిసుందరంబులై
కోటీరదీప్తులు కొనలుమిగుల

గీ॥ అపుడు ప్రత్యక్షమయ్యె నారాయణుండు
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రు నెదుట
అమలశతకోటికోటిజన్మాంతరార్జి
తాతివిస్తరసుకృతమాహాత్మ్యమునను॥ 214

తే॥ అట్లుసాక్షాత్కరించిన యాదిదేవు
భక్తవత్సలు నిందిరాప్రాణనాథుఁ
గాంచి పులకితగాత్రుఁడై కౌతుకాప్తి
తాతిశయములువొడమ సాష్టాంగమెరఁగి॥ 215

వ॥ లేచి ముకుళితకరకమలకలితలలితఫాలభాగుండై యిట్లని స్తుతియించె, 216

దండకము॥ శ్రీభామినీ భూమి నీళా సువృత్త స్తనన్యస్త కస్తూరికాపత్రగుచ్ఛాంకి తోద్యన్మృజామధ్యమధ్యాహ్నవనాసీన ఖద్యోతకోటి ద్యుతి ప్రస్ఫురత్కౌస్తుభాంచన్నిహార! నీహారగోచిఃకళాశేఖ రాంభోజగర్భాముఖేంద్రాద్రిజా శార్ఙ్గజా తామిషా శక్త్రిరా జాని లేశానమిత్రాది గీర్వాణకోటీరకోటీస్ఫురత్పద్మరాగ ప్రభారాజినీరాజిత భ్రాజితామేయరాజీవ రాజీవవిద్విడ్ధ్వజా బ్జారిరేఖా సమాలంకతాంఘ్రిద్వయీభాసమానా సమాన ప్రభావాద్భుతానంతకల్యాణగంభీరశుంభద్గుణాధార! యాధారచక్రా ద్యశేషోల్లసచ్చక్ర లీలాక్రమారూఢపంచానిలాకర్షణోద్యత్త్రికూయా హేతుజాలంధరోడ్యాణమూలాఖ్య బంధానుసంధాన ధారేయతాకించి దుత్తంభితాచ్ఛాదితా యుగ్మశకీభవత్తార కాదంద్వసందర్శితా భంగశృంగాట కాంతస్థలాభోగయోగీంద్రసంప్రాప్యమాన స్వయంభూతభాస్వచ్చిదానందరూపా! శరత్కుందకుందా రవిందారి బృందారకానేకపా నోకహానీక నాకాపగా దందశూకేశ కాశ ప్రతీకాశకీర్తిచ్ఛటాచ్ఛచ్ఛవిచ్ఛన్న నానాదిగంతా! ముకుందాచ్యుతానంత! తాపత్రయాంభోజ కాంతార హేమంత! దేవాదిదేవా! మహాదేవ! నీ దివ్యమాయావిలాసప్రభావంబు భావంబునన్ నిల్పి వర్ణింపఁగా శేషభాషావధూటీపతుల్ చాలలేమన్న చో నేను వర్ణింపశక్తుండనే, యొక్కమాఱెక్కువా చొక్కపుం డెక్కునం బాల వెల్లందుఁజెల్వొందు నా తెల్లదీవిన్ వికుంఠాభిధానప్రథానస్ఫురత్పట్టణాంతస్థితానంతభోగీశ్వరాభోగభోగాంచితా నల్పతల్పాగ్రభాగంబునం బద్మసద్మానుకూలక్రియారూఢ కేళిన్ వినోదింపవే, యొక్కమాఱుక్కునం జక్కిలోకంబునందుండి దంభోళికోట్యుల్లస ద్ఘోరసారాతిశాతోరుధారాకరాళోగ్రచక్రంబునం జక్రవిద్వేషులన్ భీమసాయోధనోర్విన్ సముద్దండులన్ మించి ఖండింపవే, యొక్కమాఱుగ్రకాంతారదేశంబుల

ముద్యదధ్యాత్మవిద్యానవద్యోద్యమాభేద్యహృద్యోల్లసద్యోగిరాణ్మా
నసాపారకాసారసంచారహంసావతంసంబవై మీఱవే, వాసుదేవా!
భవానీనుతా! గ్రచ్చరన్ మచ్చరూ పుచ్ఛమై పొచ్చెముల్ లేక శోం
పంగనాలచ్చినింగన్న యిల్వొచ్చి మాయామ్నాయపాటచ్చరుం జెచ్చెరన్
వచ్చి ప్రాబల్యలం గ్రమ్మఱందెచ్చి పెంపెచ్చ మేల్పచ్చువిల్ లెక్క
నిద్రాహుమా తేజివై నేగు బల్వేల్పుగం మెచ్చంగా మచ్చికన్ వేగమం
దిచ్చితీవేకదా, పక్షిరాడ్వాహనా! మోక్షనంధాయుకా! పోత్రిరూపంబు
చిత్రంబుగాఁదాల్చి ధాత్రీస్థలిం జక్కగాఁ జేసి హేమాక్షరక్షోగణాధ్య
క్షుఁ గల్పక్షయాక్షీణతీక్ష్ణాంశుశుక్షుణ్యఖండస్ఫులింగాతిభాస్వత్కరోదగ్ర
గ్రదంష్ట్రాగ్రభాగంబునం గ్రుమ్మితీవేకదా, మాధవా! నందిగోమా
ధవా! జంభభిద్ఘోరదంభోళిగంభీరసంరంభముం బాపి మా కీలికీలా
కలాపంబు నిర్మూలముం జేసి దండిన్ మహాహాద్రాడతన్ జెండి గర్వోద్ధ
నాథున్ వశత్వాస్యసం జేసి కంధీశు దర్పాంధమున్ బాధుగ్రప్రాపించారిం
చి గాలిన్ విపాలించి యక్షేశు భిక్షేశుఁగావించి గంగాధరున్ భంగ
ముం జేసి యేదిక్కునం దానవై వేఁడిమిన్ మూఁడులోకంబులున్
పీఁకఁ జీకాకుగావించి హాలారసాగూన సానక్రియాహోలపేలాత్మకత్వం
బునన్ మంత్రముల్ తంత్రముల్ శైలముల్ వేదముల్ వాదముల్
గాలియుం గీలియుం దానె బ్రహ్మహాసుం చుం గరాళించు నా జాడ
వారక్కసుం డెక్కుమాన్పంగ మున్నామ్రపు పేరుక్కునం జొక్కమా
యుక్కుగంబంబు కల్పక్షమానల్ప కేళీవిహారోల్లస ద్వైరవాఖండహుం
కారగర్జాభటీధాటికామ్రేడితప్రస్ఫురత్తర్భుజా ఘౌకమానోగ్రక్రాకృతి
ఘంఘంఘమంఘంఘమద్ధ్యానభీమంబుగా నీఁక ఘెళ్ళిల్లినన్ గ్రిల విశ్వైన్మ
హావిశ్వవిశ్వంభరా భారధారేయకుంభీంద్రకుంభీన సాంభశ్చరాకాల్
వడిన్ ప్రుగ్గి ముల్లోకముల్ హాల్లకల్లోలమున్ జెంద బ్రహ్మాండభాం
డంబు (ఘూర్ణిల్లఁ) గల్పాంత వేళాసముద్దండచండప్రభామండలాఖండ
చండాంశుపాలాక్షపిక్షాంశుశుక్షుణ్యమాఘుజ్వలజ్జ్వాలికా మాలికాద్వా

దశద్వాదశాత్మాతిసిద్ధ్రద్రరౌద్రక్రమోద్రేకతాత్కూద్రసద్వీరభద్రార్జునా
ఖర్వఘోరం బహార్యంబుగా వేగఁగన్పట్ట శ్రీనారసింహాకృతిం
బుట్టి ప్రహ్లాదు నాహ్లాదునింగాఁ జేసి యుగ్రాంఘ్రి జాగ్రన్నఖాగ్రంబులం
దన్మహాహ్లాదగ్రనతీకశావాటంబు విక్షోభ మొందించి తీవేకదా, లోక
రక్షామణీ! దేవచూడామణీ! వేల్పురాతల్లికిం బట్టవై గుట్టునం బొట్టి
రూపంబునం బుట్టి బల్గట్టులం జట్టువగ్గొట్టిన ట్టెక్కుఘుం బుట్టి చేపట్టి నేకం
టినేకంటినామింటివాకిలు గెంటించియొప్పారుబల్దంటుకున్ జంటయైతమ్మి
లోఁగింటిహాల్గంటితో నంటుకొన్నన్ హరిం దమ్మికంటిం దగన్ మంటినం
చెంతయున్ గొంటుదైత్యుండు వే పంటముం ద్రైదువన్ మూఁడుపాదం
బులీయుంగ మిన్నంటి వాసిన్ సమేపంబులోఁ గంటివిన్కూలెదువాళ్లిం
చుచోఁటంటఁగాఁ ద్రొక్కి పెన్వ్రేలునన్ వింటిజాల్గంటి వివేకదా, నిల
జీమూతధామా! పవిత్రైకనామా! మహాహ్లాదధామా! భీమాహవక్షో
ణిదోర్దండదండాభోగోస్కంభితక్రూరారాతిభాస్వత్కుఠారోగ్ర
ధారాహతింగా క్షత్రవిద్యాది నానాజనాశ్వాదశ్రేణి ముయ్యేడుమారుల్
ధరంగూల్చి సప్తాబ్ధిరాణ్ముద్రితాఖండసర్వంసహామండలం బంతయుం
గశ్యపబ్రహ్మకున్ యాగకాలంబునన్ దానముచ్చెల్లలోకంబులన్
భార్గవఖ్యాతి చేమీరుటే తీవేకదా, పద్మపత్రేక్షణా! భక్తచింతామణీ!
సూర్యవంశంబునం దుర్వి దశస్యందనక్షోణిభృన్మౌళికిన్ రామచంద్రుండవై
పుట్టి మర్యాద నానాలసత్ప్రీణితదాంతరాపూర్భవద్రక్షసక్తాసభాస్వద్గ
దాఘటకం దాటకం గూల్చి గాధేయుయాగంబు వేగంబునం గాచి
పాదాంబుజాతాగ్రరాజత్పరాగంబునం గంటివాల్గల్గు వాచంయము
శ్రేష్ఠుసిల్కల్ప ఖండించుకోటంరతోదండదండప్రథగ్నప్రచండార్భటీకంపిత
శ్వేతభూభృన్మణీకందరాలోలశైలాధిరాట్కన్యకాలింగనాభంగసౌఖ్యా
నుషంగంబునన్ దివ్యగంగోత్తమాంగుం బ్రహృష్టాంతరంగిత్వ మొం
దించి సీతన్ మహీజాతఁ ద్రైలోక్యమాతన్ లసత్కాంతలశ్రేణి
బల్కొత్తిముత్తింపుగ్రాల్నింట చేపట్టి మార్గంబునన్ భార్గవున్ నిర్గ

తానర్గళాఖర్వగర్వోద్ధతుం జేసి వే తండ్రిపంపంగఁ దమ్ముండునున్ భార్యయుం దోడరాఁ జండవేదండకాండద్విషద్గండభేరుండశుండాలభిన్నాండలోద్యన్మహాదండకానామకోగ్రాటవీవాటి వర్తింపుచున్ సాధులోకాపరాధుల్ పరాధుల్ వనక్షోణిపాల్చేసి మౌనివ్రజద్వేషణుల్ దూషణుల్ భీషణోష్ణప్రకాండంబులం గూల్చి మాయాఖరుండౌ ఖరుం జంపి జాళ్వాముకంబై భ్రమింపంగ మారీచునిన్ సిచుసింద్రుంచి వాలిం గరోన్మూలతాహార్యపాళిన్ మహాశౌర్యశాలిన్ సమిద్భాగమందార్కకోలన్ పడంగూల్చి సుగ్రీవు భాస్వన్మణీహారవిభ్రాజితగ్రీవుఁ గిష్కింధకుం బట్టముం గట్టి గోపుచ్ఛకశ్చాచ్ఛభల్లాఘుమల్ డబ్బదిన్ రెంపువల్వాల తగంగోల్వ మాద్యద్గిలోద్యత్తిమిగ్రాహవారానసామ్రాట్కళీరీఢులీవ్యాళభేకశిలాసంకులోత్తాల సయూర్మిమాలిన్ శరాగ్రమ్మునం దానెముత్తెంబుగా సిల్పి దుర్వారయుష్మద్వచోహేతుతిన్ సేతువుం గట్టి పే కుంభకర్ణాతికాయేంద్రజిత్కవ్యకీలాలధారాప్రవాహంబునన్ శాకినీఢాకినీభూతభేతాళికూశ్మాండకబ్రహ్మరక్షఃపిశాచాళికం బ్రీతిగా నామెతల్ వెట్టి తెల్లా కృవ్విద్రావణున్ రావణున్ వీఁకి సంక్రందనస్యందనంబెక్కి పిరోద్ధతిన్ మట్టి సంగ్రామరంగస్థలీనాట్యకృద్భద్రకాళిం దదుద్యచ్ఛిరఃకందుకక్రీడవాటింపఁగాఁ జేసి యాచంద్రతారార్కమౌనట్లు లంకాపురాధీశుఁగా బంకీకిం రానుజున్ సిల్పి సీతామహాదేవితోఁ గూడ నాకేతముం జేరి పట్టాభిరాముండవై తీవకావే, భుజంగేంద్రశాయీ! మహాభోగదాయీ! ప్రలంబాదిదుష్టాసురశ్రేణులం గూల్చి కాళింది భేదించి బల్నాగటన్ హాస్తినాపట్టణం బుగ్రలీలం బెకల్పెల్లలోకంబులన్ రేవతీవల్లభఖ్యాతిచెన్నొంది తీవెవ్వఁడా, కేశవా! భుక్తిముక్తిప్రదా! వృష్ణివంశంబునన్ శంఖచక్రాదిపంచాయుధోద్యద్భుజాద్వంద్వయుగ్మంబునం బితకౌశేయముం దాల్చి వ్రేపల్లెలో గొల్లలెల్లన్ సముల్లాసమొందంగ బాల్యక్రియల్ మీఱుచున్ వింతబాలింతరాకాసిపాలిండ్లపాల్గ్రోలి బల్లిండమై బండిపై మెల్లనే చిన్నిపాదాబ్జ

ముల్ మోపి చక్రాసిలాదిత్యవిద్వేషికంఠంబునన్ లాలియూఁగింపు మీఁ
ఱంగఁ గౌమారికక్రీడలం గాళియాభోగభోగాగ్రభాగంబునన్ మంజు
మంజీరశింజానినాదమ్ము లొక్కుమ్మడిన్ సందడుల్ సేయ నానందనా
ట్యంబు గావించి లీలన్ శరత్పూర్ణరాకానిశావేళలన్ సింధుజాబిల్లి
యుద్దండతం బండువెయెండ బ్రహ్మాండభాండంబు సండారఁ దండోపతం
డంబుగాఁ గాయఁ బొచ్చెంబులే నచ్చుపుం బచ్చకల్లలు బల్తావులన్ మెప్పు
చున్ వేడ్క బృందావనారణ్యభాగ ప్రభాస్వత్కళిందాత్మజాతీరవి
స్ఫారవానీరనాసంతకోమల్లికావల్లికాకుంజపుంజాంతరాళోల్లసత్స్వ
చ్ఛసుచ్ఛాయలన్ వేణురంధ్రంబులన్ వల్లవస్త్రీప్రశస్తోరుహస్తాంగుళీ
పంచమాంగోల విన్యాసనైపుణ్యలీలాగతిన్ మంద్రతారోల్లసన్మధ్యమ
వ్యాప్తలోప్యం సప్తస్వరస్ఫాయదానందకందంబుగా బ్రహ్మగాంధ
ర్వగానంబు సేయంగ నాలించుచుమ్మిల్ మఱందుల సుతుల భ్రాత
లున్ దాతలున్ వల్లభుల తల్లులుం దండ్రులున్ సారె వారింపఁగా
కోకచెంగల్వసజావజ రుధిరం దయ్యుఘాణావుమా ఖత్తులాణంబు హో
సిన్ దువళించు సంపంగపుం హాస్కలీబంధుతటిన్ మిటారించు
క్రొత్తావిగేదంగను మ్మగ్గుఖండముఝురిన్ బరాసన్ పడన్ డుస్స మర్మస
లంబుల్ విదారింప వారంపఁగారాసమాహాంబులన్ మేఖలాదామ
ముల్ విడఁగొట్టఁగలల్లాడఁ దారుణ్యలావణ్యలీలాంగముల్ వాడ బల్
కోరికల్ సారె డెందంబులన్ దూరసట్ట్యార్పులంతంతకున్ మీఱ సిద్దా
జరిరంగుసింగారపుంజీసచెంగావినున్నొయ్యెదల జాఱ రాధాసుధా
మంజువాణముఖానకివిల్లోల్ల సద్ఘోషయోషామణుల చేరరా మీఱ
కౌశిక్యకిశౌసౌక్తిమార్గంబునం దత్సతదశజాలస్వభావంగతాదుల
మనోదృష్టి నిత్యుంచు చెంచద్గతిన్ నాగరంద్రాణశకిస్వస్తకానిపిషాబ్జాది
బంధంబులన్ సత్కళాస్థానముల్ ముట్టుచుంజుంబనాశేషనర్మక్రియాలేపాం
మీనధ్వజాయోధనక్రీడలంగూడ గోగోపికాగోపకశ్రేణి బల్ప్రాలివానన్
ధరన్ మ్రొంద గోత్రంబు ఛత్రంబుగా సప్తరాత్రంబు లత్యంతసూత్రంబు

సంగేలఁ బై కొత్తి కంసుం ద్రిలోకీనృశంసుం బడిన్ జంపి వైదర్భికన్యా
దికాంతాలలామాష్టకంబుం బదార్వేలఁ బెండ్లాడి మందాకినీవిస్ఫుటా
ష్టాపదాంభోజ సౌగంధికక్రాంతి గంధానిలాందోళితైలా లతామంది
రాళిందమందార మాలస్థలీకాంతి చింతామణీ వేదికాసీనగంధర్వ
విద్యాధరద్వంద్వవీణానినాదోల్లసన్నందనోద్యాన వాటీస్ఫురత్పారిజా
తావనీజాతముం దెచ్చి సత్యావధూకేళికారామవాటిం బ్రతిష్ఠించి దష్టా
సురాంశోదితానేక రాజన్యవీరావళిన్ జన్యరంగంబులం గూల్చి సర్వం
సహాభారముం బాపి తీవేకదా, సజ్జనాధార! గోవర్ధనోద్ధార! బుద్ధా
కృతిం బౌరనారీశిరోరత్నముల్ భూరిసత్త్వాతిరేకంబునం జేయునోముల్
నివారించి వ్యాఘ్రాసురధ్వంసికిం దేరునున్ సారథిన్ బాణబాణాసనో
ద్యత్తనుత్రాణకంఖాణతూణాదులుం గూర్చి మధ్యాహ్నకాలంబునన్
మూడువీడుల్ నిమేషంబులో భస్మమై పశ్చిమాంభోనిధిన్ రాలఁగాఁ
జేసి తీవేకదా, యచ్యుత! శార్ఙ్గపాణీ! ధరిత్రీస్థలిన్ దుష్టనీచాత్మ
పాషండవర్ణాశ్రమాచార ఘాతుక్యులన్ మేటిఘోటంబుపై నిటుమీ
అంగి లంఘించు బాహాగ్రజాగ్రత్స్ఫురత్ఖడ్గధారాహతిం ద్రుంచు కల్యాకృ
తిన్ మీరుటే తీవేకదా, దేవదేవా! నమస్తే నమస్తే నమః, 217

నాగబంధ చంపకమాలావృత్తము

చ॥ నరహరిరూప! శౌరి! హరినారదసన్నుత! లోకనాయకా!
శరగృహా! గోపపరివర! సారసహాస! హరాధవాస! భా
స్వరసకలావనీరమణ! బాణమదద్విడ్భూరిసంహా! శ్రీ
హరి! విధజాతకారణమహామహా! యజ్ఞవరాహసుందరా! 218

దోష్ట్యంతకందము

క॥ ప్రాపొప్పఁ బ్రోవుమీ వే। మాపాపముఁ బాపిమమ్ము మాభూమీభా
మా ప్రాభవభూమాట్టా। బాపవిభృత్ప్రభవప్రభవ్యప్రేమా! 219

ఏకశబ్దచ్ఛలాంత్యనియమయుక్తపదగ్రస్తనిరోష్ఠ్యకందము

క॥ శరఖండిత ఖరానాశర!

శరణాయిత లలిత కలశజలరాశిశరా!
శరజాననార్ద్రదశశర!
శరవేణధరాస్యధరహసన భశితశరా! 220

చలజిహ్వాకందము

క॥ శ్రీరాధాహృదయప్రియ! నారాయణ! లక్ష్మణాగ్రజ! నళినదళాక్షా!
క్షీరనిధినిలయ! లక్ష్మీ! ధౌరేయోద్ధార! వరద! దశరథకృష్ణా! 221

అచలసింహాకందము

క॥ మాంభూపగోపపాపమ! హాభోగివిహంగపుంగవాంభోవాహా!
బాధవభూభాగప! వీభాన్వకగేహ భావవిభవాభోగా! 222

మత్తేభకందగర్భసీసము

సీ॥ విజయలక్ష్మీవర! విబుధగణనుతా! శౌరిద్విజానుజా! ముకుంద!
విలయకాలానలభీషణోగ్రస్వహారి! లక్ష్మీమహోరస్థలా! రమేశ!
వినయలీలాన్విత! విప్రవర్ణిత! హరి! నారాయణోద్యద్గుణా! మహాత్మ!
విభయదానాశరవిక్రమక్రియాహరా! బ్రహ్మాండభాండోదరా! రమేశ!
హరివరశయాన! కేశవ! గరుడగమన!
జలజనయన! కంధిభవన! శంకరసఖ!
శరధరనిభభాస్వరదేహ! సరసవిభవ!
కుజనగణహరణామేయ! వృజిననాశ!" 223

క॥ అని సుస్థిరభావంబున వినుతించుమహీంద్రు వినయవివేకా
ద్యనవద్యగుణము లెన్నుచు వనజాక్షుండు వల్కె మధుర వాచాప్రౌఢిన్

మ॥ "జగతీనాథకులావతంస! వినుమా చక్రక్షమాభృన్మణీ!
జగతీచక్రములోపలన్ గత భవిష్యద్వర్తమానంబులన్
దగ నిన్ బోలినభూమిపాలకుడు తథ్యం బెన్నగా లేడు, నీ
సుగుణప్రాభవవైభవాదులు మహాచోద్యంబు పుట్టించెడిన్ ॥ 225

వ॥ అదియునుంగాక శారదఘన మారదమన పారద ఘనసార
శర క్షీర సురాహార ధరాధారఫణి శ్వేతఘృణి శ్వేతధునీ గోతరుణీ

తృణీకరణనిపుణాఖండపాండురయశోమండలమండితుండవు, నిజభుజాత్యుగ్రజాగ్రన్మండలాగ్రధారావిఖండిత విమతసర్వావనీమండలాఖండలప్రకాండకాండభృద్వాహనహరిద్వేదండ శుండాదండసముద్దండభుజాదండఖండమణికుండలఘృణిగండలలితోత్తమాంగుండవు, నలరాజ రాజరాజకుమార రాజరాజకుమార కుమార విష్ణుకుమార జిష్ణుకుమార వసంత నాసత్య సత్యసౌందర్యరేఖావిరాజితుండవు,సురభిసురధరణీరుహావర మణితిలక కలశజలనిధి జలధర బలి శిబిమనుజవరారోహణధరాధర నిర్భరవిశ్రాణనపరాయణుండవు, నట్లగుట భవత్సమాగమంబు చింతింపుచుఁ జిరకాలంబుననుండి యువ్వనాంతరంబున సఖీజనసమేతయై మదీయకన్యకాశిరోమణియగు గంగ వసియించియున్నది. నీ వవ్వరారోహం బాణిగ్రహణంబు సేసికొనవలయు, నెల్లి శుభముహూర్తంబు, ప్రాలేయశైలోపకంఠంబున విశ్వకర్మచే నొక్కపురంబు చేయించెద, యుష్మద్బంధుమిత్రామాత్యపురోహితసామంతాదులఁ బిలువంబంపు" మని తక్షణంబ చతుర్దశభువనశిల్పానల్పశిల్పకళాధురీణుండగు విశ్వకర్మం బంచిన నొక్కపురంబు గావించె, 226

సీ॥ ఎచ్చోటఁ జూచిన నింద్రనీలచ్ఛటా
చకచకల్గల తుంగసౌధతతులె
ఏవంకఁ గనుఁగొన్న జైవాతృకోపల
గోమేధికాంచిత కుట్టిమములె
ఏచాయఁ జూచిన హీరమణివ్రాత
దీపితకమనీయగోపురములె
ఏమూలనరసినఁ జామీకరస్తంభ
దేదీప్యమాన మందిరచయములె
ఎచటఁ బొడఁగన్నఁ గురువిందఖచితరుచిర
మంటపంబులె,యెటఁగన్న మహితగంధ

బంధురాభ్రంకషద్రుమోపవనతతులె
భాసురంబైనయట్టి యప్పట్టణమున 227

సీ॥ కాంచనభూమిభృత్కల్పనాప్రాచుర్య చాతుర్యసందర్భసరణినొనరి
భీషణాపారగంభీరజృంభిత వారిరాశివిధాయకప్రౌఢిమఁ దగి
కల్పకసంతానకలితసంక్రందనారామకరణస్ఫూర్తిరహింవహించి
రాజమానోత్తుంగరమణీయవైజయంతకరచనాచమత్కారమొంది
మొనసి కంజాతసంజాతమూర్తి వేడ్కఁ
జేసెగాఁబోలుఁ దన హస్తశిల్పిమహిమ
జనులకెఱిఁగింపనన నొప్పు సాలఖేయ
భాసురోద్యానవరహర్మ్యపంక్తులచట॥ 228

సీ॥ సానఁబట్టిన సూనశరునిశస్త్రంబులో
పొలుపొందురతనంపు బొమ్మలోకొ
ఆణిమెఱుంగుముత్యమ్ములనిగ్గులో
సొబగొందు వన్నెలసోగలోకొ
శృంగారరసమొల్కు చిత్తరుపత్రిమలో
శ్రీలఁ జెల్వగు చంద్రరేఖ లోకొ
మురిపెంపురతిచేతి ముద్దులచిల్కలో
మెఱుఁగైన తొలకరిమెఱుఁగులోకొ
పొలుచు బంగిరు రాయంచబోదలోకొ
కొమరుమిగిలిన విరితేనెకొలఁకులోకొ
యనఁగఁ దైర్లోక్యమోహనహావభావ
గతుల విలసిల్లుదురు పురికన్నెసతులు॥ 229

మ॥ పురిసౌధాబ్జశిలావితానములు సంపూర్ణతుషారాద్రివా
త్కరయుక్తిఁ జెలరేఁగులై దివిజగంగంగూడి స్వర్గంబుపైఁ
బఱపం దజ్జలముగ్రతుండముల నొప్పం దాత్రి గీర్వాణహ్యా
ద్భరితాంచచ్ఛయమ్ముఁ హరించి చెలఁగుఁ భద్రేభసందోహముల్

క॥ తుంగంబులు రణరంగా। భంగంబులు భూరివిమతపార్థివపటలీ
భంగంబులు తన్నగరశ। తాంగంబులు శుద్ధమేరుధరశృంగంబుల్

మ॥ కరు లుద్యద్బలభద్రసంపదలఁ జొక్కంబైతగం జక్రభృ
ద్గరిమందాల్చె, శతాంగసంతతులు కంఖాణంబులుం సద్భటో
త్కరముల్ మేలసమాశుగాప్తి ననిరుద్ధశ్రీలఁజెల్వార, త
త్పురి వర్ణింపఁగశక్యమే తగ స్వయంభూముఖ్యదేవాళికిన్॥ 232

వ॥ ఇట్లత్యంతసుందరంబైన యుప్పురవరంబులోన, 233

సీ॥ మగరాలగోడల నిగనిగల్ గలడాలు
చెలువైన పంచవన్నెలలు గాయ
నీలంపురాకట్లు జాలకచకచకల్
గాఢాంధకారంబు గ్రమ్మఁజేయు
జాతిమేల్ప్రాఁకెంపురాతితీనెలజిగి
చరమసంధ్యారాగగరిమనింప
పగడంపుజోడెకంబముల నిద్దపుఁదళ్కు
తరుణాతపంబు విస్తరిలఁజేయ
గరుడపచ్చలతోరణకాంతి దిగ్వి
శాలలోచనలకు నిశాచర్చయొనఁగ
భావచిత్రకళాభిరూప్యంబుగలిగి
రంగుమీఱిన యంతఃపురంబులోన॥ 234

క॥ పులుగులదారికి నిపోయిన
తళతళమనుతీఁగెమెఱుఁగు తలతలమను మై
తళుకుగల కూఁతుతోడుత
జలధరవర్ణుండునిలిచె సముచితలీలః॥ 235

వ॥ ఇట్లునిలిచి యయ్యెడ, 236

చ॥ తరుణశశాంకచూడునకు ధాతకు దుగ్ధతరంగిణీమనో
హరునకు దైవతాగురున కత్రివసిష్ఠముఖర్షిలోకశే

ఖరులకు వావవార్ధవరకంధిపముఖ్యదిగీశకోటికిన్
గరుడుని చేతనంపెఁ గుతుకంబునఁ బ్రతివివాహపత్రికల్॥ 237

క॥ సరసీజపత్రనేత్రుఁడు
కరమురుదగఁబంపినట్టి కమ్మలుగని సు
స్థిరచిత్రకళాన్వితులై
బరువడిఁ రాఁదొడఁగి రల సుపర్వగణంబుల్॥ 238

సీ॥ గోరాజమణిచంద్ర గోరాజమౌళిచంద్రి
హరిదేవతాచ్ఛాయ లతిశయిల్ల
సారంగధరమిత్ర సారంగధరమిత్ర
నేత్రత్రయస్ఫూర్తి నివ్వటిల్ల
సారంగఘననీల సారంగఘననీల
కంధరాబంధురకాంతి దనర
పుండరీకశరాభ పుండరీకశరాభ
భసితాంగరాగంబు పొసఁగుచుండ
క్రొత్తసుత్రాంపువన్నియగిత్తనెక్కి
పరఁగు సామేన గిరిముద్దుపట్టి చెలఁగ
ప్రమథగణములుగొల్చిరాఁ బార్వతీశుఁ
డరుగుదెంచెఁ దదీయకల్యాణమునకు॥ 239

ఉ॥ బంగరుబొజ్జలోపలను బ్రాఁజదువుల్ గదలంగ నిద్దపుం
బంగరుఱెక్కజీఁగలుగు పక్కిపిసాళిపటాణినెక్కి ది
వ్యాంగమయూఖసంఘము లహర్పతి మాగ్పడఁజేయఁ బల్కుచా
నం గొసవచ్చెఁ బెండ్లికిని నల్గడ బ్రహ్మలుగొల్వ ధాతయున్॥ 240

సీ॥ తనలోని నవహీరమణిగణాచ్ఛచ్ఛవి
చ్ఛటమీఱు మందహాసంబు చెలఁగ
తనలోని యువదాతవనజాతముల సౌరు
గలిగియొప్పెడి గొప్పకన్నులలర

తనలోని రోహిణీతరుణీమనోహార
బింబంబుఁబోలు మొగంబుదనర
తనలో మనోహరోద్యత్తరంగంబుల
బెడఁగుగల్గిన వెల్లగొడుగులలర
తనదుమధ్యస్థచ్రకాంతతతి మనోజ్ఞ
ధవళచామరములు సరిద్వ్యవతిమణులు
పరఁగవేయంగ దివ్యరూపంబుఁబూని
వార్థినాథుండువచ్చె వివాహమునకు॥ 241

సీ॥ అమరీకరోచ్చలచ్చమరివాలాంచల
మరుదంకురమ్ములఁ గురులుగదల
నిమిషహీనసహస్రనేత్రపీతాళులు
శచిమోముదమ్మిపై సంభ్రమింప
ధనరాజవనరాజధర్మరాజాదులు
గురుజయంతులు వేడ్కఁ బిరుదరాఁగ
రమణీయతరనీలరత్న చింతారత్న
కీలితకనకభూషాళిమెఱయ
కల్పకలతాంతమాలికా క్రమసురభి
నినుమడింపుచు దివ్యచందనసుగంధ
సారచర్చామచర్చికాసౌరభంబు
నెఱయ సితకరిపైవచ్చె సురవిభుండు॥ 242

సీ॥ మందారనవపుష్పమాలికావృతములై
బలుకీలుజడలు శ్రోణులనటింప
గోవము త్రైపుజంటకుట్టుహారాంబట్టుచ
నట్టులు గుబ్బలగుట్టుదెలుప
వలిపెచెంగావిపావడలతళ్కులుపర్వ
జిగిబురుసాపనిచీరెలలర

కల్పకసంజాతకమనీయనవరత్న
భూషణావళులు మైపూఁతనొరయ
కలుకుపాలిండ్ల హారముల్ గునిసియాడ
రవలగజ్జెలు ఘల్లు ఘల్లారవములీన
ధరణికేతెంచు క్రొక్కారుమెఱుఁగులనఁగ
నచ్చరలువచ్చి రవ్వివాహంబునకును॥ 243

వ॥ మఱియు వసిష్ఠాత్రి కశ్యప మాండవ్య మందపాల మంకణ జాబాలి భరద్వాజ గౌతమ చ్యవన కణ్వ విశ్వామిత్ర జమదగ్ని కుంభసంభవ ప్రముఖ మహర్షిసంచయంబులును నరుంధతీముఖ్య పుణ్యపురంధ్రీరత్నంబులును దక్కిన గరుడగంధర్వసిద్ధవిద్యాధరకిన్నర కింపురుషయక్షోరగాదులునుజనుదెంచి, రట శంతనుండు నాకాంతుండును బంధుమిత్రామాత్యపురోహితవరూధినీచయంబులం గూడుకొని యేతెంచి యొక్కసుధాధామశిలాఫలకల్పితోత్తుంగరంగత్సౌధవీధికాంతరాళంబున హరినియోగంబున విడిసి చతురవచనారచనాతిరస్కృత పురుహూతపురోహితులగు పురోహితులం బంపి సర్వసర్వంసహామండలాఖండలులఁ రావించిన, 244

సీ॥ కస్తూరితిలకంపుఁ గమ్మవాసనకంటెఁ
గడుఁదావిగల సిరిగంధములఁది
ఉరుమంజిముత్యంబు నొంటలుసవరించి
బంగరుజలఁపోతపాగఁజుట్టి
చంద్రికపూవన్నెఁజిల్కుకబాయి పైఁ
దగటుచిత్తరువు బల్లటిగట్టి
దంటముత్యపుఁగుట్టుతళ్కుకెంబట్టుసి
స్తురుమాలు కరమునఁ నెఱయఁబట్టి
పచ్చడాల్ చెక్కడపు రంగుపతకమెసఁగ
పచ్చవిఖ్యాతసిఁబోలు రూపంబు చెలఁగ

పచ్చవన్నె తురంగంబు పైఁ దనర్చి
వచ్చె సింధుక్షమాతలవల్లభుండు॥ 245

సీ॥ మరకతహారి నీలమహానీయమకుటకి
మ్మీరకాంతులు మింట మెండుకొనఁగ
అత్యంతసుకుమారమగు మేన నలఁదిన
మృగనాభివాసనల్ భుగులుకొనఁగ
మాణిక్యమయ హేమమకరకుండలరుచుల్
గండభాగములపైఁ దాండవింప
వజ్రగోమేధికవైడూర్యహారముల్
రమణీయదోరంతరమున మెఱయ
చండదర్పాంధపరిపంథిమండలేంద్ర
సాంద్రమదసింధుమంధవిశ్వంభరాధ
రాయమానభుజాస్ఫూర్తి రహిఁ జెలంగ
వచ్చెఁ బెండ్లికి మత్స్యభూవల్లభుండు॥ 246

సీ॥ ఆణిముత్యము కంఠహారంబు నోరయుచు
నీలంపుసరిపిణీ నీటుఁజూప
తళ్కు సుప్పాణిచౌకట్లనిద్దపుడాలు
మరకతాంగదకాంతు లోరయుచుండ
స్వర్ణభూషణదీప్తి వలెవాటువైచిన
నవరంజిపూసాలు నందగింప
తావిబుగుల్కొను గోవజవ్వాజిమై
పూఁతతేఁటుల నెల్లఁ బ్రోదిసేయ
చండతరతీవ్రమార్తాండమండలాంగ
రుచులు కోటీరతటరత్నరుచులఁ జూప
రులకు నేత్రోత్సవము సేయఁ జెలువుమీఱ
మాగధుఁడువచ్చె నమ్మహామహముఁ జూడ॥ 247

వ॥ మఱియుఁ బలాట లాట భోట కరహాట కర్ణాట కొంకణ కుంకణ విదేహ విదర్భ యుగంధర ప్రముఖ నిఖిలవసుంధరామండలాధిపకుమారమండలాఖండలులు సౌందర్యశౌర్యాధఃకృత రమాకుమారోమాకుమారులు శంఖభేరీమృదంగపటహ కాహళ వేణువీణారవానుకారిమాతంగతురంగ శతాంగవరభటకోలాహలప్రపూరితభూనభోంతరాళులై చనుదెంచి, రిట్లు వైవాహికోత్సవంబునకరుగుదెంచిన పంచముఖచతుర్ముఖప్రముఖలేఖగణంబులకు నిఖిలభూపతివ్రాతంబులకు విడియునట్లుగా వైకుంఠుం డుచితంబులగువిడుదులు గరుడునిచే నిరూపించి వారివారి ననర్ఘ జాంబూనదాంబరరత్న భూషణసుగంధకుసుమమాలికాదులఁ బరితృప్తులంగావించుచుండె నంత,

కం॥ సరసిజసంభవగౌతమ
గురులు వశిష్ఠుండు లగ్నకోవిదమతులై
త్వరితమొనర్పఁగనంతట
నరుంధతీముఖ్యసతులు హరియనుమతిచేన్॥ 249

కం॥ చింతామణిపీఠంబునఁ
గాంతామణినునిచి రుచిరకౌతుకలీలన్
స్వాంతముల శోభనాకృత
లంతటఁ దలనునిచి యొసఁగి రంతులుతగన్॥ 2.0

తే॥ అంగనామణియొకతె సంపంగినూనె
కౌతుకంబునఁ దలయంటఁ గిమ్మతావు
లినువరవర్ణినివమ్రుగముదములఁ
గాంతియొక్కర్తు నలుగిడెఁ గమలముఖికి॥ 251

కం॥ ఫలపుం జవాదియటకలి
కలకంఠి యొక ర్తొసంగి కనకఘటములన్
దెలిగొజ్జఁగినీ రునిచియు
జలజాక్షియొకర్తు సతికి జలకములార్చెన్॥ 252

తే॥ చారుకురులందు జాఱుగొజ్జంగినీటి
తేటబిందువులొప్పారె నూటినపుడు
ప్రావృషేణ్యపయోధరపటలగళిత
లలితవర్షోపలావళి చెలువుగలిగి॥ 253

తే॥ గంధగజయానయొక్కతె కంజనేత్రి
తళుకుసెమ్మెనఁ దడిసియొత్తఁ జలుఁగుచీని
చెలువపావడగననయ్యెఁ జెలువుమీఱ
పైడితీవకునార్చినపటికసంగ॥ 254

ఉ॥ రాజనిభాస్యయోర్తు దయురాగముఁ జేల కటిస్థలంబునన్
రాజితలీలఁ గట్టెఁ దసరంగ వివాహమహోత్సవేక్షణే
చ్ఛాజహదాగమార్తిగల చక్కనిరంభకు సిగ్గుదోఁచునం
చోజ మృదూరురంభలఁ దళోదరి మాటొనరించువైఖరిన్॥ 255

తే॥ ఉదయరాగపువలువ పైఁ గుమురుకొనిన
కంబుకంఠిసితంబబింబంబు దనరె
ప్రథమకుధరాగ్రసందీప్తబాలభాను 256
భానుసంక్రాంతసైకతప్రతిభగలిగి॥

ఉ॥ బంగరుసాలు కన్నియయుఁ బయ్యెదగావలెఁ జుట్టువైచె నో
క్కంగన గబ్బిగుబ్బచను (లన్ కవజక్కవ) వక్త్రపూర్ణసా
రంగధరప్రభాకలితరమ్యదరస్మితసాంద్రచంద్రికా
సంగతి జోడువిచ్చునని చాటొనరించినలీలఁ దోఁపఁగన్॥ 257

ఉ॥ చందనసాంకవాగురురజఃపటలార్పితధూపధూమ మిం
దిందిరవేణిపెన్నెఱుల నించి సిగన్నిగలొప్పఁదువ్వి స
త్సుందరరేఖ చెన్నెసఁగ నూటిగఁ బాపటదీర్చి జాఱుగొ
ప్పందముమీఱఁ బెట్టియొకయంగన చుట్టె మధూకదామముల్॥256

తే॥ కన్యకామణియొకతె శుభ్రకమలనేత్రి
కమ్మకస్తురిచేఁ దిలకమ్ము దీర్చె

అదియుముఖపూర్ణిమాతుషారాంశుబింబ
మునకు శంబరలాంఛనస్ఫూర్తిచూప 259

తే॥ అంబుజానననేత్రకర్ణాంతములుగ
మంజులాంజనమిడె నొక్కమగువ మరుఁడు
శ్రవణపుటకూపపాతచంచలవిలాస
వీక్షణములకు శృంఖలల్ వేసెననఁగ 260

తే॥ మెలఁత నునుముద్దుచెక్కిళ్ల మృగమదమున
మకరికాపత్రములు వ్రాసె మగువయొకతె
విరహిజనములపై దండు వెడలఁదలఁచు
దర్పకునిమ్రోల నెత్తిన ధ్వజములనఁగ 261

చ॥ సరసిజగంధియోర్తు సితచందనచర్చయొనర్చినప్డు డా
గురుకుచకుల్యనిబ్బరపుగుబ్బలు చూడఁదనర్చె రాజశే
ఖరకరసంగతిం జెలఁగుఁ గాంచనగోత్రము మేము రాజశే
ఖరకరరూఢిఁ గాంతుమని గంధవరాద్రిము లూనెనోయనన్ 262

తే॥ మత్తగజయానపదములు మహిళయొకతె
చిత్తరవుఁ గ్రొత్తలత్తుక హత్తె నింక
నిఖలభూకాంతసీమంతినీలలాట
కలితసింధూరరజమిట్లు గప్పెననఁగ 263

ఉ॥ కాంతయొకర్తు కంబునిభకంఠికి వేడ్కనలంకరింప సీ
మంతకలాపమౌక్తికసమాజము లొప్పెఁ దదాస్యరోహిణీ
కాంతపిధానయత్నకచకంధరరాజముఁ జేరవచ్చి మా
కాంతునిఁ గావుమంచని తిగన్ (బ్రతిమాలెడి) రిక్కలోయనన్ 264

చ॥ సురుచిరనవ్యహీరమణిశోభితమౌ నెలవంకబొట్టు సుం
దరి యొకలేమ వెట్టెఁ దగెఁ దన్ముఖకోమలపంకజంబుచేఁ
బరిహృతసత్కళార్థమయి పర్వసుధాకరమండలంబు తన్
మరలఁ బ్రపూర్ణుఁ జేయుమని మైత్రికివచ్చినలీల దోఁపఁగన్॥ 265

తే॥ కొమ్మ కొక (కొమ్మ) ముత్యాలకమ్మదోయి
కర్ణములకిడ నొప్పారెఁ గమలశరుఁడు
కలితదృష్టిశరంబులఁ గలిమిమెఱయ
రమణనిలిపిన శాణచక్రములనంగ 266

ఉ॥ నారియొకర్తు పద్మముఖి నానకు రంగుమెఱుంగుమింగ రిం
పారఁగనిడ్డ ముత్తె మలరారె ముఖేందునిజేరవచ్చి మా
దారనొసంగిలీవు దయఁ దత్తనుసంభవు నిమ్మటంచు వే
మారు ముఖాముఖిన్ నిలిచి మానక వేఁడెడి జీవుఁడోయనన్॥ 267

తే॥ దివ్యమణికీలితంబైనతీఁగె సతికిఁ
దరుణియొక్కతె వెట్టినఁ దనరుచుండెఁ
గంఠమను పోకబోదియఁ గదిసి చుట్టు
కొనితనర్చెడి నును లతకూనయనఁగ 268

చ॥ తరుణికిఁ దారహారములు తన్వియొకర్తు పొసంగ వైవ వి
స్ఫురణఁదనర్చె శంఖ మురుసుందరబంధురకంధరోజ్జ్వల
స్థిరగతిఁబూనఁ దజ్జరరసీమఁ బ్రభూతములైన మౌక్తికో
త్కరములు భూరిమైత్రిఁతగ దండలఁ బాయకయుండెనోయనన్ 269

తే॥ పద్మరాగపుఁబతకంబు పడఁతియొకతె
ముదితపాలిండ్లసందునఁ గుదురుపఱుపఁ
దనరెఁ బూర్వాపరాగమధ్యప్రదేశ
కలితశతపత్త్రమిత్రమండలమనంగ 270

వ॥ మఱియుఁ గొందఱిందిందిరకుంతలులు చందనగంధికి రత్న
కంకణంబులు వలయంబు లూర్మికలు చేకట్లు చిఱుగజ్జెలందియలు బవి
రెలు లోనుగాఁగలుగు భూషణంబులు మనోహరాంగకంబుల నలంక
రించిరిట్లు, 271

తే॥ రమణ సైరంధ్రికాప్రయత్నమునఁ జేసి
నవచతుర్విధశృంగార మవధరించి

జలజపత్రాక్షి మిక్కిలి చెలువొనంగ
సానపట్టిన మన్మథు సూన) మనఁగ 272

చ॥ అమృతగభస్తి పంకరుహ మంగన! నీ నగుముద్దుమోముతో
సమతకు రాఁగఁబూని తగ సామ్యముగాక పరస్పరోగ్రవై
రములఁ జెలంగి రోలి నిది రమ్యముగా నరివచ్చునంచుఁ బ
ద్మముఖి యొకర్తు నిల్పెఁ బ్రిమదస్థితి ముందట మించుటద్దమున్

తే॥ అద్దమీక్షించి పెద్దముత్తైదువలకు
సరవిఁ గేల్మోడ్చి ముత్యాలచవికెలోన
పైడిముక్కాలిపీరిపైఁ బరఁగుచుండెఁ
దమ్మిపూగద్దెపైఁ గల్మికొమ్మయనఁగ 274

వ॥ అట శంతనుండును బంధుమిత్రసామంతసచివాదులతో
హితవినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుండె, సైరంధ్రికాజనంబులు,

తే॥ మొలకనవ్వులు మోములఁ దళుకుఁజూపఁ
గలికిచూపులు మరు నంపగముల గదుమఁ
గులుకుపాలిండ్లఁ బయ్యెదల్ చెలువుమీఱ
రత్నపీఠంబుఁ బెట్టి భూరమణు నునిచి 276

చ॥ కరమణికంకణధ్వనులు ఘల్లున మ్రోయఁగఁ దారహారముల్
గురుకుచమధ్యభాగమునఁ గొబ్బునఁ బేరిణిసల్పవేశి బల్.
పిరుదుపయిన్ నటింప జిగి లేనడు మల్లలనాడ రాజశే
ఖరునకుఁ గాంతయొక్కతె సుగంధపునూనె తలంటె వేడుకన్ 277

క॥ రాజముఖి యొర్తుపావలు। రాజేంద్రశిరఃకిరీటరత్నద్యుతినీ
రాజితవిభ్రాజితపద। రాజీవములందుఁ దొడఁగె రాత్రిలకునకున్ 278

క॥ గంధగజగమన యొక్కతె
గంధామలకంబువెట్టె ఖంజనమదపు
ష్పంధయకంధరబాంధవ
బంధురరుచినొప్పు నెఱులఁ బ్రభుచంద్రునకున్॥ 279

తే॥ కామినీజనమృదుహస్తకమలపూర్ణ
కనకకలశమువీక్షింపఁ దనరెనపుడు
తత్కుచద్వ్యాకృతిఁగాంచి సాధ్వసముఁబొంది
దాసిగతి నీరుమోచువిధంబుగలిగి 280

తే॥ చంద్రకాంతపుగిండులఁ జంద్రముఖులు
లలితకంఠోదకంబులు చెలఁగియొసఁగ
సందుకొనియోర్చు మదరాజహంసగమన
స్నానమాడించె శంతనుక్ష్మాపమణికి 281

సీ॥ తడియొత్తె నొక్కసుందరగాత్రి చంద్రికా
ధాళధళ్యోరుదుకూలమునను
పెట్టనిచ్చె నొకర్తె గంధసంధురయాన
సన్నంపుసొన్నంపు వన్నెవలువ
సిగ్వైచె నెఱులు రాజీవాక్షి యొక్కతె
సంపంగిక్రొవ్విరి సరులుదాఁటి
తిలకంబు నుదుటిపైఁ దీర్చెనొక్కతె తన్వి
బుగబుగవాసించు మృగమదమున
కలపమలఁదెను నెమ్మేనఁ గలికియొకతె
కప్పురపుసురటి కాంత యొక్కర్తు విసరె
నిలువుటద్దంబు చెలియోర్తు నిలిపె నెదుట
చంద్రకులవార్ధిపూర్ణిమాచంద్రునకును 282

వ॥ మఱియు నొక్కబింబోష్ఠి జాంబూనదాంబరం బభినవాంబురుహాంబకునకు వాటంబుగా వలెవాటువైచె, నొక్కబోటి రాజశతకోటిధరు శిరోభాగంబున రత్నహాటకసంఘటితకోటీరంబు పొందుపఱిచె, నొక్కండజయాన భూమండలాఖండలకుమారమండలప్రకాండు కర్ణంబుల మాణిక్యకుండలంబులు పొసఁగించె, నొక్కకలకంఠకంఠి యకుంఠితశౌర్యకంఠీరవునకు నాణెముముత్తెంపుఁ గంఠమాలికలు

గీలుకొలిపె, నొక్కరజనీకరముఖి భూభుజు భుజంబుల మరకతస్ఫీతంబు
లగు భుజకీర్తు లలవరించె, నొక్కసుందరి సుందరీకందర్పు సందిటఁ గుం
దనంపుఁ బాయెతులుగట్టె, నొక్కపంకజాక్షి పతిభుజశాఖాంకుహస్తంబుల
రత్నకంకణంబు లలంకరించె, నొక్కశుభాంగి నరపుంగవు కరాంగుళుల
జాళువాబంగరు ముద్దుటుంగరంబులు దొడిగె, నొక్కవధూటి హాట
కాచలధైర్యు కటిస్థలంబున హాటకసూత్రంబు ధరింపం జేసె, మఱియు
గొంద ఱందిందిరవేణులు పద్మరాగపతకంబులు నిలహారంబులు లోను
గాఁగల భూషణంబు లఖిలాంగకంబుల శృంగారించి, రిట్లు సకలాలం
కారమనోహరాకారుం డైయుండె నప్పుడు, 283

క॥ ధళధళితనిజకటాక్షో
జ్జ్వలరోచులు దీపికావిశాలద్యుతులన్
జెలిమిగొనఁ గొందఱొసఁగిరి
నెలఁతలు మాణిక్యచిత్రనీరాజనముల్ 284

క॥ అంతట శంతనువసుధా। కాంతుని రాజత్ప్రకాశగౌరవము త్రిపా
క్రాంతమతిఁ గాంచి సంజ్ఞా। కాంతుఁడు చనినల్లఁ జరమకుధ్రాగ్రముఁ జేరెన్॥

కం॥ శంతనునృపచూడామణి
కాంతామూర్తియైన గంగగళమునఁ బ్రమద
స్వాంతమునఁ గట్టు బంగరు
కాంతులలరు తాళిబొట్టుగతి శశి పొడమెన్॥ 286

వ॥ అయ్యెడ॥ 287

మ॥ సుముహూర్తంబదె దగ్గఱెం జెనసి యచ్చోఁ బుణ్యాంగనల్ శ్రీ
రమణీవల్లభునాజ్ఞచే నల సుపర్వస్వామి దిక్పాలవ
ర్గము నల్వంకలఁ గొల్వఁ గిన్నరమరుద్గంధర్వవిద్యాధర
ప్రమదామంగళచారుగానములు పైపైఁ గ్రమ్మఁగా నేఁగి భూ
పమణిం గాంచి సమగ్రకౌతుకమునం బ్రాగ్దంతి నెక్కించి రొగిన్॥ 288

వ॥ రాజమార్గంబునం దోడ్కొనివచ్చునప్పుడు.

క॥ పౌరవధూరత్నంబులు
చారుసుధాధవళహీరసౌధాగ్రములన్
గూరిమి గుంపులుగూడుక
క్ష్మారమణుం గాంచి పలుక సాగిరి తమలోన్॥ 298

సీ॥ ఇతఁడకే నాసత్యరతికాంతశశిపాత్ర
సురుచిరలావణ్యసుందరుండు
ఇతఁడకే కల్పకక్షితిజచింతారత్న
రాజతౌదార్య ధురంధరుండు
ఇతఁడకే హిమవన్మహీధరాష్టాపదా
హార్యవర్యస్థైర్య ధైర్యశాలి
ఇతఁడకే విద్వదాశ్రితబంధుసందోహ
మాకందవాటికా మాధవుండు
ఇతఁడకే క్షీరసిహారహీరహార
సారఘనసారమందారశంకరగిరి
రాజకరిరాజహరిరాజరాజకిరణ
ఘనయశఃపాళి శంతనుక్ష్మాపమౌళి॥ 290

సీ॥ ఎవ్వనిపాకోటియిందిరాగృహసీమఁ
గడుపుబొక్కసపుబిడ్డఁడు జనించె
ఎవ్వనికన్నులై యింపొందుదురు జగ
ద్బంధుండు రోహిణీప్రాణనాథుఁ
డెవ్వనియురమందు నేప్రొద్దుఁ బాయక
లిబ్బిగుబ్బెత బాలలీలఁదనరు
ఎవ్వనిమిత్రుఁడై యెసఁగుముక్కందు భా
సద్ఘకోటీరుఁడౌ నగనివాసి
సకలగీర్వాణపరివృఢమకుటఖచిత
పద్మరాగప్రభాధౌతపాదుఁడెవ్వఁ

దట్టిశౌరికి నల్లుఁడై యలరఁగల్గు
నంట యితనిభాగ్య మెన్నఁగా నాతరంబె 291

క॥ వలరాజు రూపసంపద
నలరాజు కళాతిశయత నతులప్రభుతన్
నలరాజు ధృతిని మలరా
జిలరాజుల నెల్ల నితని కెనయుఁగ నగునే 292

ఉ॥ చక్కనివారిలో మిగులఁజక్కనివాఁడు కదమ్మ బాపురే!
ఎక్కడ నేర్చెనో నలువ యీతని చారువిలాసమూర్తి యీ
చక్కెరమోవి యీవలపుజవ్వన మీకళ యీమొయారమ
మ్మక్క రచింప నీనృపతి హాల్లకబాణుని జోడుగూఁడి తా
నక్కునఁ జేర్పఁగాఁగలుగు నంగన వేమిటి భోగభాగ్యముల్ 293

చ॥ సరవర యక్షకింపురుష నాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరవరచారణప్రముఖనవ్యకిశోరపురోగణంబు కా
నిరుపమవైభవోల్లసిత నిస్తులచిత్తవిలాసవైభవముల్
గనఁగనె విని సద్గుణాసికాయవిరాజితసాంద్రచంద్రికన్ 294

వ॥ అని బహుప్రకారంబుల వర్ణింపుచుండఁ బ్రాలంబమాన స్వచ్ఛతరచ్ఛాయాభిముక్తముక్తాఫలగుచ్ఛవిచిత్రసితచ్ఛత్రసందోహమాకాశంబు నిరవకాశంబుగావింప నుభయపార్శ్వసమాయాతభూతల సంక్రందననందనబృంద నవీనకోటీరకోటీకుటీరఘటిత మాణిక్యమయూఖసంఘంబులు నడదివియలై యొప్పుమెఱయ నంతరాంతరంబులు మెండుకొని దండలాస్యంబుగావించు రంభాద్యప్సరఃకుంభికుంభస్తనీమణీనికరమణీరమణీయతపనీయచరణ మంజీరపుంజమంజుఘుల్లఘోషంబులు పుంఖానుపుంఖశంఖ భేరీమృదంగవేణువీణాది వివిధహృద్యవాద్య నిరవద్యనాదంబులు నరుంధతీప్రముఖ పుణ్యపురంధ్రీరత్నంబులు పాడు లక్ష్మీనారాయణోమామహేశ్వర వైవాహికలక్షణాంకితంబులగుధవళంబుల మధురరావంబులు శతముఖప్రముఖనిఖిలబర్హిర్ముఖకంఠావలంబి

పారిజాతప్రసూనదామస్తోమాభిరామపరిమళరిలుబ్ధ రంగద్భృంగసంగీతకూజితంబులు నచ్చటచ్చట సందడులఁ బాపు వేత్రధరుల సాహ్వానినాదంబులు కోలాహలంబై దశదిగ్వీటంకంబుల మార్మ్రోగ రయంబేయఁ గలధౌతసౌధయానంబులనుండి సుధామధురాధరలు శుక్తిజాతలాజాక్షతప్రసూనంబులు సేసలుచల్లమంద మందగమనంబున సుధాంభోధిరాడ్గంధసింధురరాజంబుపై రాజగృహద్వారంబుఁ జేరవచ్చె నంత, 295

తే॥ హరి యెదుర్కొని ప్రాగ్దంతినవతరించి
వందన మొనర్చునృపతికి దీవనలొసంగి
కోడుకొనిపోవ మంత్రులు దొరలు బుధులు
బంధుకోటియు వెంబడి బలసిరాఁగ 296

వ॥ భూసురభాసురాశీర్వాదనాదంబులు రోదసినిండ నభ్యంతరమందిరంబునకరుగునప్పు డప్పురుహూతసన్నిభుం డెడనెడ విప్రపుణ్యాపురంధ్రీరత్నంబులొసంగు కర్పూరనీరాజనంబు లాదరింపుచుఁ దోరణస్తంభా-వాన రంభాద్రుమపత్రచిత్రతాలవృంతాశుగాంకురంబుల నలకలుచలింపఁ గక్ష్యాంతరద్వారప్రదేశంబుల మంగళార్థంబుగానిలిపిన పూర్ణశాతకుంభకుంభప్రముఖపదార్థంబులు వీక్షింపుచు నల్లనల్లన నడచి విబుధపరంపరాపరివేష్టితంబయ్యును విబుధపరంపరాపరివేష్టితంబై సరస్వతీమనోహరాలంకృతంబయ్యును సరస్వతీమనోహరాలంకృతంబై వివాహశుభలక్షణలక్షితంబయ్యును వివాహశుభలక్షణలక్షితంబై సర్వమంగళాభంగశృంగారవిలసితంబయ్యును సర్వమంగళాభంగశృంగారవిలసితంబై యొప్పుకల్యాణగృహంబుసొత్తెంచె నంత॥ 297

క౦॥ పేరంటాండ్రులుకొందఱు।గౌరీకల్యాణములు పికస్వరమధురో
దారగతులెసఁగఁ బాడుచుఁ।గూరిమిడెందములమీఱఁ గొని తేరంగ౯

సీ॥ మందహాసాపాంగమహితద్యుతుల్ మారు
చంద్రహాసద్యుతుల్ చౌకసేయ

సుకుమారతరదేహసుగుచిరామోదంబు
పద్మసౌరభలక్ష్మిఁ బరిహరింప
సమపీనవక్షోజరమణీయవిభవంబు
భద్రేభకుంభసంపద నదల్ప
మందయానవిలాసమహిమానుభావంబు
మందమరాళంబు గ్రంగుకొ నఁగ
ఘనతులాకోటి మణికోటి ఘటిత క్రమ
కనకకాంచీలతాలంబి ఘంటికా ఘ
కలరవమ్ములు కోయిలగమ లఁ బిలువ
వెలఁది యేతెంచెఁ గలా ణవేదికలకు. 299

వ॥ అప్పుడు, 300

సీ॥ బాలాశిరోమణి ఫాలపట్టికఁ గాంచి
సగము యె ృఁ గృశతచేఁ జంద్రరేఖ
తొయ్యలి నిద్దంపుఁదొడల నునుజిగి గాంచి
యూ ములపడియె నయ్యారె రంభ
కంజాతపత్రాక్షి కలికి చూపులు గాంచి
తృణధైర్యవృత్తిచేఁ దెరలె హరిణి
మోహనాంగి మనోజ్ఞమూర్తి సంపద గాంచి
యఱలేక లోలోనఁ గరఁగె హేమ
తెఱవ పదములు గాంచి రాగరసమగ్న
యయ్యెఁ బద్మిని, కొమ్మ నఖాళిఁ గాంచి
తలఁకి తా వెల్లనై యుండెఁ దార, వెలఁది
ముక్కుఁ గాంచి తిలోత్తమ యుక్కణంగె. 301

చం॥ సకలజనంబు దంపతుల చారుకళావిభవంబు చూడ నం
బకయుగళంబు చాలదని భాసురవైఖరి నెన్నుచుండె, రెం
డొకటియు నాల్గునాల్గుకనులొప్పెడి వేల్పులు వేయికన్నులం

గళములఁగల్గుప్రౌఢ యిఁకఁ గన్నులుగావలె వేయి రెండువే
లకుటిలలీలనంచుఁ గొనియాడుచునుండిరి వారి నయ్యెడన్. 302

కం॥ మధురిపుఁ డొసఁగ భుజించెను
మధుపర్కముఁ గాకుమారమన్మథుఁ, డదియే
మధుమథనకన్యకాధర
మధురసుధాపానకేళిలమతి యలరింపన్. 303

కం॥ అంతకుమున్నె కొందఱు
కాంతలు దంపతులనడుమఁ గరకంకణముల్
కాంతగతిఁ బ్రోయఁ దెర య
త్యంతామోదానుయుక్తి నమరించిరొగిన్. 304

తే॥ సుందరీమణి నిడువాలుచూపులపుడు
తెరకు నెగఁ బ్రాకి బాపురే! యొఱపుమీఱ
నదమలామృతవాహిని కెదురులెక్క-
కొదమ బేడిసమగమీల పదవులనఁగ. 305

తే॥ అట్టియెడ రంగుబంగరుమొట్టుఁ బ్రాల
పుట్టికలు కన్యకామణి భూపమణిని
గదియఁ జేసిరి కొందఱుఁగరత లతుల
భూరితర హృద్యవాద్యము ల్బోరుకలఁగ. 306

క॥ తెలివ త్తెరవంచిన నా
గరిత మొగంబపుడు పతికిఁ గానంబడియెన్
శరదభ్రముఁ బాసి ఘన
స్ఫురణం జెన్నొందు పూర్ణసోముసిభాతిన్॥ 307

తే॥ జవ్వనికిఁ గానఁబడెఁ బతి నవ్యమోము
గొప్పకన్నులు సీలంపుఁగప్పుగుప్ప
మొలకనూనూగుమీసము ల్లొలుకు మేను
వెడఁదయురమును సింగమ్మునడఁచు కౌను॥ 308

శా॥ గౌరీ వాగ్రమణీ శచీప్రముఖ రాకాచంద్రబింబాననా
స్సారాధారకరాగ్రపల్లవలసత్సంస్పర్శ మొందించి య
ప్పౌరోహిత్యధురంధరుం డొనఁగ భూపాలుండు గావించెఁ బెం
పారన్ మంగళసూత్రబంధనము కన్యాకంఠదేశంబునన్॥ 309

చ॥ హరిహయుఁడొట్టిదిక్పతులు నప్సరసల్ మునిపుంగవుల్ మనో
హరతరలీలఁ గన్గొనఁగ నైమవ లోరలనిల్చి చేతులన్
నిరుపమశుక్తిజాతములు నించినపళ్ళెములన్ వహించి హె
చ్చరికలొనర్ప గంగయును శంతనుఁడుం దలఁబ్రాలయంబునన్
శిరసులనుంచి రొండొరులు సిగ్గున నవ్వులు లోనఁ గ్రమ్మఁగన్॥ 310

తే॥ చెలువ కేశావతీర్ణవిశిష్టమౌక్తి
కావళినిజూడ నొప్పారె నహహా! యపుడు
లలితబాలేందురేఖ నౌదలధరించి
యలరుచున్నట్టి సర్వమంగళియనంగ॥ 311

మ॥ ధరణీనాయకుఁ డొప్పె మౌళివరముక్తారత్నములుప్పాస పు
ష్కరగంగాలహరీవళక్షకణరాజత్త్రిజటామండలాం
తర సంధ్యాసమయోత్కటస్ఫుటనటత్సంరంభ కేళీవిలా
స రసప్రాంచిత పంచబాణహర చంచల్లీల చూపట్టఁగన్॥ 312

క॥ అంతట నెలఁతలు స్వాహా। కాంతాధిపుఁ దెచ్చి పెట్టి కాంతాపతులన్
జింతామణిపీఠంబున। సంతసమున నునుప వారు సముచితలీలన్॥ 313

తే॥ భాసురపలాశ నవ శమీపల్లవాగ్ర
రమ్యగోఘృతధారాపరంపరాహు
తులు హుతాశను సంధుఁ బ్రస్తూయమాన
వేదవిదితక్రియారూఢిఁ బ్రేల్చిరపుడు. 314

క॥ రాజీవపత్రలోచన। లాజలు దోయిటను జేర్ప లాలితఘనకీ
లాజాలాభ్యంతరమున। రాజద్గతిఁ బ్రేల్చిరపుడు రహిఁగన్పట్టన్ 315

వ॥ అయ్యెడ, 316

తే॥ హోమధూమంబు పైఁగప్ప హేమగాత్ర
స్వచ్ఛశుభ్రతరచ్ఛవిగుచ్ఛరుచిర
తరశరద్ఘనమండలాంతరమునందు
మెఱయుచుండెడి లేతీఁగె మెఱపుఁబోలె॥ 317

క॥ అమరేంద్రనిభుఁడు మనమునఁ
బ్రమదంబెసఁగ నాత్తఁ బాణిపద్మముచేతన్
గమలదళేక్షణమృదుపద
కమలాగ్రంబపుడు సన్నెకలు మెట్టించెన్॥ 318

క॥ కలకలనవ్వుచు నొక్కతె
కలకంఠి నృపాలతిలకకాంతాచేలాం
చలములు ముడియొనరిచె, నొక
చెలువ కరగ్రహణలీలఁ జెలఁగం జేసెన్॥ 319

క॥ పవనాప్తునకుఁ బ్రదక్షిణ
మవిరళగతిఁ జేసి మానసార్చితలక్ష్మీ
ధవు నిష్కలుషయశోంచిత
ధవు ధ్రువు నుడువీధిఁ గనిరి పతియున్ సతియున్॥ 320

వ॥ తదనంతరంబ, 321

సీ॥ పరిణయాగత మునిప్రవరులైన యరుంధ
తికి వశిష్ఠాదిక ధృతిని మ్రొక్కి
సకలసరిచ్చయజనసేవ్య రత్నాక
రాధనాథునకు సాష్టాంగ మొనఁగి
ఆదిమదంపతులై యొప్పు పార్వతీ
శశివతంసులకు హస్తములు మోడ్చి
త్రిభువననిర్మాణదీక్షాచణాధార
భాషాబ్జులకును సద్భక్తి నెరఁగి

మఱియుఁ దక్షిణదేవతామహానులకును
దండములు వెట్టి తత్కరకాండజాభి
మంత్రితాకృత లెంతయు మహిఁ దాల్చి
రంబుజాక్షియుఁ జంద్రవంశాధిపతియు. 322

చ॥ సురతరుసంభవంబులగు సుందరదివ్యమణీవిభూషణో
త్కరములు చారుచిత్రమృదుకాంచనవస్త్రచయంబు ప్రోల్లస
త్పరిమళభూరివస్తువులు భాసురకౌతుక మావహిల్లఁగా
హరి చదివించె దంపతుల కప్పుడు చిత్రశిఖండివృత్తుచేన్. 323

క॥ బలభిన్మణివరముక్తా
ఫలచింతారత్నవజ్రపట్టాంశుకము
ల్జలధిపతి గౌతముచే
సలలితముగ మిథునమునకుఁ జదివించెఁ దగన్. 324

క॥ బంధుసమూహంబంతటఁ గంధరవేణికిని బతికిఁ గౌశేయప్ర
గ్బంధురమణిభూషాదులు కంధిగభీరతనొసంగెఁ గానుకలుతగన్ 325

సీ॥ శరదభ్రఘనసార చంద్రచంద్రికలతోఁ
గలకలనగు మేని కాంతిదనరి
కల్యాణసంఘాద్రికటకభాగప్రతి
ఘోషితహేషావిశేషమొసఁగి
కాద్రవేయాశన గంధవాహమనఃప్ర
భాసురవేగసంపదఁ జెలంగి
చక్రవాళావృత సర్వసర్వంసహా
చక్రవిలోలహాసంబు గలిగి
హరిహరిద్ఘోటవరహరిస్ఫురణ దెగడి
హరికల్క్యావతారవిహారవేళ
తన్ను జవమునఁ బూను గాంధర్వతిలక
మల్లునకుఁ జూపి శ్రీరమావల్లభుండు॥ 326

క॥ "రజనీచరకులపావన!
నిజమీవాహావతంసనిపుణతగలభూ
భుజునకు సమస్తధాత్రీ
విజయము దుర్లభమె యాత్మ వీక్షింపంగన్॥ 327
వ॥ దీనిఁబరిగ్రహింపు" మనిపలికి॥ 328

సీ॥ మేదురద్వాదశద్వాదశాత్మాంశుభా
సురమణిశోభాభిశోభితంబు
తపనీయధారుణీధరరోహణాచల
ప్రతిమానబహులదైర్ఘ్యభాసితంబు
కలహంససంకాశకమనీయకంఖాణ
రత్నసహస్ర విరాజితంబు
గాంగేయఘంటకాఘణఘణశింజద్ధ్వాన
సంపూరితాశాంతసంచయంబు
సరసమందారమాలికాజాలకాంతి
సౌరభాగతపుష్పలిట్సంకులంబు
మయవినిర్మితమైన విమానమొకటి
మాగధుఁడుచూపి కూర్మి జామాతకనియె॥ 329

సీ॥ "చిరతరఘనహిమశ్రీమీఱఁగాఁజేయు
విలసిల్లువైశాఖవేళలందు
ఉష్ణసంపదఁజేయు నుష్ణాగమము మాడ్కి
నలరారుచున్న శీతర్తువందు
గగనగంగా తరంగప్రాంగణంబుల
ఖచరయానంబులఁ గలసిమెలఁగు
అశ్రాంతకేళీవిహారపరిశ్రమా
హారనిద్రాతృష్ణ లణఁగఁజేయు

అమలినై తద్విమానమాహాత్మ్యమెన్న
బహువిచిత్రంబు, మత్తనూభవయు నీవు
మించి యంతధిరూఢులై మెలఁగునపుడు
తేటపడఁజేయు వన్నియుఁ దీసికొమ్ము"॥ 330

వ॥ అనిపల్కి యమ్మహనీయదివ్యవిమానం బొసంగి॥

క॥ మందారకల్పతరుహారిచందనము లబ్ధిజ జలధి జన్మించిన యా
నందినిధేనువు భూభృద్బృందారకపతికిఁజూపి శ్రీహరివలికెన్ ॥331

తే॥ "కామగామిని యిది భవద్ధామసీమ
నృపతి! మదనుజ్ఞ తప్పకనిల్చి త్వత్కృ
తాధ్వరంబులు సాఫల్యమందఁజేయు
నీప్సితార్థంబులొనఁగూర్చు నెవ్వియైన॥

వ॥ గిలుంగ్గిక్ క్గొమ్మనియొసంగినుతేయు విశ్వకర్మనిర్మితంబులగు
కలధౌతగాంగేయతల్పాసనభోజనభాజనకేళికాడోలికాపీఠికాపేటికాక
రండభృంగారుప్రముఖధామోపకరణంబులును జంతారత్నపుష్యరా
గాబ్జరాగాద్యనర్ఘ్యరత్నకీలితవలయాంకకాంచనవళ్యంగుళీయకతులాకో
టితాటంకకాంచీకంఠికాదివిభూషణంబులును గురంగమదకుంకుమాగ
రుఘనసారపటీరసముద్రయోదయభాస్కరప్రముఖసమస్తనిస్తులపరిమ
ళవస్తువిస్తారంబులును శరచ్చంద్రచంద్రికాధవళచిత్రకంచుకదుకూలాం
బరసంచయంబులును గూఁతునకొసంగి యిట్లనియె॥ 333

సీ॥ "బాలాశిరోమణి! పారిజాతావనీ
జాతంబు మదనుజ్ఞ స్వర్గభువన
మవతరించి భవద్విహారశృంగార వ
నాతరంబునని ల్చనంతరంబు
రసరసాన్నములు వస్త్రవిభూషణాదులు
గామించునవి యెల్లఁ గలుగఁజేయు

పతికిని కత్యంతభావానురాగంబు
చెందించు,బడలిక ల్బేరనీదు
కోవి క్రొమ్మావి సంపెంగ గోగువిరులు
పూయునే పొద్దు దోహదస్ఫూర్తిఁ నీవు
కదియ,తద్ద్రుమకుసుమము లైక్యశికములఁ
దాల్చి సౌఖ్యముఁజెందుఁడే ధవుఁడు నీవు"॥ 334

వ॥ అనిపలికి మఱియు ముద్దుపట్టికిం గొన్ని బుద్ధులుసెప్పి ప్రయాణంబుచేసి వాణీశ్వర గౌరీశ్వర సురేశ్వర రత్నాకరేశ్వర ప్రముఖుల నుచితసత్కారంబుల మన్నించి వీడ్కొలుపువాఁడై యుండ నంతఁ జతుర్ముఖ పంచముఖులిట్లనిరి॥ 335

మ॥ "అరుణా తెల్లనిదీవి - వి ఫణిశయ్యన్ శ్రీరమాదేవితో
విరజానామతరంగిణీపటురటద్వీచీమతల్లిలల
త్సరసీజోత్పలగంధబంధురపరిశ్రాంతిన్ వినోదించుచో
వలిగాడ్పుల్పయిఁగ్రమ్మఁ గ్రీడలొనరింపంగను మొప్పన్ సినన్ 336

సీ॥ బాహ్యాంతరేంద్రియ పరిణామములుమాన్చి
పద్మాసనస్థితిఁ బరిఢవిల్లి
పవనుని బశ్చిమపథమున నొందించు
కుండలిశక్తి మేల్కొనఁగఁజేసి
లలిఁ జంద్రమండల లలదఖండామృత
బిందుధారావాప్తిఁ బ్రీతినొంది
పూర్ణమాదృష్టిచే భ్రూమధ్యశృంగాట
కంబునఁ జిత్తంబు గదలనీక
లీలను లలాటచంద్రికాజాలమందు
సచ్చిదానందమయుఁడవై చాల నొసఁగు
నట్టి యోగీంద్రు నారాయణాఖ్యునిన్ను
బదరికావనిఁగాంతుము భద్రమొంద॥ 337

వ॥ అట్టిసన్ను జగద్గురు ననాదిపురుషు ననన్యసామాన్యప్రభావోదయు నవాఙ్మానసగోచరు నద్వితీయు నేమును గూడిన భువనత్రయవాసులును సులభంబుగా సందర్శించి సంభాషణ సంశ్రవణ విలాసంబు లొందంగంటిమి, కృతార్థుల మైతి” మనిపలికి శంతనునిజూచి యిట్లనిరి॥ 338

ఉ॥ “శంతనుసార్వభౌమ! నృపసత్తమ! నీదపుభాగ్య మెన్న నత్యంతము, శ్రీరమాధిపతి యల్లుఁడటంచుఁ బ్రసాదభాసితస్వాంతముతోఁ గనుం గొనఁగఁజాలితి వ్రాలితి కీర్తివల్లికాశాంతసమశ్రితాఖిలదిశాతలయాతుఁడవై మహాన్నతిన్” 339

వ॥ అనిపలికి యాశీర్వదించి వీడ్కొని వారిచేత నామంత్రణంబువడసి స్వేచ్ఛంజనిరి, హరియును దత్పుటభేదనంబు జామాతృభుజాదండపరిపాలితంబుగా విడిచి సురేశ్వర రత్నాకరేశ్వరులఁ దక్షిన సురగరుడగంధర్వసిద్ధవిద్యాధరుల వీడ్కొల్పి తానును వైకుంఠధామంబుప్రవేశించె, నటశంతనుండును సామంతసచివపురోహితబాంధవపరివారసమేతుండై వధూమణింగొని చనిచని యుండట॥ 340

సీ॥ గురుమౌక్తికోదారతర రంగవల్లికా
సంగతప్రతిగృహాప్రాంగణంబు
గారుడోపల లసత్తోరణబద్ధాతి
సుందర ద్వారాభిశోభితంబు
కర్పూరచందనాగరుధూపధూమసం
వాసితప్రాసాదభాసురంబు
భూరికాహళశంఖభేరీమృదంగాది
మంగళారావసమన్వితంబు
ఘనచతుర్విధ శృంగారకలితలలిత
సుందరీజనబృంద సంస్తూయమాన
చారుఘంటాపథంబు భూజాని యెదుట
కనుగొనియె నిజమగునట్టి గజపురంబు॥ 341

క॥ శుభలగ్నంబున మఘవన్నిభుఁడగు భూజానిబంధునికరము మంత్రు
ల్ప్రభువుల్నలుదిక్కులగా విభవోన్నతిగేహమునఁ బ్రవేశించెఁదగన్
వ॥ ఇట్లుగృహప్రవేశంబుగావించి గృహదేవతారాధనంబొనర్చి
జనయిత్రికి నమస్కరించి దీవనలుగైకొని బంధుమిత్రామాత్యాదుల స
ముచితసత్కారంబుల సంభావించి యంత నొక్కశుభదినంబున॥ 343
సీ॥ మణిమంటపంబున మదకీరశారిక
లుప్పాస్త్రశాస్త్రార్థములు వచింప
నిద్దంపుబంగరు ముద్దుకీల్బొమ్మలు
సరసలీలలఁ బనుల్ సంఘటింప
గంధవాహవిశేషగతులమించి పెంచి
తతులును రాగపద్ధతులు వలుక
వజ్రమయస్తంభ వరమయూఖచ్ఛట
లేఁబగ లింద్రచంద్రికలసీస
పద్మరాగవితర్దికాబ్జమణికుట్టి
మేంద్రనీలకవాటశ్రీవిలాస
సుందరంబైన కేళికామందిరంబు
కదియనేతెంచె శంతనుక్ష్మావరుండు॥ 344
క॥ ఒకచోఁ గినలమంచం (బొకచోట దోమతెరమంచము యుయ్యాలమంచం)
బొకచోఁ జప్పరమంచం బొకచో నొప్పారిమిగులన లపు (వహింపన్)
సీ॥ దాసకన్యాంగసౌందర్యసంపదగాంచి
మరులుచెందిన పరాశరునివిధము
దారుకావని మౌనిదారలచిత్తము
లరఁగంగఁజేయు శంకరునిజగ్గు
గౌతమపత్నితోఁ గలయుటకై చాలఁ
దమకమొందిన పురందరునిసొబగు
గురుభార్యతళుకుచెక్కులఁ గమ్మకస్తూరి
శతకల్పనముసేయు చంద్రుఠీవి

అల్ల రేపల్లె గొల్ల యిల్లాండ్ర నతుల
చతురశీతిబంధసంగతుల రతులఁ
దేల్చుచుండెడి గోపాలదేవుచర్య
యమరఁ జిత్రించినట్టి కుడ్యములఁ గాంచి
ప్రమద మొందుచునుండెను బ్రబలుఁ డగుచు॥ 346

సీ॥ పగడంపుఁ దరికోళ్లు నిగరాలమగరాల
పట్టెలు చీనిహొంబట్టుపట్టు
చొక్కపుటల్లిక సుందరచిత్రవ
స్త్రావృతంబైనట్టి హంసతూలి
యనను సొప్పుపాన్పునఁ దనరారసించిన
రాజిల్లు చెంగల్వరాజివిరులు
గనుపట్టి పైనొప్పు నునుచల్వవలిపెంబు
పచ్చాకువించిన పరిమళించు
తలగడయు జాళువాజలతారు తెరయు
మించి రమణీయమైనట్టి మంచమునను
రాజచంద్రుఁ డుపవసింప రాజవదన
లంగనామణిఁ బతికడ కనుపఁ దలఁచి॥ 347

వ॥ కలువలచెలిమికానిం గలకలనగు ముద్దుమొగంబున మొల
కనవ్వు మెఱుంగు వెట్ట గంగంగదిసి యిట్లనిరి, 348

తే॥ "కన్నె! యిన్నాళ్లు పతిసమాగమము మదిఁ
గాంక్షితము సేతు, విదె నీకుఁ గలిగె నింక
రాత్రిఁ బగలును సురతతంత్రములఁ జొక్కి
మగఁడు నీవును సుఖలీల నగడరమ్మ॥ 349

సీ॥ కమలాయతాక్షి నీ కాఠిన్యవక్షోజ
పర్వతంబు లురంబు పైఘటించి
తీయని కెమ్మోవి తేటతేనియ లెల్ల
గురుతరవిస్ఫూర్తిఁ గొల్లలాడి

అతులితనవనఖరాయతాంకములను
బంధురక్షతములపాలుచేసి
బాహులీపాశంబుల బంధించి సద్గాఢ
బహుళకర్దమమునఁ బరఁగఁద్రోచి
"ఎంత చేసినవారికి నంత కాదె"
యనెడువాక్యంబు ధర నిజమైయెసంగఁ
బెలుచ వలపించి వెతలను బెట్టినట్టి
ప్రాణనాయకుఁ దగ ధంగసఱుపవమ్మ॥ 350

తే॥ సర్వసర్వంసహానాథసంచయముల
భండనక్షోణులను గ్రుంగఁబఱచునట్టి
జీవితేశుని బైకొని చిత్తమలర
బాల! పుంభావరతిఁ గ్రుంకుపఱుపవమ్మ॥ 351

వ॥ అని మేలంపుమాటల లోలాక్షికిఁ గొంతప్రొద్దు ప్రియంబు
గఱపి మఱియు నిట్లనిరి॥ 352

సీ॥ "చంద్రాస్య! యిప్పుడె చక్కెరఁ బెట్టి రా
చిలుకకుఁ బద్యము ల్సెప్పవలెనె
విమలాంగి! యిప్పుడె వీణియ ధరియించి
సరిసరాగంబు లేర్పఱుపవలెనె
ఎలనాగ! యిప్పుడె కలికిరాయంచకు
నేర్పుమీఱఁగ నడల్నేర్పవలెనె
మానిని! యిపుడే మధుకోకులోనఁగూర్చి
చిత్రకవిత్వంబు చెప్పవలెనె
జీవితేశుండు పడకిల్లుఁ జేరవచ్చి
మృదులపర్యంకమందున నెదురుసూడ
జాగు చేసెదవమ్మ లేజవ్వనంపు
సుందరులఁ గంటె మిటులెందుఁ జూడమమ్మ"॥ 353

వ॥ అనిపలికి 354

విద్యుల్లతాస్నిగ్ధ విమలప్రభారూఢి
కలిగిన నీమేనుగౌఁగిలింప
శ్రవణరసనాశయాంగము లలదవేణి!
తమకమొందుచునున్న విత్తదుదిత
భాసురోదారసౌఖ్యసంపత్సమృద్ధి
సంఘటన నానికొనరింపఁజనదె నీకు॥ 361

తే॥ వరుస రతివేళ నీకచవదనగళము
లనెడివరనీలపద్మశంఖాప్తినాకు
నలరగల్గించి రాజరాజనెడిమాట
నిజముకావింపరాదె పంకజదళాక్షి! 362

ఆ॥ అస్తినాస్తిసంశయాపాదియై చిదం
బరరహస్యలీలఁబరఁగు నీకు
కలికికౌనుఁజూచుకాంక్ష వేఁడెడినాకు
నీవియనఁగ వేలనీవుతరుణి!" 363

వ॥ అనిసవియనురాగంబులుదోఁపఁ బలికి 364

సీ॥ తాంబూలరాగాధరంబుపై రదనాళి
యొత్తఁబోయిన మొగంబొనరఁజేయు
హాళి లతావేష్టితాశ్లేష మొనరించు
గరిమఁబూనఁగఁ బెడమరులఁబొరలు
ఉదుటుసిబ్బెపుగుబ్బ లొడిసిపట్టఁగఁబోవ
నోఁకువుదప్పించు నేర్పొప్పమీఱు
నీవిమాత్రమొసంగు నేనన్యమేమొల్ల
నసి కేలుఁదాపఁ దద్వ్యాప్తిమాన్పు
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రుఁడౌడఁ
బ్రిధమసురతసమారంభభవ్యకాల
జనితలజ్జాతిశయమునఁ బెనఁగెఁజాలఁ
గన్యకామణి యభిముఖగాక యిటుల 365

వ॥ అప్పుడు॥ 366

కం॥ తరళగతిగాంచుటను బతి
కరమునకుంజిక్కె బాలకరినకుచ మహో
తరళగతిగన్న వారలు
స్థిర నేరికిఁ గరినుఖైనఁ జిక్కరె తలఁపన్॥ 367

తే॥ కరినవక్షోజదుర్గము లక్షణములోనఁ
జేరినినభూమిపతిసిరిఁ జెందె(జూవె)
సతతమృదులోరువిస్ఫురదతిమనోహ
రాంగవప్రాక్రమణావా ఘ యద్భుతముగ॥ 368

అయ్యెడ॥ 369

కం॥ నరపతివాల్యాప్పు యో
ధరములనుండఁ జేరి జఘనతలమున బ్రాలన్
ధరణీధరాగ్రంబులనుం
డిరవొందఁగ ధాత్రీవ్రాలు సింపమురంగా ॥ 370

తే॥ ప్రాణనాథుండు తమకంబుపట్టలేక
నివిబంధంబువిడిచి మానినిసతంబ
తలపటం బొయ్య దిగిచి కౌ నెలమిఁ బొదలి
యులరె మిన్నందియున్నట్టు లాత్మలోన॥ 371

మ॥ ఘురువక్షోజమహాచలేంద్రవిలసత్కూటంబులన్ సత్తప
శ్చరణల్పాని గభీరనాభినరసిన్ స్నానక్రియల్ సల్పివి
స్ఫురదంచత్కటిభూప్రదక్షిణము నేర్పల్మెఱఁగావించి శం
బరద్విడ్భ్రాహ్మసుఖాప్తిగాంచె ధరణీపాలావతంసంబొగిన్॥ 372

సీ॥ రాజసింహుల నఖాంకురములు సోఁకకయున్న
కోమలీ (పృథు) కుచకుంభములను
రాజమత్తేభ సంరంభమెచ్చకయున్న
నాళీకముఖి నిమ్న నాభిసరసి

రాజమార్తాండ కరస్ఫూర్తిఁ జెడకున్న
బాల శచోత్పలపత్రగరిమ
రాజేంద్రుచేతఁ బారణసేయఁబడకున్న
యంగన మధురాధరామృతంబు
రాజసార్వభౌమ రథస మొందకయున్న
కాంతజఘనతలమహాంతరీప
మును నృపాంగసంగఘనపారవశ్యాప్తి
యుపిద కెలుకిపడక యుండెఁగాక॥ 373

చ॥ ఖరనఖపంక్తి నిబ్బరపుగిబ్బిచనుంగవ గ్రుచ్చిగ్రుచ్చి సుం
దరరదనాంకురంబుల సుధామధురాధరమెల్లఁ గంటుగాఁ
గఱచి భుజాయుగంబునను గాంచనగాత్రము గట్టిపెట్టి శా
పురే! నృపుఁ డెంగెఁ దత్కృతవిమోహామహర్నిశబద్ధబన్ధముల్॥

సీ॥ స్తనితవైభవరీతిఁ దసరారె రత్నకం
కణసాంద్రితరఝణంఝణరవంబు
ఘనఘనానీలతఁ గనుపట్టె వరనిల
చంచచ్చిరోగుహ సంచయంబు
శక్రశరాసనోజ్జ్వలతనొప్పె లతాంగి
సీమంతరేఖావిశేషలక్ష్మి
విద్యుల్లతాస్ఫూర్తి వెలసె నన్యోన్యంబు
సంప్రాప్తచారువీక్షణగణంబు
భూరితరవర్షధారావిభూతిఁదనరె
భాసురాంగజఘర్మకబంధరాజి
అహహ! యత్యద్భుతావహంబగుచునప్పు
నీరదాగముపోల్కెఁ జె నిధువనంబు॥ 375

కం॥ ఇత్తెఱఁగున నృపచంద్రుడు। మత్తద్విపయానఁగూడి మన్మథసౌఖ్యా
యత్తవికస్వరభాస్వర। చిత్తాబ్జుండగుచు మిగులఁ జెలఁగుచునుండెన్

కం॥ వలరాజువంటిచక్కని
చెలువుఁడు దినదినము బోధసేయఁగనంతన్
జలజాతపత్త్రనేత్త్రికి
విలసద్వ్రీడాభరంబు విడఁబాఱెన్ ॥ 377

సీ॥ మగఁ డెంచి మొగమున మొగముఁ జేర్చిన ముద్దు
మొగము మోమునఁ జేర్చు సగురుబోఁణి
ప్రాణనాథుఁడు గాఢపరిరంభణము సేయఁ
బరిరంభణము సేయఁ బద్మనేత్రి
మోహనాంగుండు కెమ్మోవి తేనియలాన
మోవి తేనియలాను ముద్దుగుమ్మ
చెలువుండు నిద్దంపుఁజెక్కిలి ముద్దాడఁ
జెక్కిలిముద్దాడు సితకరాస్య
గీ॥ అతులితాద్భుతచతురంత నహారహంబు
భర్త తన్నెడఁబాయ కభ్యాసపఱుప
సంగనామణి యభిముఖయ్యె తనర్చె
బహుళలజ్జానుబంధంబు పాయుకతన॥ 378

తే॥ కౌఁగిటఁ గదిసి కదియుసికలికి కులుకు
గుబ్బ (దోయిటఁ బతి) రొమ్ము గ్రుమ్మసాగె
తనర రతికోడి విముఖతదాల్చుతరుణి
యుపరిసురతంబు తనుదానె యొందసాగె॥ 379

సీ॥ తారహారచ్ఛట ల్తాండవంబొనరింపఁ
గరకంకణధ్వను ల్ఘల్లుమనఁగఁ
బలుచగా నలఁదిన కలపంబు చిటులంగ
గురుకుచకుంభంబు లొరసికొనఁగఁ
గాఁదీఁగె జవ్వాడ ఘర్మాంబుకణములఁ
గమ్మకస్తురితిలకంబు కరఁగ

సిగనిడు క్రొవ్విరు ల్చిందువందగరాల
వరరత్నమేఖల వరలఁగాఁగ
గీ॥ బానఁగఁ బైపైని గళరవమ్ము చెలఁగంగఁ
జూవు లను రాగరసము విస్ఫూర్తిఁ జిలుక
బాలికామణి యానందపారవశ్య
కలన విభుఁ డొంద నుపరతిసలిపె నపుడు॥ 380

శా॥ నానాశ్లేష సమృద్ధిఁ జెంది రసపూర్ణస్ఫూర్తి నన్నట్టఁ జెం
పూనం బాటెడు వృత్తగౌరవ ఋచే నొప్పై మహాగూఢభా
వానూనస్థితిమీఱి సత్కవికృతోద్యత్కావ్యలీలన్ వధూ
పీనోరోజయుగంబు పొల్చె నటులా పృథ్వీశుఁ బైకొన్న చోన్॥ 381

క॥ నీలాలక కొనుఁ బైరతి
బాలామణి క్రిందుపఱచెఁ బ్రాణేశ్వరు, న
లీలాగతులఁ బరస్పర
హేలాకృతి వితతరతము లెనకమెసంగన్॥ 382

సీ॥ బంధురగంధి సౌగంధికాకలితంబు
సుందరకుచ చక్రశోభితంబు
కమనీయమృదుహస్త కమలమనోజ్ఞంబు
నీలకుంతలభృంగ లాలితంబు
వరరోమరాజి శైవాలవిస్ఫురితంబు
వీక్షణరాజీవ విలసితంబు
మహితప్రపాద కూర్మవిలాసరుచిరంబు
రమ్యవళీభంగ రాజితంబు
గీ॥ నైన హేమావతీలలామాభిరామ
మంజులావణ్యకాసారమధ్యసీమ
నవనిపాలకమదరాజహంసమప్పు
డోలలాడు చునుండె మహోత్సవమున॥ 383

వ॥ మఱియు శ్రీమన్నారాయణ ప్రసాదాసాదిత పారిజాతప్ర
భావప్రభూత సకలర్తు సౌభాగ్యలక్షణలక్షితంబులగు శృంగారోద్యాన
వాటీకాంతారంబులను విమలకమలకల్హార కైరవల హంసికా గంసావ
తంస సంసదభిరామంబులగు కాసారతీరంబులను రోహిణీకాంతకాంత
కాంతోపల పుష్యరాగాబ్జరాగసుందరంబులగు కృతకవసుంధరాధర
కందరమ్ములను నతిస్వచ్ఛతరుగుళుచ్ఛ ఫలరసధారాప్రవాహంబులగు
ద్రాక్షాకాయమానాభ్యంతరంబులను జల్లనగు నుల్లెతీవపొదరిండ్లను
గొప్పలై యొప్పుమిగిలిన కురువేరుచప్పరంబులను జాంబూనదాంబ
రాభరణమాల్యానులేపనసమృద్ధిం జెంది గంగాకురంగనయనం గూడి
శంతనుండు వివిధవిలాసక్రీడలం గ్రీడించుచు 384

తే॥ కమలనాభుండొసంగిన కామధేను
వాత్మగృహముననిల్పి యిష్టార్థ మొసఁగ
గామినీమణియైన గంగాంగతోడ
సహితుఁడై యశ్వమేధము ల్పెక్కునర్చె॥ 385

సీ॥ నెలమూఁడువర్షము ల్పొలుపొందవర్షించె
దుర్భిక్షచయములు దొలఁగిపోయె
సకలసస్యసమృద్ధి సక్షేత్రచక్రమొప్పారె
ధర్మంబు నాల్గుపాదములనడచె
సర్వకాలముల రాజద్గతిఫలియించి
విలసిల్లెనంతయు వృక్షతతులు
తొలఁగె నుపద్రవంబులు రాష్ట్రమెల్లను
చోరులకాంక్షలు దూరమయ్యె
విప్రజనకృతహోమము ల్వృద్ధిఁజెందె
సాధుజనముల కత్యంతసౌఖ్యమొదవె
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రుఁడైన
శంతనుండేలునట్టి రాజ్యంబునందు॥ 386

కం॥ అనిన న్వైశంపాయనమునిఁ గని జనమేజయుండు మ్రొక్కుచుఁ బలికెన్
"వినఁగల్గె నీదుకరుణను ఘనమోక్షదమైన పుణ్యకథ సుచరిత్రా"॥ 387

కం॥ శ్రీతరుణీహృదయేశ్వర! పాతకహర! సర్వలోకపావన! వేదా
తీత! భవబాధమోచన! పీతాంబర! భీష్మబలివిభీషణవరదా!
కూఁతును జెనిచి కుమారికి నాతతగతి ధారవోయక నుపైనవరుఁ
బ్రీతిఁ బరికించి యొసఁగిన భాతిని సుత్యావ్యకన్యభక్తిపయుక్తిన్
భూతలనేతలకొసఁగక ధాతలధాతవు ఫలప్రదాతవు సుజన
త్రాతవు బ్రహ్మాండోత్కర నేతవు నీవ (నుచు నిడితి) నిర్మలలీలన్ 388

సీ॥ సకలదేవాధ్యక్ష! సన్మునీశ్వరపక్ష!
వైజయంతీవక్ష! వారిజాక్ష!
(శతపత్రసమనేత్ర!) శంకరీనుతిపాత్ర!
కపటనాటకసూత్ర! కలుషజైత్ర!
ఘనఘనాఘననీల! కాంచనోజ్జ్వలచేల!
కమలానుకూల! పురస్కారవిశాల!
మర్దితాసురవీర! మదనకోట్యాకార!
యాశ్రితమందార! హతవికార!

గీ॥ భవ్యసుగుణాలవాల! కృపావిశాల!
హారితవరగోత్ర! (పాలితపాండుపుత్ర!)
శంఖచక్రాబ్జహస్త! శశ్వత్ప్రశస్త!
కంసపాథోధిరాడ్ధాను! కదనభీమ!॥ 389

గద్య॥ ఇది శ్రీమద్వేంకటేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త కవిత్వవిద్యా
విచిత్రాపస్తంబసూత్ర హారితసగోత్రపవిత్ర వెంకటనరసయా
మాత్యపుత్రాన్నమరాజాన్వయపారావారసంపూర్ణ
సుధాకర సకలగుణరత్నరత్నాకర విద్వజ్జనవిధేయ
రమణయనామధేయప్రణీతంబైన శంతనురాజచరి
తంబను మహాప్రబంధంబునందు సర్వమును
జతుర్థాశ్వాసము సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 7 | బామోద | బైమోద | 40 | 5 | నభ్రపు | నబ్రపు |
| 2 | 13 | చంద్రకా | చంద్రికా | | 16 | కాంతుడో | కాంతుండో |
| 6 | 2 | శాంతన | శంతను | | | రతికాంతుండో | రతికాంతుండో |
| | 18 | శంతన | శంతను | 44 | 17 | వ్యాపునిం | వ్యాప్తునిం |
| 9 | 11 | మహోన్నతి | మహోన్నత | | 19 | గతభ్రాంత | గతాపత్ర |
| 14 | 12 | రుశ | రుచ | 45 | 18 | క్రృత | క్రృతు |
| 15 | 7 | స్వాంతమున | స్వాంతముల | 53 | 17 | శస్త్రలు | శుస్త్రలు |
| 16 | 1 | తుసాపస్త్రి | తుషారాత్రి | | 24 | నియు | యుని |
| | 17 | భర్మ | భర్మ | 54 | 18 | విమతాగము | విమతాంగము |
| | 25 | చిత్రత | చిత్రము | 59 | 17 | దీనత | ధీనత |
| | 26 | బోటులు | చోటులు | | 22 | నతి | న్నతి |
| 17 | 5 | వృత్తి | వృత్త | 60 | 8 | సండు | రండు |
| | 10 | బరుగువాణి | బరుగువారి | 62 | 2 | బాగమతి | బాగమర |
| | 11 | వృత్తి | వృత్త | 63 | 7 | ఛటచ్ఛటా | చ్ఛటచ్ఛటా |
| | 20 | మార్గంబులొప్ప | మార్గంబులొప్ప | | 8 | కీలాప | కలాప |
| 26 | | ప్రమదానగతులు | ప్రమదానుగతులు | 68 | 19 | పటపుకా | పట్టపురా |
| 18 | 8 | భాసురులు | భాసురుల | 69 | 7 | భేరి | భేరి |
| | | భూసురులు | సూసురుల | 71 | 12 | లవాంబురా | లలాంబురా |
| 21 | 5 | కృతాంగ | కృతాగ | | 14 | ఫేకాటి | ఫేకాతి |
| 24 | 16 | ధమ్మిండు | ధమ్మిండ | 72 | 4 | మూలోడ్యాణ | మూలోడ్యాణ |
| | 17 | ద్యుచ్ఛిరు | త్యుచ్ఛిత | 73 | 11 | మైఅని | మైత్రిని |
| | 28 | నశ | నవ | 77 | 7 | ప్రబ | ప్రభ |
| 25 | 2 | సిత | శిత | 80 | 19 | చందాతిప | చంద్రాతప |
| 27 | 14 | కలా | లీలా | 86 | 5 | చేసిశమింతు | చేశమ్మింతు |
| 32 | 5 | లిందపంచ | లిందువంశ | 87 | 6 | చక్రములో | చక్రముల్ |
| | 6 | త్కలశ | నక్కలశ | 88 | 12 | బెండుల | బెండుల |
| | 14 | రహించె | వహించె | | 14 | కలలోను | కలలోనను |
| 35 | 7 | ఘున | ఘన | 89 | 22 | యింద్రుడేకు | యింద్రుడేడ |
| 36 | 11 | సురతంత్ర | సుగతతంత్ర | 95 | 4 | కన్నియు | మన్నియు |
| | 16 | సీతా | శీతా | 97 | 13 | ఇట్లు | ఇట్టి |
| 37 | 16 | స్ఫురతాంబూల | స్ఫురత్తాంబూల | 101 | 15 | చిత్రతర | చిత్రకర |
| | 20 | నిష్ఠురాంకార | నిష్ఠురాంగార | 104 | 5 | రేక | రేఖ |
| | 26 | తగ | దగ | 113 | 6 | వెల | వెలి |

| | | | |
|---|---|---|---|
| 118 | 8 | రాజద్రజనీ౯ | రాజద్రజనీ |
| 121 | 19 | వల్లి | వల్లీ |
| 128 | 30 | బంధురగతులు | బంధురగంధగతులు |
| 130 | 4 | మధువిద్గంభీర | మధులిడ్గంభీర |
| 134 | 15 | మేసరి | వేసరి |
| 138 | 14 | ఛింతా | ఝింతా |
| 140 | 16 | చున్నది | మన్నతి |
| 144 | 6 | చేరము | బేరము |
| 145 | 17 | హాస్తాంగత్య | హస్తసాంగత్య |
| 147 | 14 | నాళీకారము | నాళీకాకరము |
| 160 | 5 | భాగాభ్యోగ | భాగాభోగ |
| | 6 | కొత్తుప్పల్ల | కోత్తుప్పల్ల |
| | 11 | ఘీకార | ఘీంకార |
| | 22 | వాపిన | వాసిన |
| 168 | 1 | ద్విపంబు | ద్వీపంబు |
| 189 | 8 | బైరవా | భైరవా |
| 197 | 11 | తెనియ | తేనియ |
| 199 | 14 | బూని | బూన |
| 212 | 21 | హాయిూ | హారెూ |
| 214 | 22 | మరుని | కరముసారకు |
| 228 | 6 | నిష్కాళ్లీ | నిష్కాళ్లికుట్ |
| 229 | 8 | సమాలంక | సమాలంకృ |
| | 10 | చ్చక | చ్చక్రి |
| | 26 | దేశంబుల | దేశంబులు |
| 230 | 5 | పచ్చనిట | పచ్చనా |
| | 6 | తేజిపై | తేజిపై |
| 231 | 18 | దంభోళి | దంభోళి |
| | 17 | ఖ్యాతిచె | ఖ్యాతిచే |
| | 20 | గాధయము | గాధేయము |
| 232 | 11 | టక్కాళీరి | టక్కాళీరి |
| | | వయూర్మి | వయ్యూర్మి |
| | 12 | హేతు | హేతు |
| | 13 | కీలాల | కీలాల |
| | | తీవే | తీవేకదా |
| | 26 | బల్లండిమై | బల్లండిమైం |
| 233 | 14 | కోక | కోక |
| | 15 | హెన్కలీ | హెూఖలీ |
| | 16 | మర్కప | మర్కష |
| | | ఖండర్ఘురీ | ఖండర్ఘురీ |
| | 21 | లోపిల్ల | లోశిల్ల |
| 234 | 16 | నమం: | నమః |
| | 17 | మాలా | మాలా |
| | 23 | దోష్ట్యంత | ఓష్ట్యంత |
| | 24 | జాప | చాప |
| 235 | 9 | భాధవ | భాధవ |
| 243 | 21 | లిమ | లీమ |
| 244 | 7 | మిూటి | మిూటి |
| | 1 | చాటు | జాటు |
| 245 | 18 | సింధూర | సిందూర |
| 249 | 7 | ఉందిందిర | ఇందిందిర |
| 250 | 22 | బాల | చాల |
| 252 | 5 | సుధాంభోధి | సుధాంధోధి |
| 254 | 19 | త్రెర | లెర |
| 255 | 20 | ధారా | ధారా |
| 258 | 15 | పుష్పవిట్సం | పుష్పలిట్సం |
| | | కులంబు | కులంబు |
| 259 | 28 | నాతరంబున | నాతరంబున |
| 260 | 7 | బుద్దులు | బుధులు |